# آداب المسلم (بلغة تلغو)

## (في ضوء الكتاب والسنة الصحيحة)

# ముస్లిం వ్యవహార శైలి




*Published by:*

**Shanti Sandesham Welfare Society**

T.Sundupalli, Rayachoti Road, Kad apa Dist.

Andhra Pradesh, India - 516 130

**Cell: +91 97030 04918 +91 87902 02229**

**+91 95055 97229 +91 80086 41947**

*Name of the Book* : ***Muslim Vyavahara Shaili***

*Composition By* : ***Zafarullah Khan Jamia Nadvi***



*Second Edition* : *May 2017*

***Price*** : ***Rs.60-00***

*Copies* : *5000*

*Design & Typeset By :*
**Al Baseer Graphics, Hyderabad, 9441055065**

Published by:
**Shanti Sandesham Welfare Society**
T.Sundupalli, Rayachoti Road, Kadapa Dist.
Andhra Pradesh, India - 516 130
Cell: +91 - 97030 04918   +91 - 87902 02229
+91 - 95055 97229   +91 - 80086 41947

***Books also Available at:***

**Mohammed Asif**
**Islamic Information Library, KADAPA**
Cell: 9701872989
Email: ikt@islamicinformationlibrary.com

**Al Baseer Graphics,**
Hyderabad, Cell: 9441055065

# విషయసూచిక

పేజి

بسم الله الرحمن الرحيم

# ముందు మాట

الحمد لله والصلاة والسلام على سيدنا ونبينا وحبيبنا رسول الله صلى الله عليه وسلم، وعلى آله وصحبه أجمعين..امابعد:

నిస్సందేహంగా సమస్త స్తోత్రములు అల్లాహ్ కొరకే, మేము ఆయననే స్తుతిస్తున్నాము, ఆయననే సహాయం అర్థిస్తున్నాము. ఆయనను మాత్రమే క్షమాభిక్ష ప్రసాదించమని కోరుచున్నాము. మాకు మేము కల్గించుకునే కీడుల నుండియూ, మా కర్మల చెడుల నుండియూ మేము అల్లాహ్ శరణు కోరు చున్నాము.

అల్లాహ్ సన్మార్గం చూపినవారిని ఎవరూ మార్గభ్రష్టులను చేయలేరు. ఆయన ఎవరినైతే మార్గభ్రష్టులను చేస్తాడో వారిని ఎవరూ సన్మార్గంపై నడిపించ లేరు. అల్లాహ్ తప్ప ఆరాధనకు అర్హుడు ఎవరూ లేరని సాక్ష్యమిస్తున్నాను, మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం అల్లాహ్ యొక్క దాసుడు మరియు సందేశహరుడు అని నేను సాక్ష్యమిస్తున్నాను. అల్లాహ్ ఆయనపై, ఆయన కుటుంబీకులపై, ఆయన అనుచరులపై, అలాగే ప్రళయం వరకు ఉత్తమ రీతిలో ఆయనను అనుసరించిన వారందరిపై కారుణ్యం, శాంతి కురిపించుగాక!

ఇస్లాం ధర్మం ఉన్నత నైతిక ప్రమాణాలు గల ధర్మం. సంపూర్ణ జ్ఞానం, వివేకంతో కూడుకున్న ధర్మం. వ్యక్తిగతంగా మరియు సామాజికంగా పాటించ వలసిన గొప్ప సంస్కారాలు అందులో ఉన్నాయి. ప్రతి మనిషి గౌరవ ప్రతిష్ఠ లతో బ్రతకడానికి కావలసిన విధానాలు ఈ ధర్మంలో స్పష్టంగా తెలుప బడ్డాయి. ఒకవైపు అల్లాహ్ ఉనికిని మరియు అల్లాహ్ గుణగణాలను పూర్తిగా తెలుపుతూనే మరో వైపు అల్లాహ్ భక్తులు ఆ అల్లాహ్‌ను ఎలా విశ్వసించాలో, ఎలా ఆరాధనలు పాటించాలో, మూఢ నమ్మకాలకు ఎలా దూరం కావాలో స్పష్టంగా బోధపరుస్తుంది.

ఈ ధర్మంలో ఒక వ్యక్తి మరో వ్యక్తి పట్ల, ఒక సమూహం మరో సమూహం పట్ల, ఒక దేశం మరో దేశం పట్ల ఎలా వ్యవహరించాలన్న నియమ నిబంధనలను పూర్తిగా తెలుపడం జరిగింది. అసహజమైన నియమాలు కాకుండా, ఆచరించలేని విధానాలు లేకుండా, మానవ మర్యాదలు భగ్నం కాకుండా, ఉన్నతమైన జీవితాన్ని గడపవలసిన ఉన్నత నైతిక ప్రమాణాలను తెలుపడం జరిగింది.

వీటి కార్యసాధన కొరకు అల్లాహ్ అనేక మంది ప్రవక్తలను ప్రభవింపజేసి, వారందరిని అల్లాహ్ తన ఇష్టానుసారం నడిపించి గౌరవ ప్రతిష్టలను ప్రసాదించాడు. సాధారణ ప్రజలు కూడా ఉన్నతమైన జీవితాన్ని పొందాలంటే మరియు సుఖసంతోషమైన జీవితం గడపాలంటే వారి అడుగు జాడల్లో నడుచుకోమని ఆజ్ఞాపించాడు. ఇలా తెలియజేసే పరంపర ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం రాకతో పరిసమాప్తమయింది. కనుక ప్రజలు ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం గారి అడుగుజాడల్లో నడుచుకుంటే ఇహపరాలలో సుఖసంతోషాలు పొందుతారు. పరలోకంలో సాఫల్యం కూడా వారి సొంతం అవుతుంది. ఖుర్ఆన్ గ్రంథంలో అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

**يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا اتَّقُوا اللَّهَ وَقُولُوا قَوْلًا سَدِيدًا – يُصْلِحْ لَكُمْ أَعْمَالَكُمْ وَيَغْفِرْ لَكُمْ ذُنُوبَكُمْ وَمَنْ يُطِعِ اللَّهَ وَرَسُولَهُ فَقَدْ فَازَ فَوْزًا عَظِيمًا(الاحزاب:70–71)**

**"ఓ విశ్వాసులారా! అల్లాహ్‌కు భయపడండి. మాట్లాడితే సూటిగా మాట్లాడండి (సత్యమే పలకండి) తద్వారా అల్లాహ్ మీ ఆచరణలను చక్కదిద్దుతాడు. మీ పాపాలను మన్నిస్తాడు. ఎవరయితే అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయత కనబరచాడో అతను గొప్ప విజయం సాధించాడు."**

***(సూరతుల్ అహ్‌జాబ్: 70–71)***

ప్రస్తుతం మన సమాజంలో అధిక శాతం ప్రజలు ధర్మాన్ని పట్టించుకోకుండా ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం విధేయతను లెక్క చెయ్యకుండా తమ ఇష్టానుసారం జీవించడమే గొప్పగా భావిస్తున్నారు. మంచి, చెడులకు ఒక కొలబద్ద అనేది లేనేలేదు. సద్గుణాలకు, దుర్గుణాలకు తేడా

లేకుండా బ్రతుకుతున్నారు. పెద్దవారి యెడల మర్యాద సన్నగిల్లింది. సిగ్గు, బిడియం విడిచిపెట్టి విచ్చలవిడిగా తిరుగుతున్నారు. సహజీవనం (వివాహేతర సంబంధం) పెచ్చుమీరుతుంది. మర్యాదపూర్వకమైన వివాహ సంబంధాలు తుడుచుకుపోతున్నాయి. మనిషి తిరిగి అజ్ఞానపు కాలానికి చెందిన గుణహీణమైన జీవితాన్ని అనుసరిస్తున్నాడు.

ఓ ప్రియమైన విశ్వాసులారా! అల్లాహ్ మీకు ఒక పవిత్రమైన జీవితాన్ని ప్రసాదించాడు. ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం జీవితపు అన్ని రంగాలలో మనకు ఉత్తమమైన మార్గదర్శకం చూపెట్టారు. మరియు వారు జీవించే విధానాన్ని అనేక పాయలుగా విభజించి అనుసరించి వాటి ప్రకారం నడుచుకోమన్నారు.

శుచి శుభ్రతలు, సిగ్గు బిడియాలు, నీతి, నిజాయితి, అప్పగింతలు, కరచాలనం మరియు సలాం చేసే నియమాలు, అనుమతి తీసుకునే సభా సమావేశం మర్యాదలు, ఆవలింతలు మరియు తుమ్ముల వాస్తవాలు, వాటి నియమాలు మరియు తినే, త్రాగే విధానము, నిద్రపోయి, మేల్కొనే నియమాలు, వివాహ నియమాలు మరియు అంత్యక్రియల వంటి ముఖ్యమైన అంశాలను ఖుర్ఆన్ మరియు సహీహ్ హదీసుల వెలుగులో ఈ పుస్తకంలో వివరించబడ్డాయి.

ఈ పుస్తకంలో ప్రచురించబడిన నియమాలను అనుసరించడం ద్వారా ప్రతి ఒక్కరు తమ జీవితాలను సంస్కరించుకోవచ్చు. ఎవరైతే అల్లాహ్‌ను మరియు ప్రవక్త ముహమ్మద్ (స)ను అనుసరిస్తున్నారో వారికి తమ గుణాలను సంస్కరించుకునే అవకాశం లభ్యమయ్యినట్లే. వారికి ఇహలోకంలో గౌరవప్రదమైన జీవితంతో పాటు పరలోకంలో పుణ్యాలు కూడా ప్రాప్తిస్తాయి.

తిరుపతి
10-10-2013

**– జఫరుల్లాహ్ బషీర్ ఖాన్**

# 1. శుచీ శుభ్రతలు

శుచీ శుభ్రతను అరబీ భాషలో **"తహారత్"** అంటారు.

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు: **"వ సియాబక ఫ తహ్హిర్"** (నీ దుస్తులను పరిశుభ్రంగా ఉంచుకో).[1]

అన్నివిధాల పరిశుభ్రతను అంటే శరీర శుభ్రత, దుస్తుల శుభ్రత మరియు స్థల శుభ్రతను పాటించడాన్ని **"తహారత్"** అంటారు.

అపరిశుద్ధతను అరబీ భాషలో **"హదస్"** అంటారు.

అన్నివిధాల శరీర, దుస్తుల అశుద్ధత మరియు ప్రదేశ అశుద్ధతను **"హదస్"** అంటారు.

ఇస్లాం ధర్మంలో శుచీ శుభ్రతలకు ఎనలేని ప్రాముఖ్యత ఉంది. ఎందుకంటే, పరిశుభ్రత లేనిదే ఏ ఒక్క ఆరాధన స్వీకరించబడదు.

పరిశుభ్రత విశ్వాసానికి సంబంధించిన ముఖ్యమైన ఒక అంశం. ఎందు కంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: **"అత్తుహూరు షత్రుల్ ఈమాన్"** (పరిశుభ్రత విశ్వాసంలో సగ భాగం).[2]

## తహారత్ మూడు విధాలు

**ఒకటి:** హదస్ నుండి తహారత్ ( అంటే ఏ పరిస్థితుల్లోనైతే గుస్ల్ (స్నానం), వుజూ 'వాజిబ్' లేదా 'ముస్తహబ్' అవుతుందో ఆ పరిస్థితుల్లో గుస్ల్ (స్నానం) లేదా వుజూ చేసి ధర్మ శాస్త్రానుసారం పరిశుద్ధతను పొందడం).

**రెండవది:** కంటికి కనబడే మలినాల నుండి శరీరాన్ని, వస్త్రాలను మరియు ప్రదేశాన్ని పరిశుభ్ర పరచడం.

**మూడవది:** శరీరంలోని వివిధ భాగాల్లో ఏయే మలినాలు మురికి పుట్టు కొస్తుంటాయో వాటిని శుభ్రపరచడం (ఉదాహరణకు, దంతధావనం, ముక్కు

---

*1. (సూరతుల్ ముద్దస్సిర్:4).*

*2. (సహీహ్ ముస్లిం: 328).*

పుటాలను శుభ్రపరచడం, గోళ్ళను కత్తిరించడం మరియు నాభి క్రింది వెంట్రుకలను తొలగించడం లాంటివి).[1]

ఎలాంటి పైశాచిక ప్రభావానికి లోనుకాకుండా అందులో లీనం అవకుండా వుండే సంపూర్ణ ఆరోగ్యవంతుడు, నిర్మల స్వభావి అయిన ఒక మనిషి ఎప్పుడైతే అపరిశుభ్రతకు గురవుతాడో, అప్పుడు అతని స్వభావంలో ఒక విధమైనటువంటి అసౌకర్యం చోటు చేసుకుంటుంది. అంటే, తీవ్రమైన మలమూత్ర విసర్జన అవసరం కలిగినప్పుడుగాని, సంభోగం అనంతరంగాని, పరిశుభ్రం కానంతవరకు అతని మనసు ఒక ప్రత్యేకమైన వెగటు స్థితిని, అసౌకర్య స్థితిని ఎదుర్కొంటుంది. ఆ అవసరం తీరిన తరువాత చక్కగా పరిశుభ్రతను పొందినప్పుడు, లేక సంభోగానంతరం గుసుల్ (స్నానం) ముగించుకుని శుభ్రమైన వస్త్రాలు ధరించి, అత్తరు లాంటి సువాసన రాసుకున్నపుడు అతని అసౌకర్య స్థితి దూరమవుతుంది. అశుద్ధత అయితే అతడ్ని సతమతం చేసిందో, స్థిమితం లేకుండా చేసిందో, అది దూరమై అతనిలో ఉత్సాహం, ఉల్లాసం, సంతోషం నిండుతుంది. అందుకని మొదటి స్థితిని **'హదస్'** అంటే అపరిశుభ్రత అని, రెండవ స్థితిని **'తహారత్'** అంటే 'పరిశుభ్రత' అని అనబడుతుంది.

బుద్ధిజ్ఞానాలు కలిగిన మనషులెవరైనా తమ సహజ నైజం రీత్య పరిశుద్ధావస్థను మాత్రమే ఇష్టపడతారు. అపరిశుభ్రతను ఎట్టి పరిస్థితిలోనూ ఇష్టపడరు. నిజానికి పరిశుద్ధ స్థితి దైవదూతల స్థాయి కలిగిన సుగుణం, అపరిశుద్ధ స్థితి షైతాన్ లక్షణం. ఎప్పుడూ పరిశుద్ధంగా ఉండేవారు దైవదూతల గుణ స్వభావంలా నిర్మలంగా, నిష్కల్మషంగా, స్వచ్ఛంగా ఉంటారు. తహారత్ పాటించనివారు తరచూ షైతాన్ ప్రలోభాలకు గురవుతూ, షైతాన్ (పైశాచిక) చేష్టలకు పాల్పడే అవకాశం ఉంది. వారి హృదయాన్ని, ఆత్మను అజ్ఞాన తిమిరం కప్పివేస్తుంది.[2]

## పరిశుభ్రత ప్రాముఖ్యత

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "అల్లాహ్ పశ్చాత్తాప పడే వారిని, పారిశుద్ధ్యాన్ని అవలంబించేవారిని ఇష్టపడతాడు."[3]

---

1. *(హుజ్జతుల్లాహిల్ బాలిగ, అబ్వాబుత్తహారత్, పుట: 173, హదీసు పరిమళం – 3వ భాగం, 3డవ పేజి).*
2. (హుజ్జతుల్లాహిల్ బాలిగ: సంపుటి –1, పుట – 54, హదీసు పరిమళం – 3డవ భాగం, 2వ మరియు 3డవ పేజి).
3. (సూరతుల్ బఖరా: 222)

"బాగా పరిశుద్ధతను పొందటాన్ని ఇష్టపడేవారు అందులో (మస్జిదె ఖుబాలో) ఉన్నారు. బాగా పరిశుద్ధతను పాటించేవారిని అల్లాహ్ ప్రేమిస్తాడు."[4]

పరిశుద్ధతను బాగా పాటించే ఈ సజ్జనులు ఎవరు? వారు ఖుబా వాసులని హదీసు ద్వారా రూఢీ అవుతోంది. "అల్లాహ్ మీ శుచీ శుభ్రతలను కొనియాడాడు, ఇంతకీ మీరు ఏం చేస్తారు?" అని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వాళ్లను ఒకసారి దర్యాప్తు చేయగా, "మేము మట్టి పెడ్డలను ఉపయోగించటంతో పాటు, నీరును కూడా ఉపయోగిస్తాం" అని వారు వివరించారు.[5]

హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజియల్లాహు అన్హు) గారిని ఒక ముష్రిక్ (బహు దైవా రాధకుడు) కాలకృత్యాలు తీర్చుకునే పద్ధతి సయితం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం)గారు మీకు నేర్పారా? అని ఎద్దేవా చేశాడు. దానికి హజ్రత్ సల్మాన్ (రజియల్లాహు అన్హు) గారు 'అవును' "మేము మల మూత్ర విసర్జన సమయాల్లో ఖిబ్లా వైపునకు అభిముఖమై ఉండటాన్ని లేదా కుడి చేత్తో కడుక్కోవటాన్ని లేదా మూడుకన్నా తక్కువ పెడ్డలతో ఇస్తింజా (పరిశుభ్రత) చేయటాన్ని లేదా (ఎండిన) పేడతో, లద్దెతో, ఎముకతో ఇస్తింజా చేయటాన్ని అల్లాహ్ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) వారించారు" అని సగర్వంగా సమాధానమిచ్చారు.[6]

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా ప్రవచించారు: "మిస్వాక్ ద్వారా నోరు శుభ్ర మవుతుంది. మరియు ప్రభువు (అల్లాహ్) ప్రసన్నత లభిస్తుంది."[7]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఒక హదీసులో ఇలా ఆదేశించారు: "నా అనుచర సమాజం లేక ప్రజలు ఇబ్బందికి లోనవుతారనే భయం గనక నాకు లేకపోయినట్లయితే నేను వారిని ప్రతి నమాజు సమయంలోనూ మిస్వాక్ చేయాలని ఆదేశించేవాణ్ణి"[8].

---

*4. (సూరతు తౌబా: 108).*
*5. (ఇబ్నెకసీర్, అహ్సనుల్ బయాన్ తెలుగు : 880).*
*6. (సహీహ్ ముస్లిం : 385).*
*7. (సహీహ్ నసాయి : 5, సహీహ్ అల్ జామే : 6008, ముస్నద్ అహ్మద్: 23072).*
*8. (సహీహ్ బుఖారీ : 838, సహీహ్ ముస్లిం :1009).*

# మరుగు దొడ్డికి పోయే విధానం

ప్రతి మనిషి నిద్ర లేవగానే అన్నిటి కంటే ముందు మలమూత్ర విసర్జన చేసుకున్న తరువాతే ఇతర పరిశుభ్రతలకు ముమ్మరమవుతాడు. కనుక ఇక్కడ మనం మల మూత్ర నియమాల గురించి తెలియజేస్తున్నాము.

హజ్రత్ ఇబ్ను అబ్బాస్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం; (ఒక రోజు) ప్రవక్త ముహమ్మద్ (స) రెండు సమాధుల వద్ద నుండి బయలుదేరారు. అప్పుడు ఇలా తెలిపారు: "వీరిద్దరూ సమాధులలో శిక్షలు అనుభవిస్తున్నారు. వారు అనుభవించే శిక్షలు ఏదో పెద్ద తప్పు చేయడం వల్ల కాదు. వారిలో ఒకడేమో మూత్రం తుంపరులు (చుక్కలు) వంటిపై పడకుండా జాగ్రత్త వహించేవాడు కాదు. మరొకడేమో చాడీలు చెప్పుకుంటూ తిరిగేవారు' అని తెలిపారు."[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) తన ప్రజలకు ప్రతి చిన్న పెద్ద విషయాల గురించి తెలియజేసి ఆయన ప్రేమను ఎలాగైతే పంచారో, అలాగే ఆయన మలమూత్ర విసర్జన చేసే అతి చిన్న పద్ధతిని కూడా నేర్పారు.

1. إِذَا أَرَادَ الْبَرَازَ انْطَلَقَ حَتَّى لَا يَرَاهُ أَحَدٌ "మలమూత్ర విసర్జనకు (మైదానంలో వెళ్ళితే ప్రజలకు) కనబడకుండా దూరంగా పోయేవారు"[2]
2. మరుగుదొడ్డిలోకి పోవుటకై దుఆ చేసుకోవాలి.

   (بِسْمِ اللهِ) اَللّٰهُمَّ إِنِّي أَعُوذُ بِكَ مِنَ الْخُبُثِ وَالْخَبَائِثِ.

   **(బిస్మిల్లాహి) 'అల్లాహుమ్మ ఇన్నీ ఆవూజు బిక మినల్ ఖుబుసి వల్ ఖబాయిస్'.**

   (అల్లాహ్ పేరుతో, ఓ అల్లాహ్! నేను అపరిశుభ్రమైన స్త్రీ, పురుష జిన్నాతు (ఖబీస్) ల నుండి నీ శరణు కోరుచున్నాను.)[3]
3. మరుగుదొడ్డి లోపలకు పోయేటప్పుడు ముందు ఎడమకాలు పెట్టి పోవాలి.
4. దుఆ పుస్తకాలు ఖురాను లేక వాటి ఆయతులు (వాక్యాలు) ఉన్న పుస్తకాలు, ఇస్లామీయ కరపత్రాలు మరుగుదొడ్డిలోకి తీసుకొని పోకూడదు.

---

1. *(సహీహ్ అబూదావూద్: 20, సహీహ్ తిర్మీది: 70, సహీహ్ సునన్ నసాయి:31)*
2. *(సహీహ్ అబూదావూద్: 2).*
3. *(సహీహ్ బుఖారీ: 139, సహీస్ ముస్లిం:563)*
4. *(సహీహ్ ముస్లిం:385).*

5. మలమూత్ర విసర్జనకు కూర్చుంటే ముఖం లేక వీపు ఖిబ్లా (కాబతుల్లాహ్) వైపు చేసి కూర్చోకూడదు.[4]

6. మలమూత్ర విసర్జనకు కూర్చుండేటప్పుడు భూమికి చేరువైనప్పుడు దుస్తులు తీయాలి.[2]

7. మలమూత్ర విసర్జన కూర్చుని చేయాలి. కూర్చోవడం కష్టమయితే నిలబడి మలమూత్ర విసర్జన చేయవచ్చును. కాని మూత్రపు చుక్కలు వంటిపై లేక కాళ్ళపై పడకూడదు.[3]

8. మర్మాంగాలను శుద్ధి చేసేటప్పుడు కుడి చేత్తో శుభ్రపరచడం నిషిద్ధం.

9. మల మూత్రాన్ని నీళ్ళతో కడిగి శుభ్రపరచాలి. లేక కనీసం మూడు మట్టి పెడ్డలతో శుభ్రం చేయాలి.[4]

10. పేడ పెడ్డలతో లేక ఎముకలతో శుభ్రం చేయకూడదు.[5]

11. ఎలాంటి ముఖ్యమైన కారణం లేకుండా మలమూత్ర విసర్జన చేస్తూ మాట్లాడకూడదు. అలాగే సలాము చేసిన వారికి జవాబు లేక అజాన్ జవాబు మరియు అల్లాహ్ నామస్మరణ చేయకూడదు.

12. మరుగుదొడ్డి నుండి బయటకు వచ్చేటప్పుడు కుడి కాలు బయట పెట్టి రావాలి. తరువాత **"గుఫ్రానక"** غُفْرَانَكَ ని చదవాలి.[6]

13. మల మూత్ర విసర్జన తర్వాత చేతిని మట్టి (సబ్బు)తో శుభ్రం చేసుకోవాలి.[7]

14. ప్రజలు నడిచే దారిలో లేక విశ్రాంతి కొరకు ఉండే చెట్ల క్రింద, పుట్టలలో, రంధ్రాలలో మలమూత్ర విసర్జన చెయ్యకూడదు.[8]

15. వుజూ మరియు స్నానం చేసే స్థలాల్లో (బాత్‌రూమ్‌లో) మూత్రం విసర్జన చేయకూడదు.[9]

16. మరుగు దొడ్డిలో విసర్జన తరువాత దొడ్డిని కూడా శుభ్రంగా ఉంచడం తప్పనిసరి బాధ్యతగా భావించాలి.

---

*2. (సహీహ్ అబూదావూద్: 14, సుననుల్ కుబ్రా వస్సుగ్రా లిల్ బైహఖీ:63).*

*3. (సహీహ్ బుఖారీ: 217, సహీహ్‌ముస్లిం:402).*

*4. (సహీహ్ ముస్లిం: 385)* 5. (సహీహ్‌ముస్లిం:3857)

*6. (సహీహ్ తిర్మిదీ: 7)* *7. (సహీహ్ అబూదావూద్: 45)*

*8. (సహీహ్ ముస్లిం: 397)* *9. (సహీహ్ అబూదావూద్: 27)*

# విధిగా స్నానం చేయవలసినవారు

స్త్రీలకు లేక పురుషులకు నిద్రలో లేక మెలకువలో వీర్యస్ఖలనమయితే, లేక వేరే కారణాల వలన వీర్యస్ఖలనమయితే విధిగా స్నానం చేయాలి.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్ల) సతీమణి హజ్రత్ ఉమ్మె సల్మా (రజియల్లాహు అన్హా) గారు ఇలా తెలియజేశారు:

"ఒక రోజు ఉమ్మె సులైం (రజియల్లాహు అన్హా) గారు ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) సమక్షంలో హాజరయ్యారు, తర్వాత ఇలా విన్నవించారు: "ఓ ప్రవక్తా! సత్యం తెలుపడంలో అల్లాహ్ సిగ్గుపడడు. స్త్రీలకు స్వప్న స్ఖలనమయితే వారు కూడా స్నానం చెయ్యాలా?" దానికి ప్రవక్త(స) "చెయ్యాలి" అని బదులిచ్చారు. స్వప్న స్ఖలన మయితే లేక దుస్తులపై వీర్యం కనిపిస్తే వారు (స్త్రీలు) కూడా స్నానం విధిగా చెయాలి."[1]

1. ఎవరికైనా స్వప్నస్ఖలనం అయ్యిందో, లేదో అనే అనుమానం ఉన్నట్లయితే అలాంటివారు తమ దుస్తులను చూసి తడిగా ఉన్నట్లయితే తప్పనిసరిగా స్నానం చేసుకోవాలి. తడిగా లేదంటే స్నానం అవసరం లేదు. ఎందుకనగా అతను అనుమానానికి గురి అయ్యాడే తప్ప వాస్తవానికి వీర్యస్ఖలనం కాలేదు.
2. స్నప్నస్ఖలనం గురించి పూర్తిగా తెలియదు కాని దుస్తులు తడిగా ఉన్నాయి. అలాంటి వారు కూడా విధిగా స్నానం చెయ్యాలి, అలాగే దుస్తులు కూడా శుభ్రం చేసుకోవాలి.
3. పగటి పూట ఏ సమయంలోనయినా దుస్తులలో వీర్యం కనిపించి నట్లయితే స్నానం చెయ్యాలి. ఆ రోజంతా చేసిన నమాజులను మరలా చదవాలి.

**గమనిక:** ఒకవేళ కోరికలతో వీర్యం రానట్లయితే, అతి వ్యాధి వలన వస్తుంటే వారు విధిగా స్నానం చేయనక్కరలేదు. అలాంటివారు ప్రతి నమాజు కొరకు మర్మాంగాన్ని కడిగి వుజూ చేసుకోవాలి.[2]

---

*1. (సహీహ్ బుఖారీ:5626)*

*2. (నైలుల్ అవ్‌తార్, ఫిఖ్‌హుస్ సున్నా).*

## లైంగిక సంబంధం వలన స్నానం చెయ్యాలి

భార్యాభర్తలు లైంగిక సంబంధం పెట్టుకున్నట్లయితే వీర్యం వచ్చినా రాక పోయినా విధిగా స్నానం చెయ్యాలి. అల్లాహ్ ఇలా ఆదేశించాడు: "వీరు అపరిశు ద్ధంగా (జునుబీ) ఉంటే స్నానం చేసుకోండి."[2]

ఇమామ్ షాఫయి (رحمة الله عليه) ఇలా వ్యాఖ్యానించారు:

అపరిశుద్ధం (జునుబీ) అంటే; స్వప్నస్థలనం లేక లైంగిక సంబంధాన్ని అంటారు. కనుక మర్మాంగాలు పరస్పరం కలిసిపోతే వీర్యస్ఖలనం జరిగినా జరగక పోయినా విధిగా స్నానం చెయ్యాలి. ఒక హదీస్‌లో ఈ విధంగా ఉంది: "ఒక వ్యక్తి తన భార్యతో సంభోగించినప్పుడు మర్మాంగాలు పరస్పరం కలిసిపోతే స్నానం విధిగా చెయ్యాలి"[3] మరో హదీసులో ఈ విధంగా ఉంది: "వీర్యస్ఖలనం కాకపోయినా విధిగా స్నానం చేయవలసిందే."[4]

## బహిష్టు, పురటి రక్తం

హైజ్ (బహిష్టు) ఆగిన తరువాత, నిఫాస్ (రుతుస్రావం, పురుటి రక్తం) నిలిచి పోయిన తరువాత మహిళలు విధిగా స్నానం చెయ్యాలి. కనుక అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చాడు:

**"ఓ ప్రవక్తా! నీవు వారికి ఇలా తెలుపు, అదొక అపరిశుద్ధత (హానికర మైన) స్థితి. కనుక బహిష్టు కాలంలో భార్యలతో (సంభోగానికి) దూరంగా ఉండండి. వారు పరిశుద్ధులు కానంతవరకు వారి వద్దకు పోకండి.'**

***(సూరతుల్ బఖారా : 222)***

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఫాతిమా బిన్తె అబీహుబైబ్ (రజియల్లాహు అన్హా)తో ఇలా ప్రస్తావించారు: "బహిష్టు రోజుల లెక్క ప్రకారం ఆయా రోజుల నమాజు వదలి వేసి స్నానం చెయ్యండి. తరువాత నమాజు ప్రారంభిం చండి."[5]

2. (సూరతుల్ మాయిదా:6)
3. (సహీహ్ బుఖారీ:282)
4. (ముస్నద్ అహ్మద్:8220, సిల్‌సిలతుస్ సహీహా:1261)
5. (సహీహ్ బుఖారీ: సహీహ్ ముస్లిం:)

మామూలు రోజుల కన్నా ఎక్కువ రోజులు రక్తం వచ్చినట్లయితే అది వ్యాధికి సంబంధించింది. అలాంటివారు వుజూ చేసుకుని నమాజు చేయవలెను.[1]

## మృతదేహం

ఏ ముస్లిమయితే చనిపోతాడో అతనికి తప్పనిసరిగా స్నానం చేయించాలి. అల్లాహ్ మార్గంలో పోరాటం చేస్తూ అమరులైనవారిని చనిపోయిన స్థితిలోనే (స్నానం లేకుండా) ఖననం చెయ్యాలి.

## ఇస్లాం స్వీకరిచిన వారు స్నానం చెయ్యాలి

హజ్రత్ సుమామా బిన్ ఉసాల్ (రజియల్లాహు అన్హు) ఇస్లాం స్వీకరించి నప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆయనకు హజ్రత్ అబూ తల్హా (రజియల్లాహు అన్హు) గారి తోటలోకి వెళ్ళి స్నానం చెయ్యమని ఆజ్ఞాపించారు.[2]

## జుమా (శుక్రవారం) నాటి (గుస్ల్) స్నానం

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఉపదేశించారు:

**"మీలో ఎవరైనా జుమా (నమాజు)కు వస్తే, వారు గుస్ల్(స్నానం) చేసి రావాలి."**[3]

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా సెలవిచ్చారు: "ప్రతి విశ్వాసిపై ఉన్న హక్కు ఏమిటంటే, వారంలోని ఏడు రోజుల్లో ఒకరోజు (శుక్రవారం) తల స్నానం మరియు పూర్తి శరీరాన్ని శుభ్రంగా కడిగి స్నానం చేయాలి."[4]

---

1. *నిఫాస్ గడువలో ఉన్నవారు నలభై రోజులు పూర్తి చేయవలసిన అవసరము లేదు. ఎప్పుడయితే రక్తం నిలబడిపోతుందో అప్పుడు స్నానం చేసుకోవాలి. నమాజు ప్రారంభించాలి. హైజ్, నిఫాస్ స్థితిలో ఉండే స్త్రీలకు నమాజ్ చేయటం, ఉపవాసాలు పాటించటం, భర్తతో సమాగమం జరపటం, మస్జిద్‌లోకి ప్రవేశించటం, ఖుర్ఆన్ ముట్టుకోవటం, కాబాగృహం చుట్టూ ప్రదక్షిణలు (తవాఫ్) చేయటం నిషేధించబడ్డాయి.*
2. *(సహీహ్ అబూదావూద్:355, ఇర్వావుల్ గలీల్ లిల్ అల్బానీ:128)*
3. *(సహీహ్ బుఖారీ: 828, సహీహ్ ముస్లిం:1393)*
4. *(సహీహ్ బుఖారీ: 847, సహీహ్ ముస్లిం:1420)*

హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఒక వ్యక్తి శుక్రవారం రోజు స్నానం చేసి, వీలైనంత వరకు శుచి శుభ్రతలను పాటించి, నూనె రాసుకుని లేక తన ఇంట్లో ఉన్న పరిమళాన్ని పూసుకుని, ఆ తర్వాత (మసీదుకు) వెళ్ళి, (అక్కడ) ఏ ఇద్దరి మధ్య నుంచి కూడా తోసుకొని వెళ్ళకుండా, (మీకంటే ముందుగా కూర్చున్న వారిని అటూ ఇటూ జరిపి కూర్చోడానికి ప్రయత్నం చేయకూడదు. ఎక్కడ ఖాళీ స్థలం ఉంటే అక్కడే కూర్చోవాలి.) తన అదృష్టంలో వ్రాసి ఉన్న నమాజు చేసు కుని, ఆ తర్వాత ఇమాము ప్రసంగిస్తే నిశ్శబ్దంగా కూర్చుంటే, ఆ శుక్రవారం నుండి మరొక శుక్రవారం వరకు అతని వల్ల జరిగే పాపాలు మన్నించబడతాయి."[1]

ఒక వ్యక్తి కనీసం వారానికి ఒక్కసారైనా తప్పనిసరి స్నానం చేయవలసిందే. మరియు శుక్రవారం స్నానం చేయడం శుభాలతో కూడుకున్న విషయం. ఎవరైనా ప్రతిరోజు స్నానం చేస్తున్నాడంటే అది ఇంకా ఉత్తమమైనది. ప్రతి రోజు పరిశుభ్రత పాటిండం అనేది మెచ్చుకోదగ్గ అంశం. కాని కొంత మంది వారానికి ఒక్కసారి కూడా స్నానం చేయరు. అలాంటివారు వారానికి ఒక్కసారి అయినా విధిగా స్నానం చేయవలసిందేనని పైన ప్రస్తావించబడిన హదీసులలో తాకీదు చేయడం జరిగింది.

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం; ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా ప్రవచించారు:పది విషయాలు మానవ సహజమైనవి.

1. మీసాలు కత్తిరించటం.
2. గడ్డం పెంచటం.
3. పల్లు తోముకోవటం.
4. ముక్కుని నీటితో శుభ్రం చేసుకోవటం.
5. గోళ్ళు కత్తిరించుకోవటం.
6. వ్రేళ్ళ మధ్య భాగాన్ని కడుక్కోవటం.
7. చంకలోని వెంట్రుకల్ని తొలగించటం.
8. నాభి క్రింది వెంట్రుకల్ని తీసివేయటం.
9. మూత్రశుద్ధి నీటితో చేసుకోవటం. ఆ తర్వాత ఉల్లేఖకుడు ఇలా అంటున్నాడు– ఏదో విషయం నేను మర్చిపోయాను. బహుశా అది
10. 'పుక్కిలించటం' కావచ్చుని నా అభిప్రాయం.[2]

---

*1. (సహీహ్‌బుఖారీ:834).* *2. (సహీహ్ ముస్లిం:384)*

## స్నానం (గుసుల్) చేయు పద్ధతి

1. స్నానానికై సంకల్పించుకోవాలి. బాత్‌రూమ్‌లోకి పోక మునుపే **'బిస్మిల్లాహ్'** بِسْمِ اللّٰهِ చదువుకోవాలి. తరువాత అరచేతులను మూడు సార్లు కడగాలి.
2. నమాజు కొరకై చేసే వుజూ విధంగానే వుజూ చెయ్యాలి. కాని కాళ్ళు కడుగ రాదు.
3. చేతి వ్రేళ్ళను నీటిలో ముంచి తల వెంట్రుకల చిగుర్లను బాగా తడిసిపోయేలా నీళ్ళతో తడపాలి. అలాగే గడ్డాన్ని కూడా తడపాలి.
4. తల కుడి వైపు నుండి మూడు సార్లు నీళ్ళు పోసి వీలైనంత వరకు శరీరాన్ని రుద్ది స్నానం చెయ్యాలి.
5. తరువాత స్నానం చేసిన స్థలం నుండి ప్రక్కకు జరిగి కాళ్ళు మూడు సార్లుగా కడుక్కోవాలి. (ఆ తరువాత నమాజుకై వుజూ చేయాలనుకుంటే చేసుకోవచ్చు. లేదంటే స్నానం చేసేటప్పుడు చేసిన వుజూ సరిపోతుంది.)[1]

### *ముఖ్య గమనిక:*

1. స్నానం చేసిన తరువాత శరీరాన్ని వస్త్రంతో తుడుచుకొనేటప్పుడు తమ చెయ్యి మర్మాంగాన్ని తగలకుండా తుడుచుకోవాలి. ఒకవేళ చెయ్యి తగిలి నట్లయితే నమాజుకై మరలా వుజూ చేసుకోవాలి. ఎందుకంటే "చేత్తో మర్మాంగాన్ని ఎలాంటి వస్త్రం లేకుండా తాకితే వుజూ భంగమవుతుంది."[2]
2. స్నానానికై సంకల్పించినప్పుడు స్నానం చేయుటకు ముందు వుజూ కొరకై చదివిన (బిస్మిల్లాహ్) స్నానానికి కూడా అదే చాలు. ఎందుకంటే, బాత్ రూమ్‌లో దుఆ పదాలు ఉచ్చరించకూడదు.
3. ఒకే సంకల్పంతో ఒకే స్నానం రెండు అవసరాలకై చేయవచ్చు. అంటే; సంభోగించిన తరువాత విధిగా చేసే స్నానం మరియు శుక్రవారము రోజున ఆచారంగా చేసే స్నానం. ఈ రెండింటికి ఒకే సంకల్పము మరియు ఒకే స్నానము చాలు.

---

1. *(సహీహ్ ముస్లిం:474).*
2. *(సహీహ్ సునన్ నసాయి: 445, సిల్‌సిలతుస్ సహీహ:1235)*

4. స్త్రీలు కూడా స్నానం పురుషులు చేసినట్లుగానే చెయ్యాలి. కాని శిరోజాల ముడులను విప్పకుండా, శిరోజాల చిగుర్లను పూర్తిగా తడిపినట్లయితే సరి పోతుంది. బహిష్టు స్త్రీలు, ఋతుస్రావమైన స్త్రీలు స్నానం చేసిన తరువాత రక్తం దుర్వాసన రాకుండా పరిమళాన్ని పూసుకోవాలి.[1]

5. వీర్య స్ఖలనమైతే తరువాత గోర్లు మరియు వెంట్రుకలు కత్తిరించుకోవడంలో ఎలాంటి తప్పులేదు.[2]

6. వీర్యస్ఖలనమై ఉన్న వ్యక్తి సలాముకు జవాబు మరియు తినే త్రాగేటప్పుడు 'బిస్మిల్లాహ్' بِسْمِ الله చెప్పవచ్చును.

7. అపరిశుద్ధమైన వ్యక్తి మసీదులో కూర్చోవడం, అలాగే మసీదు లోపల నుండి రావడం పోవడం మంచిది కాదు. ఒకవేళ తప్పని పరిస్థితిలో నడిచి పోయినట్లయితే ఎలాంటి దోషము లేదు. అపరిశుద్ధమైన వ్యక్తి కాబతుల్లాహ్ ప్రదక్షిణ చేయకూడదు.

8. ఇస్లామీయ పండితులు ఏకగ్రీవంగా తీర్మానించారు: "అపరిశుద్ధమైన వ్యక్తి ఖుర్‌ఆన్ తాకడము మరియు దాన్ని పారాయణం చేయడం నిషిద్ధం."[3]

9. భార్యాభర్తలు సంభోగించిన తరువాత స్నానం ఆలస్యంగా చెయ్యాలంటే వారు వుజూ చేసుకోవాలి.

10. ఒకసారి సంభోగించిన తరువాత మరోసారి సంభోగించాలను కుంటే వుజూ చేసుకున్న తర్వాతే సంభోగించాలి. ఎందుకంటే ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా తెలియజేశారు: "వుజూ చేసుకున్న వ్యక్తిలో కొత్త ఉత్సాహం చోటు చేసుకుంటుంది."[4]

11. హజ్రత్ అబూ హురైరా కథనం; ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు: "ఎవరైతే శవాన్ని స్నానం చేయించాడో అతను కూడా స్నానం చేసుకోవాలి. మరియు ఎవరైతే శవపేటికను ఎత్తుకొని పోయాడో అతను వుజూ చేసు కోవాలి."[5]

---

*1. (సహీహ్ బుఖారీ:)* *2. (సహీహ్ బుఖారీ బాబుల్ జునుబి).*

*3. (ఫతావా అబ్దుల్లాహ్ బిన్ బాజ్ ఉర్దు పుస్తకం, పేజి:80)*

*4. (సహీహ్ ముస్లిం:466, సహీహుల్ జామే సగీర్:263)*

*5. (సహీహ్ అబూదావూద్:3161, సహీహుల్ జామే సగీర:11348)*

## వుజూ ప్రాముఖ్యత

ఖుర్ఆన్ గ్రంథంలో అల్లాహ్ ఇలా ఆదేశించాడు: "విశ్వసించిన ప్రజలారా! మీరు నమాజు కొరకు లేచినప్పుడు మీ ముఖాలను, చేతులను మోచేతుల వరకు చక్కగా కడగాలి. తలపై (చేతులతో రాయడం) మసహ్ చేయండి, కాళ్ళను చీల మండల వరకు కడుక్కోండి."[1]

ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా తెలియజేశారు: "నమాజు కొరకు వుజూ తప్పనిసరి, వుజూ లేకుండా ఏ నమాజూ స్వీకరించబడదు."

మరొక చోట ఇలా ఆదేశించారు: "ఎవరైతే వుజూ చేయలేదో వారు వుజూ చేసుకోనంతవరకు ఏ నమాజూ అంగీకరించబడదు"[2]

## వుజూ ఘనత

హజ్రత్ అబూ దర్దా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:..

"నా ఉమ్మత్ ప్రజలు వుజూ కారణంగా వారి కాళ్ళు, చేతులు ప్రకాశిస్తూ ఉంటాయి. వారిలా ఎవ్వరు ఉండరు.....[3]

హజ్రత్ ఉస్మాన్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్ల ల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఉపదేశించారు: "ఎవరైతే (విధానం ప్రకారం) చక్కగా వుజూ చేశాడో, అతని సమస్త పాపాలూ తుడిచి వేయబడతాయి, చివరికి అతని గోళ్ళ సందుల్లోని పాపాలు కూడా పోతాయి."[4]

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఒక ముస్లిం లేక మూమిన్ వుజూకై తమ ముఖాన్ని కడిగినట్లయితే అతని ముఖాన్నుండి (చిన్న చిన్న) పాపాలన్నీ ఏవైతే అతని కళ్ళతో జరిగి ఉంటాయో అవి కడుగవేయడం జరుగుతాయి. లేక నీటి ఆఖరి చుక్కతో సయితం తొలగిపోతాయి.

---

1. *(సూరతుల్ మాయిదా:6).*
2. *(సహీహ్ బుఖారీ:132, సహీహ్ ముస్లిం:329)*
3. *(ముస్నద్ అహ్మద్: 20744, సహీహ్ తర్గీబ్ వత్ తర్హీబ్: 180)*
4. *(సహీహ్ముస్లిం:361)*

మరియు తమ చేతులను కడిగినట్లయితే చేతుల ద్వారా చేసిన పాపాలన్నీ నీటితో కడుగుతుండగా తొలగిపోతాయి. లేక నీటి ఆఖరి చుక్కతో సయితం తొలగి పోతాయి. తమ కాళ్ళను కడిగినట్లయితే కాళ్ళ ద్వారా నడిచిపోయి చేసిన పాపాలన్నీ నీటితో కడుగుతుండగా తొలగిపోతాయి. లేక నీటి ఆఖరి చుక్కతో సయితం తొలగి పోతాయి. ఆ విధంగా అతను పాపాల నుండి పూర్తిగా పరిశుద్ధుడయిపోతాడు."[1]

## స్నానానికై లేక వుజూకై శుభ్రమైన నీరు

స్నానానికై లేక వుజూకై నీరు పరిశుభ్రంగా ఉండాలి. అంటే, ఆ నీరు శుద్ధిగా ఉంటూ ఇతర వస్తువలను శుద్ధి చేసే అర్హత కలిగి ఉండాలి. అది సముద్రపు నీరు, నదుల నీరు, బావి నీరు, చెరువుల నీరు, బోరు నీరు అంతయు పరిశుద్ధమైన నీరు. ఆ నీరు గనుక లస్సిగానో, జూస్‌గానో, పాలుగానో ఉన్నట్లయితే వాటితో వుజూ చేయకూడదు. ఈ పానీయాలు పరిశుద్ధమైనప్పటికీ వాటికి ఇతర వస్తువులను పరి శుభ్రం చేసే అర్హత లేదు.

## మిస్వాక్ చేయడం (పండ్లు తోమడం)

వుజూ చెయ్యకముందు మిస్వాక్ చేయడం అభిలషణీయం. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారికి ఈ పద్ధతి అతి ప్రియమైనది. కనుక హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) ఉల్లేఖనం; ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: **"నా అనుచర సమాజానికి కష్ట మవుతుందని నేను భావించకపోతే ప్రతి నమాజుకు ముందు మిస్వాక్ చేసుకోవాలని ఆదేశించేవాడిని"** అని అన్నారు.[2]

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) ఉల్లేఖనం; ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: **"మిస్వాక్ (ఆచారం) నోటిని శుద్ధపరుస్తుంది మరియు అల్లాహ్ ప్రేమను పొందుటకై ఉత్తమమైన దారి."**[3]

## సంకల్పం (నియ్యత్)

వుజూ చేయకముందు సంకల్పము చెయ్యాలి. హజ్రత్ ఉమర్ (రజి

1. *(సహీహ్ ముస్లిం:360)*
2. *(సహీహ్ బుఖారీ: 537)*
3. *(సహీహ్ నసయి:5)*

యల్లాహు అన్హు) ఉల్లేఖనం; ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: " కర్మలు కేవలం మనో సంకల్పంపై ఆధారపడి ఉంటాయి...."[3]

## తస్మియా (బిస్మిల్లాహ్)

వుజూ చేయకముందు **"బిస్మిల్లాహ్"** بِسْمِ اللهِ అని చదవాలి. కనుక ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఆదేశించారు: ఎవరైతే **'బిస్మిల్లాహ్'** بِسْمِ اللهِ చదవరో వారి వుజూ నెరవేరదు.[4]

## ముఖ్య గమనిక:

ఒకవేళ వుజూ చేయకముందు **'బిస్మిల్లాహ్'** بِسْمِ اللهِ చెప్పడము మరచి పోయి నట్లయితే వుజూ నెరవేరుతుంది.

1 జ్ఞాపకముండి కూడా బిస్మిల్లాహ్ పఠించకుండా వుజూచేస్తే ఆ వుజూ నెరవేరదు. బిస్మిల్లాహ్ పఠించి తిరిగి పూర్తి వుజూ చేయాలి.

2 బాత్‌రూమ్‌లో వుజూ చేయాలనుకుంటే లోపలకు పోకముందే సంకల్పము చేసి మరియు 'బిస్మిల్లాహ్' చదువుకొని పోవాలి.

## వుజూ చేసే విధానము

**'బిస్మిల్లాహ్'** అని రెండు చేతులను మణికట్టు వరకు మూడు సార్లు కడుగ వలెను. తరువాత కుడి చేతిలో నీళ్ళు తీసుకుని మూడు సార్లు పుక్కిలించి మరియు ముక్కును ఎడమ చేతితో పట్టి చీది నీటితో శుభ్రపరచవలెను.

తరువాత పూర్తి ముఖమును నొసట వెంట్రుకల నుండి గడ్డం క్రింది వరకు, కుడి చెవి నుండి ఎడమ చెవి వరకు మూడు సార్లు కడుగవలెను. అలాగే గడ్డాన్ని (వెంట్రుకల మొదళ్ళు తడిచేటట్లు) ఖిలాల్ చేసుకోవాలి.

తరువాత కుడి చేతిని మోచేతితో సహా మూడు సార్లు కడుగవలెను. అలాగే ఎడమ చేతిని మోచేతితో సహా మూడుసార్లు కడుగవలెను. తరువాత తలపై మసహ్

---

*3. (సహీహ్ బుఖారీ:1, సహీహ్ ముస్లిం:3530)*

*4. (సహీహ్ తిర్మిజీ:25, సహీమ్ ఇబ్నుమాజ:397,సహీహ్ అబూదావూద్:102)*

చేయవలెను. అంటే; తడి అర చేతులతో తల ముందు భాగం నుంచి రుద్దుతూ మెడ వరకు తీసుకొనిపోవలెను. అలాగే ముందుకు తీసుకొని రావలెను.

తరువాత చూపుడు వ్రేళ్ళతో రెండు చెవుల లోపలి భాగాన్ని, తడి బొటన వ్రేలుతో చెవి వెనుక భాగాన్ని మసహ్ (స్పర్శ) చేయవలెను. తడి చేత్తో తల మసహ్ చేసిన తరువాత చెవుల మసహ్ కొరకై ప్రత్యేకంగా తడుపుకోనక్కరలేదు.

మెడను మసహ్ చేయాలని ఆధారపూర్వకమైన హదీస్ లేదు. కాబట్టి మెడను మసహ్ చెయ్యకపోవడమే ధర్మం.

తరువాత కుడి కాలు చీలమండల వరకు మూడు సార్లు కడుగవలెను. అలాగే ఎడమ కాలు కూడా మూడు సార్లు కడుగవలెను. వ్రేళ్ళ మధ్య భాగాల్లో ఖిలాల్ (చిటికెన వ్రేలుతో తడపాలి) చేయాలి.[1]

ఒకసారి వుజూ చేసుకున్న తరువాత అతనికి ఆ వుజూ భంగము కానంత వరకు అదే వుజూతో అనేక సమయాల నమాజు చేయవచ్చును. హజ్రత్ బురైదా (రజియల్లాహు అన్హు) ఇలా తెలియజేశారు: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మక్కాను జయించిన రోజున ఒకే వుజూతో అనేక నమాజులు చేశారు. మేజోళ్లపై మసహ్ చేశారు.

అప్పుడు ఉమర్ (రజియల్లాహు అన్హు) ప్రశ్నించారు: " ఓ ప్రవక్తా! ఈ రోజు చేసిన పని మీరు ఇంతకు ముందు ఎప్పుడూ చేయలేదు?"

అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) సమాధానమిస్తూ: "ఓ ఉమర్! నేను ఇది తెలిసే (ఈ విధానం మీకు తెలియాలని) చేశాను."[2]

"వుజూ చేసిన తరువాత టవల్‌తో లేక రుమాల్‌తో తుడుచుకోవచ్చును"[3]

## వుజూ చేసిన తరువాత దుఆ

హజ్రత్ ఉమర్ (రజియల్లాహు అన్హు) ఉల్లేఖనం; ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**"ఏ వ్యక్తి అయితే పద్ధతి ప్రకారం వుజూ చేసి తరువాత ఈ దుఆను పఠించి**

---

1. *(సహీహ్ బుఖారీ: 1798, సహీహ్ ముస్లిం:331, సహీహ్ తిర్మిజీ: 36,40)*
2. *(సహీహ్ ముస్లిం:415)*
3. *(సహీహ్ తిర్మిజీ:54)*

**నట్లయితే అతనికై స్వర్గం యొక్క ఎనిమిది ద్వారాలు తెరువబడుతాయి. అతను తోచిన ద్వారం గుండా స్వర్గంలోనికి పోవచ్చును.”**

**أَشْهَدُ أَنْ لاَّ إِلَهَ إِلاَّ اللَّهُ وَحْدَهُ لاَ شَرِيكَ لَهُ وَأَشْهَدُ أَنَّ مُحَمَّدًا عَبْدُهُ وَرَسُولُهُ. اَللَّهُمَّ اجْعَلْنِي مِنَ التَّوَّابِينَ وَاجْعَلْنِي مِنَ الْمُتَطَهِّرِينَ.**

**‘అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు, వహ్దహు లా షరీక లహు, వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వరసూలుహు. అల్లాహుమ్మజ్ అల్నీ మినత్త వ్వాబీన వజ్ అల్నీ మినల్ ముత తహ్హిరీన్.’**

(అల్లాహ్ తప్ప వేరే నిజఆరాధ్యుడు లేడని ఆయన ఒక్కడేననీ, ఆయనకు సాటి ఎవరూ లేరనీ, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అల్లాహ్ దాసుడు మరియు సందేశహరుడు అని నేను సాక్ష్యమిస్తున్నాను. ఓ అల్లాహ్ ! నన్ను పశ్చాత్తాపపడే వారిలోను, పరిశుభ్రత పాటించువారిలోనూ ఉంచు). [1]

**గమనిక:** వుజూ తరువాత ఆకాశం వైపునకు చూడడము మరియు వ్రేలును పైకెత్తి సైగ చేయడం గురించి ఎలాంటి ప్రామాణికమైన హదీసు లేదు. వుజూ కొరకు కాళ్ళు చేతులు కడిగేటప్పుడు లేక వుజూ చేసేటప్పుడు ప్రత్యేకమైన దుఆలు చదవటం ధర్మం కాదు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అలా పఠించినట్లు ఎలాంటి ఆధారము లేదు.

## వుజూను భంగపరచే విషయాలు

అపాన వాయువు వెలువడటం వలన, మలమూత్ర విసర్జన వలన, మజీ రావడం (శీఘ్ర స్ఖలనం)[2] వలన, మత్తుగా నిద్రించుట (తమ శరీర భాగాలపై ఎలాంటి కంట్రోల్ లేకుండా నిద్రపోవడము) వలన, స్పృహ కోల్పోయినందున, లేక మైకంలో ఉండినందున వుజూ భగ్నమవుతుంది. మరియు ఎలాంటి వస్త్రం లేకుండా

1. *(సహీహ్ ముస్లిం:345, సహీహ్ తిర్మిజీ:55, సహీహ్ అబూదావూద్:169)*
2. *(స్త్రీలలోగాని, పురుషులలోగాని లైంగిక ఆలోచనలు చెలరేగినప్పుడు మూత్రద్వారం ద్వారం గుండా వెలువడే పలుచటి జిగటి పదార్థాన్ని ‘మజీ’అంటారు. మూత్రంతో పాటు వెలువడే చిక్కటి పదార్థాన్ని ‘వదీ’ అంటారు.)*

మర్మాంగాన్ని తాకడం వలన వుజూ భగ్నమవుతుంది.

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) ఉల్లేఖనం; ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఎవరికైతే అపాన వాయువు విసర్జన జరిగిందో వారు వుజూ చేసుకోనంత వరకు వారి నమాజు అంగీకరించబడదు..."[1]

హజ్రత్ అలీ (రజియల్లాహు అన్హు) ఉల్లేఖనం; ప్రవక్త ముహమ్మద్ (సల్ల ల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: **"రెండు కండ్లు పిరుదలకు ముడి లాంటివి, కనుక ఎవరైతే నిద్రపోతారో వారు వుజూ విధిగా చేసుకోండి."**[2]

ఒకవేళ నిద్ర గాఢంగా లేనట్లయితే అంటే ఎక్కడయినా కూర్చున్నప్పుడు కునుకు పట్టినట్లయితే వుజూ చేయవలసిన అవసరము లేదు.

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) ఇలా తెలియజేశారు:

"ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అనుచరులు ఇషా నమాజు చదువుటకై కూర్చున్నప్పుడు వారికి కునుకు పట్టేది. తరువాత వారు వుజూ చేయకుండానే నమాజు చేసుకునేవారు."[3]

## మర్మాంగాన్ని తాకడం వలన వుజూ భగ్నమవుతుంది

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఆదేశించారు: " ఎవరైతే తమ మర్మాంగాన్ని (ఎలాంటి వస్త్రం లేకుండా) చేత్తో తాకినట్లయితే వారు విధిగా వుజూ చేసుకోవాలి. ఏ స్త్రీ అయితే తమ మర్మాంగాన్ని (ఎలాంటి వస్త్రం లేకుండా) చేత్తో తాకితే ఆమె విధిగా వుజూ చేసుకోవాలి."[4]

---

1. *(సహీహ్ బుఖారీ:132, ముస్లిం:330)*
2. *(సహీహ్ అబూదవూద్ 203, సహీహ్ ఇబ్నుమాజా477)*
3. *(సహీహ్ అబూదవూద్:200, సహీహ్ ముస్లిం:566)*
4. *(సునన్ దారుల్ ఖుత్ని: 544, సహీతహ్ అల్‌జామే అస్సగీర్:4491)*

## ఒంటె మాంసము తినటం వలన వుజూ భగ్నమవుతుంది

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం)ను ఒక వ్యక్తి ఇలా ప్రశ్నించాడు: **"మేము గొర్రె మాంసము తిన్న తరువాత వుజూ చేసుకోవాలా? దానికి ప్రవక్త ముహమ్మద్(స), "మీకు ఇష్టమయితే వుజూ చేసుకోండి, ఇష్టం లేదంటే చెయ్యకండి"** అని అన్నారు.

మరలా ఆ అనుచరుడు ప్రవక్త ముహమ్మద్ (స) ను ఇలా ప్రశ్నించాడు: **"మేము ఒంటె మాంసము తిన్నట్లయితే వుజూ చేసుకోవాలా?"** దానికి ప్రవక్త ముహమ్మద్ (స) **"వుజూ చేయాలి..."** అని జవాబు ఇచ్చారు.[1]

**ముఖ్య గమనిక:** వ్యాధి వలన మూత్ర విసర్జనపై పట్టులేని వ్యక్తి మరియు అపాన వాయువు విసర్జనపై పట్టులేని వ్యక్తి ప్రతి నమాజుకు ఒకసారి వుజూ చేసుకోవాలి. అతను నమాజు చేసేటప్పుడు మూత్రం వచ్చినా రాకపోయినా, లేక అపాన వాయువు వచ్చినా రాకపోయినా నమాజుకు అంతరాయం కలగదు.

## తయమ్ముమ్ అంటే?

శరీరానికి నీరు హానికరమయినప్పుడు, లేక నీరు దొరకని స్థితిలో, లేక నీరు ఉండి కూడా దానిని ఉపయోగించే అవకాశము లేనప్పుడు, లేక ప్రయాణంలో నీరు లభ్యం కానందున, నీటికి బదులు మట్టితో పరిశుభ్రతను పొందే విధానాన్ని **"తయమ్ముమ్"** అంటారు.

## తయమ్ముమ్ చేయు పద్ధతి

వుజూ లేక గుసుల్ (స్నానం) కొరకై సంకల్పం చేయవలెను. తరువాత **'బిస్మిల్లాహ్'** بِسْمِ اللهِ పఠించవలెను.

రెండు చేతులను శుభ్రమైన మట్టిపై తట్టి ఎడమ చేతిని కుడి చేతిపై తట్టి (మట్టిని దులిపి) అరచేతుల వెనుక భాగముపైనను మరియు ముఖముపై మసహ్ చేయవలెను.

---

1. *(సహీహ్ ముస్లిం: 539)*
2. *(సహీహ్ బుఖారీ:334)*

**మసహ్ అంటే:** అరచేతులతో చేతులపైన, ముఖముపైన స్పర్శ చేయటాన్ని **'మసహ్'** అంటారు.

హజ్రత్ అమ్మార్ (రజియల్లాహు అన్హు) గారికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) తయమ్ముమ్ విధానం ఇలా నేర్పారు: 'రెండు చేతుల్ని నేల మీద తట్టి వాటి మీద ఊదారు (దుమ్ము పోవటానికి). ఆ తరువాత రెండు చేతులతో ముఖాన్ని, రెండు అరచేతుల్ని రుద్దుకున్నారు'[2]

వుజూను భంగపరచే విషయాలే తయ మ్ముమ్‌ను కూడా భంగపరుస్తాయి. అలాగే నీరు పొందిన తరువాత తయమ్ముమ్ భంగమవుతుంది. కాని చేసిన నమాజు తిరిగి చదవనక్కరలేదు. వుజూ చేసిన తరువాత చదివే దుఆలను తయమ్ముమ్ తరువాత కూడా అదే దుఆలను చదవాలి.

## మేజోళ్లపై మసహ్ చేయటం

మేజోళ్లపై మసహ్ అంటే; మనిషి కాళ్ళకు మేజోళ్లు ధరించి ఉండి ఆ కాళ్ళ పైభాగమున తడిగా ఉన్న అరచేతులతో స్పర్శించడాన్ని (రుద్దడాన్ని) 'మసహ్' అంటారు. ఒక వ్యక్తి వుజూ పూర్తిగా చేసుకుని కాళ్ళను నీటితో కడుగుటకు బదులుగా మేజోళ్లపై తడి అరచేతులతో స్పర్శించే విధానాన్ని 'మసహ్' అంటారు.

## మేజోళ్లపై మసహ్ చేసే గడువు

స్థానికులయితే ఒక పగలు ఒక రేయి వరకూ ఆ మేజోళ్లపై మసహ్ చేసుకోవచ్చు. ప్రయాణికులయితే మూడు రేయింబవళ్ల వరకూ మేజోళ్లపై మసహ్ చేసుకోవచ్చు. వుజూ చేసుకుని మేజోళ్లను ధరించినప్పటి నుండి గడువు మొదలవుతుంది. ఉదాహరణకు, ఒక వ్యక్తి జుహ్ర్ నమాజు సమయంలో మేజోళ్లను ధరించినట్లయితే మరుసటి రోజు, జుహ్ర్ నమాజు వరకు గడువు ఉంటుంది. వుజూ చేసినప్పుడల్లా మేజోళ్లను తీయకుండా 'మసహ్' చేయవచ్చును. అలాగే ప్రయాణికుడు మూడు రోజుల వరకు 'మసహ్' చేయవచ్చును.

స్నానం కారణంగా మేజోళ్లను తీస్తే మసహ్ భంగమైపోతుంది. అలాగే గడువు ముగిసిన మరుక్షణం నుంచే మసహ్ భంగమైపోతుంది. తిరిగి వుజూ చేసుకుని మేజోళ్లను ధరించి మసహ్ పద్ధతిని పాటించవచ్చు.

1. *(సహీహ్ అబూదావూద్:164)*

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మేజోళ్ల పై భాగానా మసహ్ చేశారు. కనుక హ॒జ్రత్ అలీ (రజియల్లాహు అన్హు) ఇలా ఉల్లేఖించారు: "ఒకవేళ ధర్మం పునాదే గనక అభిప్రాయాలపై ఆధారపడి ఉంటే మేజోళ్ల పైభాగానికి బదులు క్రింది భాగానికి మసహ్ చేయడం ఎక్కువ సమంజసంగా భావించబడేది. అయితే ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) తన మేజోళ్ల పైభాగాన మసహ్ చేయటం స్వయంగా నేనే చేశాను."[1]

హ॒జ్రత్ అలీ (రజియల్లాహు అన్హు) ఉల్లేఖించారు: "ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రయాణికుని కోసం మేజోళ్లపై మసహ్‌కై మూడు రేయింబవళ్ళను, స్థిర నివాసమున్నవానికై ఒక పగలూ ఒక రేయిని గడువుగా నిర్ధారించారు."[1]

***గమనిక:*** *చలికాలం లేక ఎండాకాలం, నీరు హాని కలిగించినా, కలిగించకపోయినా మేజోళ్లను ధరిస్తే మసహ్ పద్ధతిని పాటించవచ్చును. చర్మంతో చేయబడ్డ మేజోళ్లపైనే మసహ్ చేయాలని కొంత మంది ధర్మ గురువుల అభిప్రాయం. కాని నిజమైన హదీసుల ప్రకారం ప్రతి విధమైన, శుభ్రమైన, మేజోళ్లపై మసహ్ చేయవచ్చునని ధర్మ గురువులు ఏకీభవించారు.*

## నీటిని వృధా చేయకూడదు

ఇస్లాం ధర్మంలో ప్రతి విషయంలో మధ్యస్తంగా మెలగాలి. ఏ విషయంలో కూడా మితిమీరకూడదు. ముఖ్యంగా ఖర్చు చేయడంలో మరియు నీరు వాడకంలో చారా అప్రమత్తంగా ఉండాలి. ఎందుకంటే, అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "దుబారా ఖర్చు చేయకు దుబారా ఖర్చు చేసేవారు షైతానుల సోదరులు. మరి షైతానేమో తన ప్రభువునకు కృతఘ్నుడు."[2]

అవసరానికి మించి ఏ వస్తువునీ కూడా దుబారా చేయకూడదు, నీటిని మరింత జాగ్రత్తగా ఉపయోగించాలి. మన సమాజంలో నీటి సమస్య అతి ఎక్కువగా ఉంది. అందుకనే కొందరు ఇలా తెలిపారు: "ఒకవేళ మనం సముద్రం వద్ద ఉన్నా

*1. (సహీహ్ ముస్లిం:414)*
*2. (సూరతు బనీ ఇస్రాయీల్:26-27)*
*3. (సహీహ్ బుఖారీ బాబు మాజాఅ ఫిల్ వుజూ:)*

లేక సెలయేరు వద్ద ఉన్నా అవసరానికి మించి నీటిని ధారపోయకూడదు. అది కూడా వృధా ఖర్చు క్రిందకే వస్తుంది.”

సహీహ్ బుఖారీలో ఇలా ప్రచురించడం జరిగింది: ప్రవక్త ముహమ్మద్ (స) వుజూ ఒక్కొక్కసారి (వుజూలో కడగవలసిన అవయవాలను) విధిగా కడిగారు. రెండేసి సార్లు కడిగారు. మరియు మూడేసి సార్లు కూడా కడిగారు. కాని మూడు సార్లకంటే ఎక్కువగా కడగకూడదు” అని తెలియజేశారు.[3]

ఒక వ్యక్తి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్దకు వచ్చి వుజూ గురించి అడిగాడు. అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అతనికి మూడు సార్లు కడిగి వుజూ చేసి చూపించారు.

తర్వాత ఆ వ్యక్తితో ఇలా అన్నారు: “వుజూ ఇలానే చెయ్యాలి. ఎవరైనా ఇందులో ఏ కాస్త ఎక్కువ చేసినా అతను తప్పు చేసినవాడవుతాడు, వైపరీత్యానికి పాల్పడినవాడవుతాడు.”[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వుజూ విధానంలో మూడు సార్లకంటే ఎక్కువగా అవయవాలను కడగాటాన్ని నిషేధించారు. మనం స్నానం చేయాలన్నా లేక వుజూ చేయాలన్నా నీటిని జాగ్రత్తగా వాడుకోవాలి. నీరు ఉంది కదా అని వృధా చేస్తే అల్లాహ్ దగ్గర జవాబుదారీ తప్పదు.



*1. (సహీహ్ నసాయి:140)*

# 2 సిగ్గు, బిడియం

**అల్ హయియ్యు:** ఇది అల్లాహ్‌కు చెందిన మహోన్నతమైన పేర్లలో ఒక దివ్యమైన పేరు. దానికి: "వ్రీడ, సిగ్గు మరియు బిడవియం" అనే అర్థాలున్నాయి. అల్లాహ్ ఆ దివ్యగుణం గురించి ఖుర్‌ఆన్ గ్రంథంలో ఇలా ప్రకటించాడు:

(إِنَّ اللَّهَ لَا يَسْتَحْيِي أَنْ يَضْرِبَ مَثَلًا مَا بَعُوضَةً فَمَا فَوْقَهَا)

**"దోమ లేక దానికంటే మరీ అల్పమైన వస్తువును దృష్టాంతంగా చెప్పటానికి నిశ్చయంగా అల్లాహ్ ఎంత మాత్రం సిగ్గుపడడు."[1]**

హజ్రత్ సల్మాన్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రకవ్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِنَّ رَبَّكُمْ تَبَارَكَ وَتَعَالَى حَيِيٌّ كَرِيمٌ يَسْتَحْيِي مِنْ عَبْدِهِ إِذَا رَفَعَ يَدَيْهِ إِلَيْهِ أَنْ يَرُدَّهُمَا صِفْرًا)

**"నిశ్చయంగా మీ ప్రభువు సిగ్గుగలవాడు, మెతకవైఖరి కలవాడు, అల్లాహ్‌ను మొరపెట్టుకుంటూ రెండు చేతులు పైకెత్తిన దాసునికి ఏమియు ప్రసాదించ కుండా (ఆ మొరను) రద్దు చేయటాన్ని అల్లాహ్ సిగ్గు పడతాడు."[2]**

**"అల్ హయియ్యు"** అనే దివ్యమైన గుణం అల్లాహ్ మహోన్నతానికి తగట్టుగా ఉంటుందే తప్ప మనిషికి చెందిన సిగ్గు వంటి గుణం కాదు. ఎందుకంటే, అల్లాహ్ వ్యక్తిత్వం గురించి ఖుర్‌ఆన్ గ్రంథంలో ఏ మేరకు వివరించడం జరిగిందో ఆ మేరకే మనం అల్లాహ్ గురించి వివరించాలి. అల్లాహ్ దివ్య గుణగణాల పట్ల ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఎలాగైతే తెలియజేశారో, అలాగే మనం అల్లాహ్ గురించి తెలుసుకోవాలి. మనకు తోచిన విధంగా అల్లాహ్‌ను ఊహించి పోలికలు కల్పించకూడదు. ఇతరుల గుణగణాలతో సరి సమానంగా పోల్చకూడదు.

అల్లాహ్ మరయు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) పలు విధాలుగా, అనేక చోట్ల, వివిధ రకాలలో అల్లాహ్ సిగ్గు పడతాడనే విషయాన్ని తెలియజేశారు. ఆ సిగ్గుపడే గుణం అల్లాహ్ స్థాయికి తగ్గట్టు ఉంటుంది. అందుకనే

---

1. *(2,సూరతుల్ బఖారా:26)*
2. *(సహీహ్ అబూదావూద్:1488)*

అల్లాహ్ సిగ్గుపడేవారిని ప్రేమిస్తాడు మరియు సిగ్గుపడనివారిని ప్రేమించడు.

ఎవరైతే తప్పు చేసిన తరువాత సిగ్గుపడుతూ తను చేసిన పాపాన్ని ఇతరులకు తెలియకుండా దాచుతాడో, అల్లాహ్ కూడా అతని పాపాలను ఎవరికీ తెలియకుండా దాచేస్తాడు. ఎవరైతే ఇతరుల తప్పులను కప్పిపుచ్చుతారో, వారి తప్పులను కూడా ఇహపర లోకాలలో ఎవరికీ తెలియ కుండా అల్లాహ్ కప్పిపుచ్చుతాడు. మరియు తప్పులను బహిర్గతం చేసేవాడిని లేక సిగ్గుమాలిన పనులు చేసి ఇతరులకు సిగ్గు వదలి చెప్పుకుంటూ ఉంటాడో ఆ వ్యక్తిని అల్లాహ్ ఇష్టపడడు.

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

**(إِنَّ الَّذِينَ يُحِبُّونَ أَنْ تَشِيعَ الْفَاحِشَةُ فِي الَّذِينَ آمَنُوا لَهُمْ عَذَابٌ أَلِيمٌ فِي الدُّنْيَا وَالْآخِرَةِ وَاللَّهُ يَعْلَمُ وَأَنْتُمْ لَا تَعْلَمُونَ).**

**"విశ్వాసుల వర్గంలో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యధాభరితమైన శిక్షకు అర్హులు. అల్లాహ్ ఎరుగును, మీరు ఎరుగరు."** ***(24 సూరతున్ నూర్ :19)***

హ్జ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా నేను విన్నాను:

**(كُلُّ أُمَّتِي مُعَافًى إِلَّا الْمُجَاهِرِينَ وَإِنَّ مِنْ الْمُجَاهَرَةِ أَنْ يَعْمَلَ الرَّجُلُ بِاللَّيْلِ عَمَلًا ثُمَّ يُصْبِحَ وَقَدْ سَتَرَهُ اللَّهُ عَلَيْهِ فَيَقُولَ يَا فُلَانُ عَمِلْتُ الْبَارِحَةَ كَذَا وَكَذَا وَقَدْ بَاتَ يَسْتُرُهُ رَبُّهُ وَيُصْبِحُ يَكْشِفُ سِتْرَ اللَّهِ عَنْهُ)**

"నా సముదాయంలో ప్రతి వ్యక్తికి క్షమాపణ ఉంది. 'ముజాహిరీన్' కి తప్ప. 'ముజాహిరీన్' అంటే; ఒక వ్యక్తి రాత్రి వేళ (చేయకూడని తప్పుడు) పని చేశాడు. అల్లాహ్ దాన్ని (ఇతరులకు తెలియకుండా) కప్పి ఉంచాడు. కాని తప్పు చేసిన వాడు ఉదయాన్నే మేల్కొని ఓరేయ్ రాత్రి నేను (సిగ్గు వదలి) ఈ విధంగా, ఆ విధంగా చేశానని బహిర్గతం చేసుకుంటాడు. అతను నిద్ర పోతుండగా అల్లాహ్ అతని పాపాన్ని కప్పి ఉంచాడు. అయినా అతను ఉదయాన్నే మేల్కొని అల్లాహ్ దాచి పెట్టిన పాపాన్ని (ఇతరుల ముందు) బహిర్గతం చేసుకున్నాడు."[1]

ధర్మ పండితులు అల్లాహ్ కూడా సిగ్గు చెందుతాడు అనే విషయాన్ని పలు

1. *(సహీహ్ బుఖారీ:5608)*

విధాలుగా తెలియజేశారు: అల్లాహ్ ప్రజలను క్షమించి వదలివేయటం లేక కారుణ్యాన్ని చూపటం లేక అయిష్టతను తెలుపటం వంటి గుణాలు అల్లాహ్‌కు చెందినవి అన్నారు.

- కారుణ్య గుణం గురించి: హ్రజత్ సల్మాన్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "నిశ్చయంగా మీ ప్రభువు సిగ్గు గలవాడు, మెతకవైఖరి కలవాడు, అల్లాహ్‌ను మొరపెట్టుకుంటూ రెండు చేతులు పైకెత్తిన దాసునికి ఏమియు ప్రసాదించ కుండా (ఆ మొరను) రద్దు చేయటాన్ని అల్లాహ్ సిగ్గుపడతాడు."[1]
- ఒక వ్యక్తి సిగ్గుపడుతూ (పుణ్యాలు చేశాడు) అల్లాహ్ కూడా అతని పట్ల సిగ్గు పడుతూ కరుణించాడు.
- అలాగే అల్లాహ్ సత్యం తెలుపుటకు సిగ్గుపడడు.
- సిగ్గుపడటం విశ్వాసానికి చెందిన ఒక మహా భాగ్యం. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**(الْإِيمَانُ بِضْعٌ وَسِتُّونَ شُعْبَةً وَالْحَيَاءُ شُعْبَةٌ مِنْ الْإِيمَانِ). "విశ్వాసానికి అరవై మూడు భాగాల కన్నా ఎక్కువ భాగాలు ఉన్నాయి. దాని లోని సిగ్గుపడటం అనేది ఒక భాగం."[2]**

**(مَرَّ عَلَى رَجُلٍ مِنْ الْأَنْصَارِ وَهُوَ يَعِظُ أَخَاهُ فِي الْحَيَاءِ فَقَالَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ دَعْهُ فَإِنَّ الْحَيَاءَ مِنْ الْإِيمَانِ).**

ఒక రోజున ఒక వ్యక్తి తన సోదరునికి 'సిగ్గు గురించి (సిగ్గుపడుతూ, పడుతూ చాలా నష్టానికి గురికాబడ్డావు అని) బోధిస్తున్నాడు.' దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం ) ఇలా అన్నారు: 'అతన్ని వదలేయి, సిగ్గు చెందడం విశ్వాసానికి చెందిన అంశం.'[3]

---

1. *(సహీహ్ అబూదావూద్:1488)*
2. *(సహీహ్ బుఖారీ:8)*
3. *(సహీహ్ బుఖారీ:23)*
4. *(సహీహ్ ముస్లి:51)*

హ్రజత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(الْإِيمَانُ بِضْعٌ وَسَبْعُونَ أَوْ بِضْعٌ وَسِتُّونَ شُعْبَةً فَأَفْضَلُهَا قَوْلُ لَا إِلَهَ إِلَّا اللَّهُ وَأَدْنَاهَا إِمَاطَةُ الْأَذَى عَنْ الطَّرِيقِ وَالْحَيَاءُ شُعْبَةٌ مِنْ الْإِيمَانِ).

"విశ్వాసానికి డెబ్బై శాఖలకన్నా అధిక శాఖలు ఉన్నాయి. లేక అరవై శాఖల కన్నా అధికంగా ఉన్నాయి. వాటిలో అన్నిటికంటే ఉన్నతమూనది; **'లా ఇలాహ ఇల్లల్లాహ్'** పలకడం. వాటిలో అత్యల్పమైనది; 'బాధ కలిగించే వస్తువుల్ని దారిలో నుంచి ఏరి వేయడం' సిగ్గు; విశ్వాసంలో ఒక ముఖ్యమైన భాగం."[4]

**సిగ్గు అంటే?** సాధారణంగా మనస్సును చెడు చేష్టల నుండి అదుపులో ఉంచుకోవడం, ప్రతి చెడు కార్యానికి, సంభాషణకు దూరంగా ఉండటం. "సిగ్గు మనిషిని చెడు పనులు చెయ్యకుండా నిరోధిస్తుంది. హక్కుదారుల హక్కులు నిర్వర్తించకుండా ఉండరాదని వారిస్తుంది."

హ్రజత్ జునైద్ బగ్దాదీ (రహ్మ) తన అభిప్రాయాన్ని ఇలా తెలియజేశారు: "అల్లాహ్ తనకు ప్రసాదించిన అనుగ్రహాలను మనిషి గమనిస్తాడు. ఆయన కృతజ్ఞతలు తెలుపడంలో తాను చేసిన అశ్రద్ధ గుర్తుకు వస్తుంది. అప్పుడు ఆ రెండు తలంపుల మధ్య ఏర్పడే మనోస్థితినే 'సిగ్గు' అని అంటాము."

ఒకసారి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) "అల్లాహ్ ఎడల 'సిగ్గు'గా మెలగండి. సిగ్గు పడవలసిన రీతిలోనే ఆయన ఎదుట సిగ్గుపడండి" అని అన్నారు.

దానికి అక్కడున్నవారు: "దైవ ప్రవక్తా! అల్లాహ్ కృపవల్ల మేము అల్లాహ్ ఎడల 'సిగ్గు' పూరితంగానే మెలుగుతున్నాము." అని బదులు పలికారు.

అప్పుడు ఆయన(స) ఇలా బోధించారు: 'అది కాదు, అల్లాహ్ ఎడల సిగ్గుపడవలసిన రీతిలోనే సిగ్గుపడటమంటే, మీరు మీ మస్తిష్కాన్ని, అందులో ఉత్పన్నమయ్యే ఆలోచనలను అదుపులో పెట్టుకోవాలి. కడుపును, అందులో వేసుకునే భుక్తిని కనిపెట్టుకుంటూ ఉండాలి. మృత్యువును, దాని పర్యవసానం కుళ్ళి, కృషించి,

1. *(సహీహ్ తిర్మిజీ:2458)*
2. *(సహీహ్ బుఖారీ: 3224)*

అంతమైపోవడాన్నీ జ్ఞాపకం చేసుకుంటూ ఉండాలి. ఏ వ్యక్తి పరలోక సాఫల్యాన్ని కోరుకుంటాడో అతడు ప్రాపంచిక ఆడంబరాలను త్యజిస్తాడు. ప్రపంచానికి బదులుగా పరలోకానికి ప్రాముఖ్యతనిస్తాడు. ఇలా ఆచరించిన వ్యక్తే వాస్తవానికి అల్లాహ్ పట్ల సిగ్గుపడవలసిన రీతిలో సిగ్గుపడినవాడు."[1]

హజ్రత్ అబూ మస్వూద్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِنَّ مِمَّا أَدْرَكَ النَّاسُ مِنْ كَلَامِ النُّبُوَّةِ إِذَا لَمْ تَسْتَحْيِ فَافْعَلْ مَا شِئْتَ).

**"నిశ్చయంగా పూర్వపు ప్రవక్తల హితవుల నుండి జనం పొందిన ఉపదేశాలలో ఒకటి, నీలో నీకు సిగ్గు, బిడియాలు లేకపోతే తోచినదల్లా చెయ్యి."[2]**

## సిగ్గు,బియాల ఔన్నత్యం

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ప్రతి ధర్మానికి (మంచి) గుణాలున్నాయి మరియు ఇస్లాం ధర్మ గుణం సిగ్గుపడటం" అని అన్నారు.[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: (الْحَيَاءُ كُلُّهُ خَيْرٌ) "సిగ్గుపడడం అంతయూ మంచిదే."[2]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(الْحَيَاءُ لَا يَأْتِي إِلَّا بِخَيْرٍ) "సిగ్గుపడడం వలన వారికి మంచే జరుగుతుంది."[3]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

---

1. *(సహీహ్ ఇబ్ను మాజా: 4182, సహీహ్ అల్‌జామే:3912)*
2. *(సహీహ్ ముస్లిం:54)*
3. *(సహీహ్ బుఖారీ: 5652, సహీహ్ ముస్లిం:53)*
4. *(అల్ ముస్తదరక్ లిక్ హాకిమ్: 57, సహీహుల్ జామే:2483)*
5. *(సహీహ్ ఇబ్ను మాజా 4184, సహీహ్ తిర్మిజీ:1932)*
6. *(సహీహ్ తిర్మిజీ:2027, సహీహుల్ జామే:5512)*

(اَلْحَيَاءُ وَ الإِيْمَانُ قَرْنًا جَمِيْعًا فَإِذَا رُفِعَ أَحَدُهُمَا رَفَعَ الآخَرَ) "నిశ్చయంగా లజ్జ మరియు విశ్వాసం ఒకదానిలో ఒకటి కలిపివేయటం జరిగింది. వాటిలో ఏదైనా ఒకటి వేరుచేయబడిందంటే మరొకటి కూడా వేరైపోతుంది."[4]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(الْحَيَاءُ مِنْ الْإِيمَانِ وَالْإِيمَانُ فِي الْجَنَّةِ وَالْبَذَاءُ مِنْ الْجَفَاءِ وَالْجَفَاءُ فِي النَّارِ)

"లజ్జ విశ్వాసానికి చెందిన అంశం మరియు విశ్వాసం వలన స్వర్గం లభ్యమవుతుంది, అశ్లీలమైన (సిగ్గుమాలిన) సంభాషణ దుష్ట వ్యవహారమవు తుంది. దుష్ట వ్యవహారం వలన నరకం లభ్యమవుతుంది."[5]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "సిగ్గు మరియు నోటిని అదుపు చేయడం విశ్వాసానికి చెందిన రెండు భాగాలు, సిగ్గు మాలిన సంభాషణ మరియు అతిగా మాట్లాడటం వంచనకు చెందిన భాగాలు."[6]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఎవరైతే అశ్లీలమైన చేష్టలకు పాల్పడతారో, వారి గౌరవ స్థితి దిగజారి పోతుంది మరియు ఎవరికైతే లజ్జ, సిగ్గు అనే భావాలుంటాయో, వారి గౌరవస్థితి పెరుగుతుంది.[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(مَا كَانَ الْفُحْشُ فِي شَيْءٍ إِلَّا شَانَهُ وَمَا كَانَ الْحَيَاءُ فِي شَيْءٍ إِلَّا زَانَهُ)

'నిశ్చయంగా అల్లాహ్ లజ్జ గలవాడు, దాచిపెట్టేవాడు. అతను లజ్జను మరియు దాచి ఉంచటాన్ని ఇష్టపడతాడు, మీలో ఎవరైతే స్నానం చేస్తారో, వారు (ఏదైనా) అడ్డు ఉంచుకుని స్నానం చేయండి."[2]

ఇమామ్ ఇబ్ను ఖయ్యిమ్ (రహ్మ) లజ్జ అనే గుణం పది విధాలుగా ఉంటుం దని తెలియజేశారు:

1. హయావు జినాయతిన్ 2. హయావు తఖ్సీరిన్ 3. హయావు ఇజ్లాలిన్

---

1. *(సహీహ్ తిర్మిజీ: 1974, సహీహ్ ఇబ్ను మాజా: 4185, సహీహుల్ జామే: 5531)*
2. *(సహీహ్ అబూదావూద్:4012, సహీహ్ నసాయీ:406)*
3. *(సలాహుల్ ఉమ్మా, ఫీ ఉలువ్విల్ హిమ్మా:5/533 – మదారిజున్ సాలికీన్:2/261)*

4. హయావు కరమిన్ 5. హయావు హష్మతిన్. 6. హయావు ఇస్తిస్గారిన్ లిన్నఫ్సి వ ఇహ్తిఖారిన్ లహా. 7. హయావు ముహబ్బతిన్ 8. హయావు ఉబూది య్యతిన్. 9. హయావు షర్ఫిన్ వ ఇజ్జతిన్ 10. హయావుల్ ముస్తహ్యీ మిన్ నఫ్సిహి.[3]

1. **హయావుల్ జినాయతి:** అపరాధం చేసిన తరువాత పడే సిగ్గు. ఆదం (అలై) స్వర్గంలో సిగ్గుతో పరుగెత్తారు, అప్పుడు అల్లాహ్ ప్రశ్నించాడు: ఆదం నీవు నా (ముందర) నుండి పారిపోతావా? దానికి ఆదం (అలై) : "లేదు, నా ప్రభూ, కాని నీ ముందుకు రావటానికి సిగ్గుపడుతున్నాను" అని అన్నారు. *(అల్ హదీస్)*

2. **హయావుత్ తఖ్సీరి:** పూర్తి హక్కు చెల్లించని స్థితిలో పడే సిగ్గు. ఎలాగైతే దైవ దూతలు అల్లాహ్ వద్ద సిగ్గుపడతారో, వారు ఒక్క క్షణం వదలకుండా రేయిం బవళ్ళు అల్లాహ్ ఘనతను కొనియాడుతూ ఉంటారు. ప్రళయం రోజున వారు అల్లాహ్ ముందర హాజరైన తరువాత ఇలా అంటారు: 'నీవు మహోన్నతుడివి, నిన్ను ఆరాధించవలసిన రీతిలో ఆరాధించలేదే' అని అంటారు.

3. **హయావుల్ ఇజ్లాలి:** గౌరవపూరితమైన సిగ్గు. మనిషి అల్లాహ్ పట్ల జ్ఞానం ఎంత అధికంగా కలిగి ఉంటాడో అంతే ఎక్కువగా అల్లాహ్ పట్ల సిగ్గు పడతాడు.

4. **హయావుల్ కరమి:** మెతక వైఖరి గల సిగ్గు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) హజ్రత్ జైనబ్ (రజియల్లాహు అన్హ) గారిని వివాహం చేసుకున్న తరువాత ముహమ్మద్ (స) గారి ఇంట్లో విందు స్వీకరించిన అనుచరులు అక్కడే సంభాషణ చేసుకుంటూ చాలాసేపు వరకు కూర్చున్నారు. ఇక మీరు దయచేసి వెళ్ళమని చెప్పడానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సిగ్గుపడి చెప్పలేకపోయారు. తరువాత అల్లాహ్ ఆ విషయాన్ని ఖుర్ఆన్‌లో ఇలా తెలియజేశాడు: "విశ్వాసులైన ప్రజలారా! దైవ ప్రవక్త ఇళ్ళల్లోకి అనుమతి లేకుండా ప్రవేశించకుండి. భోజన సమయానికై కాచుకొని కూర్చోకండి. కాని మిమ్మల్ని భోజనానికి పిలిస్తే, తప్పకుండా వెళ్ళండి, అయితే

---

1. *(33 సూరతుల్ అహ్జాబ్:53)*

భోజనం చేసిన వెంటనే బయటకి వెళ్ళిపోండి. పిచ్చాపాటి మాట్లాడుకుంటూ ఉండిపోకండి. మీ ఈ చేష్టలు ప్రవక్తకు కష్టం కలిగిస్తాయి. అయినా ఆయన మొహమాటం వల్ల ఏమీ అనరు. అల్లాహ్ సత్య విషయం చెప్పటానికి మొహమాటపడడు.[1]

5. **హయావుల్ హష్మతి:** కొంత మంది సిగ్గుతో తమ విషయాలు ఇతరుల వద్ద చెప్పలేరు. హ్రజత్ అలీ బిన్ అబూతాలిబ్ (రజియల్లాహు అన్హు) 'మజీ) వ్యాధిలో ఉండగా వుజూ చేయాలా వద్దా? అనే విషయం ప్రవక్త (స)గారితో నేరుగా అడుగుటకై సిగ్గుపడి హ్రజత్ మిగ్‌దాద్ బిన్ అస్వద్ (రజియల్లాహు అన్హు) గారిని ప్రవక్త (స) వద్దకు పంపారు.

6. **హయావు ఇస్‌తిస్‌గారిన్ లిన్నఫ్సి వ ఇహ్తిఖారిన్ లహా:** 'దాసుడు అల్లాహ్‌ను వేడుకునేటప్పుడు తన అవసరాలను సిగ్గుపడుతూ మరియు అల్లాహ్ దాసునిగా భావించి దీనంగా ఆరాధిస్తూ మొరపెట్టుకుంటాడు.'

7. **హయావుల్ ముహబ్బతి:** ప్రేమతో సిగ్గుపడడం. భార్య, భర్త ప్రేమ కారణంగా సిగ్గు పడే విధానం. లేక తల్లిదండ్రులపై ప్రేమ చూపుతూ సిగ్గుపడతారు. అనేక విధాలుగా ప్రేమతో పడే సిగ్గు.

8. **హయావుల్ ఉబూదియ్యతి:** ఆరాధన పరంగా ఉండవలసిన సిగ్గు, అంటే తన ఆరాధ్యుని వద్ద భయం, భక్తితో ఉండాలనీ, తప్పుడు దారిలో పోకూడదనీ తన మనస్సును నిమగ్నం చేయుట.

9. **హయావుష్ షర్ఫి వల్ ఇజ్జతి:** గౌరవం వలన పడే సిగ్గు. కొందరు తమ వద్దనున్న ధనాన్ని ఇతరులకు ప్రసాదించిన తరువాత ఇతరులతో చెప్పుకోవటాన్ని లేక వారు ఇతరుల వద్ద దాని గురించి చర్చించటాన్ని సిగ్గుగా భావిస్తారు. మరి కొందరు ఇతరులకు సహాయం చేసిన తరువాత సహాయం అందుకున్నవాడికి సయతం తన పేరు తెలియకూడదనీ భావించే వ్యక్తి పడే సిగ్గు.

10. **హయావుల్ మర్యి మిన్ నఫ్సిహి:** కొందరు తమ మనసుతో కూడా సిగ్గుపడతారు. కొన్ని సమయాల్లో సిగ్గుగా అనిపించే విషయాల జోలికి పోకుండా

*1. (సహీహ్ బుఖారీ:3298, సహీహ్ ముస్లిం:4284)*

*2. (సహీహ్ బుఖారీ షర్‌హున్ నవ్వీ:2/209-215)*

ఉండే వ్యక్తి. అలాంటివాడు ఇతరుల ముందు ఇంకా సిగ్గుపడతాడు. అలా సిగ్గు పడడం చాలా గొప్ప గుణం.

**ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) పాటించిన సిగ్గు:** హ|జత్ అబూ సయీద్ అల్ ఖుద్రీ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్ల ల్లాహు అలైహి వ సల్లం) పరదా ధరించే కన్య కన్నా ఎక్కువగా సిగ్గుపడేవారు. ఒకవేళ ఆయన చిరాకు కలిగే విషయాన్ని చూశారంటే, అది ఆయన ముఖంలో వెంటనే కనపడుతుంది.[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) యొక్క సిగ్గుపడే గుణం ఎంతో గొప్పది. దేన్నయితే ఆయన ఇష్టపడరో, సిగ్గు కారణంగా దాని గురించి చర్చించరు. కాని అంతలోనే ఆయన ముఖం మారిపోతుంది. తరువాత ప్రవక్త అనుచరులు దానిని గమనించి అర్థం చేసుకుంటారు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మహోన్నతమైన గుణాలు కలవారు.[2]

## హజ్రత్ ఫాతిమా (రజి) గారి బిడియం

హ|జత్ ఫాతిమా (రజియల్లాహు అన్హా) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్ల ల్లాహు అలైహి వ సల్లం) మరియు దాసి, నా ఇంటికి వచ్చారు. ఆ దాసిని ముహ మ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఫాతిమా గారికి బహుమానంగా ఇచ్చారు. అప్పుడు ఫాతిమా (రజియల్లాహు అన్హా) ఒక చాదరు కప్పుకొని ఉన్నారు. ఆ చాదరు తలపై కప్పుకుంటే కాళ్ళు కనిపించేవి, కాళ్ళపై కప్పుకుంటే తల కనిపించేది. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆ స్థితిని గమనించి, ఇలా సెలవిచ్చారు: 'నీవు అంతగా కప్పుకోనక్కరలేదు, ఎందుకంటే, 'నీ వద్ద ఉన్న వారు నీ తండ్రి మరియు నీ దాసి' అని అన్నారు.[1]

## ప్రవక్త (స) గారి భార్యలు పాటించిన బిడియం

హ|జత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మరియు నా తండ్రి అబూ బకర్ (రజియల్లాహు

---

1. *(సహీహ్ అబూదావూద్: )*
2. *(రవాహుహాకిమ్ పిల్ ముస్తదర్రక్: 4/7)*
3. *(సిల్సిలతుస్ సహీహా:1828)*

అన్హు) ఖననం చేయబడిన ఇంట్లోకి నేను ఓణి లేకుండా పోయేదాన్ని ఇంకా నేను ఇలా అనే దాన్ని: "వారు నా భర్త మరియు నా తండ్రి అబూ బకర్ (రజియల్లాహు అన్హు)." కాని హజ్రత్ ఉమర్ (రజియల్లాహు అన్హు) ఖననం చేయబడిన తరువాత సిగ్గు పడుతూ ఓణిని చక్కగా కప్పుకునే (సమాధి వద్దకు) పోయేదాన్ని.[2]

## ప్రవక్త (స) అనుచరులు పాటించే సిగ్గు

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా ప్రవచించారు:

(اَلْحَيَاءُ مِنَ الإِيْمَانِ،وَ أَحْيَا أُمَّتِيْ عُثْمَانُ) "సిగ్గు విశ్వాసానికి చెందిన ఒక భాగం. నా జాతిలో అతి ఎక్కువ సిగ్గు గల వ్యక్తి, హజ్రత్ ఉస్మాన్ (రజి)."[3]

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హ) కథనం: ఒకసారి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నా ఇంట్లో విశ్రాంతి కొరకు పరురుండి ఉండిరి. ఆ సమయంలో ఆయన తొడలు లేక ఆయన పిక్కలు (దుస్తులు జారి) కనపడేటట్టు ఉన్నాయి.

అంతలో హజ్రత్ అబూబకర్ (రజియల్లాహు అన్హు) గారు అనుమతి తీసుకొని లోపలికి వచ్చి కూర్చున్నారు. ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) గారు అదే స్థితిలో కూర్చోని ఆయనతో సంభాషించారు.

తరువాత హజ్రత్ ఉమర్ (రజియల్లాహు అన్హు) గారు అనుమతి తీసుకుని లోపలికి వచ్చి కూర్చున్నారు. ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారు అదే స్థితిలో కూర్చొని ఆయనతో కూడా సంభాషించారు.

తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజియల్లాహు అన్హు) గారు కూడా అనుమతి కోరగా, ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) లేచి, తమ దుస్తులను సర్దుకొని కూర్చున్నారు.  ఆయనతో సంభాషించారు. ఆ తరువాత వారంతా తిరిగి వెళ్ళి పోయారు.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారితో, నేను (ఆయిషా): "మీ వద్దకు హజ్రత్ అబూబకర్ (రజి) గారు వచ్చారు, అయినా మీరు యధాస్థితిలో కూర్చుని సంభాషించారు. ఆ తరువాత ఉమర్ (రజి) గారు వచ్చారు. అప్పుడు

కూడా మీరు యదాస్థితిలోనే కూర్చుని ఆయనతో మాట్లాడారు. కాని హజ్రత్ ఉస్మాన్ (రజి) గారు వస్తే మీరు లేచి, దుస్తులు సర్దుకొని కూర్చొని సంభాషించారు, అలా ఎందుకని?" ప్రశ్నించాను.

దానికి జవాబుగా ప్రవక్త ముహమ్మద్ (స) : ఓ ఆయిషా! " ఏ వ్యక్తితోనైతే అల్లాహ్ దూతలు సిగ్గు చెందుతారో, ఆ వ్యక్తితో నేను సిగ్గు చెందకూడదా!" అని అన్నారు. [1]



# 3. సత్యం

అరబీ భాషలో సత్యాన్ని 'అస్ సిద్ఖ్' అంటారు. సత్యం పలికే వాడిని **'అస్ సాదిఖ్'** అంటారు.

నిఘంటువు ప్రకారం సత్యం అంటే: **నిజము.**

**ధర్మ ప్రకారం సత్యం అంటే:** జరిగిన వాస్తవికతను ఎలాంటి మార్పులు చేర్పులు లేకుండా తెలుపడం. ఉదాహరణకు: ఈ రోజు ఆదివారం ఉంటే, ఆది వారం అనే చెప్పాలి. ఒకవేళ సోమవారం అంటే అది అసత్య మైనది, సత్యానికి విరుద్ధమైన వార్త అబద్ధం.

- ఏ మాట పలుకుతామో దానికి అనుగుణంగా మన కర్తవ్యం కూడా అలాగే ఉండాలి. అలాంటి వ్యక్తిని సత్యవంతునిగా పేర్కొంటాము.
- ఒక వ్యక్తి తన నోటితో ఏదైతే పలుకుతాడో, ఆ మాట మేరకే అతని మనసులో కూడా ఉండాలి.
- ఏ పని చేస్తామో, ఆ పని మనసుకు నచ్చినదై ఉండాలి.

ఇలాంటి అనేకమైన వాస్తవాలనే సత్యము, నిజము మరియు యదార్థం అని అంటాము.

## ప్రవక్తలు ఎల్లప్పుడు నిజమే పలికేవారు

అల్లాహ్ మరియు అల్లాహ్ ప్రవక్తలు ఎల్లప్పుడు నిజమే పలుకుతారు. వారి ప్రతీ వాక్కు సత్యమైనది. కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "అల్లాహ్ మాటకన్నా ఎవరి మాట నిజమవుతుంది."[1]

ఖుర్ఆన్ గ్రంథం మాత్రమే మార్పులు చేర్పులు లేని నిజమైన గ్రంథం. మరియు ప్రవక్తలందరు ఎల్లప్పుడు సత్యాన్నే పలికేవారు. కనుక అల్లాహ్ వారి గురించి ఖుర్ఆన్ గ్రంథంలో అనేక చోట్ల ఇలా తెలియజేశాడు:

"అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త మనకు వాగ్దానం చేసిన విషయం ఇదే, అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త నిజమే పలికారు."[2]

---

*1. (4, సూరతున్ నిసా:122). 2. (33,సూరతుల్ అహ్జాబ్:22)*

అల్లాహ్ ప్రవక్తలు సత్యాన్నే పలికేవారు. కనుక వారి గురించి అల్లాహ్ ఇలా ప్రకటించాడు:

"ఈ గ్రంథంలో ఇబ్రాహీం గాధను ప్రస్తావించు, నిస్సందేహంగా అతను సత్యసంధుడైన వ్యక్తి, ఒక దైవ ప్రవక్త."[2]

"ఈ గ్రంథంలో ఇస్మాయీల్‌ను గురించి ప్రస్తావించు. అతను వాగ్దాన పాలకుడు, సందేశహరుడైన ప్రవక్త."[3]

అతడు అక్కడకు పోయి ఇలా అన్నాడు: "యూసుఫ్, నిలువెల్ల సత్యమైన వాడా! నాకు ఈ స్వప్న ఫలాన్ని తెలుపు."[4]

"ఈ గ్రంథంలో ఇద్రీస్‌ను గురించి ప్రస్తావించు. అతను ఒక నిజాయితీ పరుడైన మనిషి, ఒక ప్రవక్త. మేము అతన్ని ఒక ఉన్నత స్థానానికి లేపాము."[5]

అలాగే మన మహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గురించి మరియు ఆయన జీవిత చరిత్ర గురించి చదివినట్లయితే మక్కా నగరంలో మరియు పూర్తి ప్రపంచంలోనే ఆయన సత్యమూర్తిగా పేరు పొందినవారు.

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. సత్యవంతులకు తోడుగా ఉండండి."[6]

## సత్యం అనే పదాన్ని మూడు రకాలుగా మనం విభజించ వచ్చును

1. ఒక ముస్లిం అల్లాహ్ పట్ల సత్య విధేయుడిగా ఉండాలి.
2. ప్రజతల పట్ల సత్యవంతునిగా మెలగాలి.
3. తన విషయంలో కూడా సత్యానికి అనుగుణంగా ఉండాలి.

---

*2. (19,సూరతు మర్యమ్:41)*

*3. (19, సూరలు మర్యమ్:54)*

*4. (12,సూరతు యూసుఫ్:46)*

*5. (19, సూరతు మర్యమ్:56-57)*

*6. (9,సూరతుతౌబా:119)*

# 1. ఒక ముస్లిం అల్లాహ్ పట్ల సత్య విధేయునిగా ఉండాలి

ప్రతి కార్యంలో అల్లాహ్ ఇష్టాయిష్టాలను గమనించి చిత్తశుద్ధితో ఆరాధనలు చేసేవారిని అల్లాహ్‌కు నిజమైన విధేయులుగా భావించవచ్చు. ఆరాధనలలో ఎలాంటి ప్రదర్శనాబుద్ధి ఉండకూడదు. దానిలో ప్రదర్శనా బుద్ధి కలిగిందంటే అతను ఎంతో కష్టపడి సంపాదించిన పుణ్యాలకు అల్లాహ్ వద్ద ఎలాంటి విలువ ఉండదు. కనుక నిజమైన ముస్లిం ప్రతీ కార్యాన్ని అల్లాహ్ ప్రేమ పొందుటకై చిత్తశుద్ధితో చేయాలి.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఎవరైతే అల్లాహ్ ప్రసన్నత పొందుటకై ప్రజల నుండి అప్రసన్నత కోరుకుంటాడో, అతనికి ప్రజత చెడు నుండి అల్లాహ్ (రక్షణ) కాపాడుతాడు. మరియు ఎవరైతే ప్రజల నుండి ప్రసన్నత పొందుటకై అల్లాహ్ అప్రసన్నత కోరుకుంటాడో, అతను అల్లాహ్ యొక్క అప్రసన్నతను పొందుతాడు. మరియు ప్రజల అప్రసన్నతను కూడా పొందుతాడు."[1]

★ ప్రదర్శనా బుద్ధి కలవారు అల్లాహ్ యొక్క సత్యమైన విధేయులు కారు. వారు ఆరాధనలు చేస్తున్నట్టుగా ఇతరుల ముందు ప్రదర్శన మాత్రమే చేస్తారు. అల్లాహ్ ప్రేమను కాంక్షిస్తూ చెయ్యరు. కనుక ఇలాంటి వారంతా అసత్యవాదులు.

అలాగే బహుదైవారాధకులు నిజమైన దేవుణ్ణి ఆరాధిస్తున్నాం అనుకుంటారు. కాని వారు ఆరాధించేది విగ్రహాలనో లేక సాధువులనో లేక మంత్రగాళ్ళనో తప్ప, నిజమైన దేవుణ్ణి మాత్రం ఆరాధించడం లేదు. కనుక వారు చేసే ఆరాధన విధానం కూడా అసత్యమైనది.

అలాగే వంచకులు చెప్పేది ఒకటయితే చేసేది మరొకటి. అలాంటివారు ప్రదర్శనాబుద్ధితో ఆరాధనలు చేసినప్పటికీ వారికి ఎలాంటి ప్రతిఫలం లభించదు. పైగా వారు పరలోకంలో కఠినమయిన శిక్షలకు గురికాబడతారు.

బిద్అతీలు కూడా అసత్యవాదులు. ఎందుకంటే, వారు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను అనుసరిస్తాము మరియు వారు చెప్పినట్లుగానే విధేయతను పాటిస్తాము అని అంటారు. కాని వారు ప్రవక్త ముహమ్మద్ (స)కు విధేయత చూపకుండా, వారి తాత ముత్తాతల విధానాలకు అనుగుణంగా నడుచుకుంటారు.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జాబిర్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"వాక్యాలలో అన్నిటికంటే సత్యమైన వాక్యం అల్లాహ్ గ్రంథం (ఖుర్ఆన్). మరియు మార్గాలన్నిటిలో అతి ఉత్తమమైన మార్గం ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మార్గం మరియు ఆచారాలలో అతి చెడు ఆచారం క్రొత్త ఆచారాలు, మరియు ప్రతి క్రొత్త ఆచారం బిద్అత్, ప్రతి బిద్అత్ మార్గ విహీనమైనది. మరియు ప్రతి మార్గవిహీనత నరకానికి తీసుకువెళుతుంది.....[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచిం చారు: 'నిశ్చయంగా సత్యం మంచికి మార్గం చూపుతుంది. మరియు మంచి స్వర్గానికి మార్గం చూపుతుంది, అలాగే ఆ వ్యక్తి సత్యమే పలుకేవాడుంటే, చివరకు అల్లాహ్ వద్ద అతని పేరు సత్యవాది అని వ్రాయబడుతుంది. మరియు అసత్యాలు పాపాలకు దారి చూపుతాయి. పాపాలు నరకానికి దారి చూపుతాయి. అలాగే ఆ వ్యక్తి అసత్యాలు పలుకుతూ ఉంటే, చివరకూ అల్లాహ్ వద్ద అతని పేరు అసత్యవాది అని వ్రాయబడుతుంది.[2]

## 2. తన విషయంలో కూడా సత్యానికి అనుగుణంగా ఉండాలి

ప్రతి ముస్లిం తన తప్పు ఒప్పులను, మంచి చెడులను గుర్తించాలి. తనను తాను మోసగించుకోకూడదు. 'సత్యమేమ జయతే' అన్న విషయం మరువకూడదు.

ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు: "అనుమానంగా ఉన్న విషయా లను వదలీ అనుమానం లేని విషయాలను పాటించు. నిశ్చయంగా సత్యం సంతృప్తికి ప్రతి రూపం మరియు అసత్యం అనుమానానికి రూపం."[3]

ప్రతి మనిషికి అధర్మం గురించి, అసత్యమైన దైవాల గురించి, మూఢ నమ్మకాల గురించి తెలుసు. అలాగే జూదం గురించి, మత్తుపానీయాల గురించి,

---

*1. (సహీహ్ ఇబ్ను ఖుజైమా, సహీహుల్ జామే:1353)*

*2. (సహీహ్ బుఖారీ:5629, సహీహ్ ముస్లిం:4721)*

*3. (సహీహ్ తిర్మిజీ: 2518)*

చెడు సహవాసం గురించి తెలుసు, దాని వలన వ్యక్తిగత జీవితం ఎంత పాడవుతుం దనో కూడా తెలుసు. ప్రతీ వ్యక్తి మనసు అవన్నీ తప్పేనని అంగీకరించినప్పటికీ, తన తప్పులను ఒప్పులుగా భావించి మోసగించుకుంటున్నాడు. సత్యతబద్ధమైన జీవితానికి దూరమవుతున్నాడు.

## 3. సత్యాన్నే తమ జీవన శైలిగా చేసుకున్నవారి ఘనత

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: “వాస్తవంగా సత్యసంధులు, అల్లాహ్ ఎడల భయభక్తులు కలవారు వీరే.”[1]

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: “ఈ రోజు సత్యవంతులకు వారి సత్యం లాభాన్ని ఇస్తుంది, క్రింద కాలువలు ప్రవహించే ఉద్యానవనాలు వారికి లభిస్తాయి, అక్కడ వారు ఎల్లప్పుడు ఉంటారు. వారు అల్లాహ్ అంటే ఇష్టపడతారు. అల్లాహ్ వారంటే ఇష్టపడతాడు, ఇదే గొప్ప విజయం.”[2]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: “వ్యాపారస్తులు తమ వ్యాపారంలో సత్యమైన బాటను పాటించి (ఆ సామాగ్రి మంచీ చెడులను గురించి విడమర్చి చెప్పి) వ్యాపారం చేస్తే వారి వ్యాపారంలో అల్లాహ్ శుభాలను ప్రసాదిస్తాడు.”[3]



1. *(2,సూరతుల్ బఖరా:177)*
2. *(5,సూరతుల్ మాయిదా:119)*
3. *(సహీహ్ బుఖారీ:1972, సహీహ్ ముస్లిం:2825)*

# 4. అబద్ధం (అసత్యం)

అబద్ధం అంటే జరిగిన దానికి వ్యతిరేకంగా చెప్పడం, లేక చెప్పని విషయాలను ఇతరులు చెప్పినట్టుగా ప్రచురించడం. ఇలా అనేక అవాస్తవాలను ప్రచురించటాన్ని అబద్ధం లేక అసత్యం అంటారు.

అల్లాహ్ ఇలా ప్రకటించాడు:

(وَلَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهِ عِلْمٌ إِنَّ السَّمْعَ وَالْبَصَرَ وَالْفُؤَادَ كُلُّ أُولَئِكَ كَانَ عَنْهُ مَسْئُولًا).

"మీకు తెలియని విషయం వెంట పడకండి. నిశ్చయంగా కళ్ళూ, చెవులూ,మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగుతుంది."[1]

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "అతని నోటి నుండి వెడలే ప్రతి మాటనూ వ్రాయటానికి అనుక్షణం ఒక పరిశీలకుడు సిద్ధంగా ఉంటాడు."[2]

అన్నిటికంటే ఘోరమైన అబద్ధం దేవునికి అంటగట్టడం. తరువాత ప్రవక్తలకు అంటగట్టడం. అలాగే చిట్టచివరి ప్రవక్తగా పంపబడిన ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారిపై అబద్ధాలు అంటగట్టడం మహా అపరాధాలుగా పరిగణించబడ్డాయి.

దేవుని పట్ల అబద్ధాలు కల్పించేవారు దుర్మార్గులు. ఎందుకంటే, అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "జ్ఞానం లేకుండా ప్రజలను పెడమార్గం పట్టించే నిమిత్తం అబద్ధాన్ని కల్పించి దానిని అల్లాహ్‌కు ఆపాదించే వ్యక్తికంటే మించిన దుర్మార్గుడెవడు, నిశ్చయంగా అల్లాహ్ అటువంటి దుర్మార్గులకు ఋజుమార్గం చూపడు."[3]

మనం ప్రపంచంలో నలువైపులా చూస్తే అతి ఎక్కువగా అబద్ధాలు దేవుని విషయంలోనే కల్పిస్తున్నారు. దేవునికి ఆకారాలు తమకు తోచిన విధంగా చేసుకుని వాటిని దేవునిగా భావించి ఆరాధనలు చేస్తున్నారు. అనేక రకాల సాధువులు, మంత్రగాళ్ళు, తమ చేతబడితో అనేక రకాల వేషాలను అసాధారణ కార్యా లను చేసి చూపించి భగవానులుగా, దేవుళ్ళుగా ప్రచారం చేసుకుంటున్నారు. ఆ తరువాత అమాయక ప్రజలు వాళ్ళనే దేవుళ్ళుగా భావించి వివిధ రకాలుగా పూజా పురస్కారా

*1. (17, సూరతు బనీ ఇస్రాయీల్:36)*

*2. (50, సూరతు ఖాఫ్: 18)*

*3. (6, సూరతల్ అన్ఆమ్:144)*

లకు గురికాబడ్డారు. ఇలా దేవుని పట్ల అసత్యాలు కల్పించటం వారి వృత్తిగా మారిపోయింది. కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(وَمَنْ أَظْلَمُ مِمَّنِ افْتَرَى عَلَى اللَّهِ كَذِبًا أَوْ كَذَّبَ بِآيَاتِهِ إِنَّهُ لَا يُفْلِحُ الظَّالِمُونَ)

"అల్లాహ్‌పై బూటకపు అభాండాలు వేసేవాడికంటే లేదా అల్లాహ్ సూచనలు అసత్యాలని తిరస్కరించేవాడికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు, నిశ్చయంగా అటువంటి దుర్మార్గులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు."[1]

అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(وَقَالَتِ الْيَهُودُ عُزَيْرٌ ابْنُ اللَّهِ وَقَالَتِ النَّصَارَى الْمَسِيحُ ابْنُ اللَّهِ ذَلِكَ قَوْلُهُمْ بِأَفْوَاهِهِمْ يُضَاهِئُونَ قَوْلَ الَّذِينَ كَفَرُوا مِنْ قَبْلُ قَاتَلَهُمُ اللَّهُ أَنَّى يُؤْفَكُونَ (30) اتَّخَذُوا أَحْبَارَهُمْ وَرُهْبَانَهُمْ أَرْبَابًا مِنْ دُونِ اللَّهِ وَالْمَسِيحَ ابْنَ مَرْيَمَ وَمَا أُمِرُوا إِلَّا لِيَعْبُدُوا إِلَهًا وَاحِدًا لَا إِلَهَ إِلَّا هُوَ سُبْحَانَهُ عَمَّا يُشْرِكُونَ (31).

"ఉజైర్ అల్లాహ్ కుమారుడు అని యూదులు అంటారు, మసీహ్ అల్లాహ్ కుమారుడు అని క్రైస్తవులు అంటారు. వారికి పూర్వం అవిశ్వాసంలో పడి ఉన్నవారి మాటలను అనుసరిస్తూ, వారు తమ నోటితో అనే ఈ మాటలు నిరాధారమైనవి. అల్లాహ్ దెబ్బ వారిపై పడుగాక! వారెలా మోసపోతున్నారు! వారు అల్లాహ్‌ను కాదని తమ పండితులను, తమ సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు. ఇంకా ఇదే విధంగా మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను కూడా. వాస్తవానికి ఒకే అల్లాహ్ దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ చేసే ఆజ్ఞ వారిని ఇవ్వబడలేదు. ఆయన తప్ప ఆరాధనకు అర్హుడైన వాడెవడూ లేడు. ఆయన పరిశుద్ధుడు. వారు అనే షిర్కు (బహుదైవా రాధనా భావాలకు) మాటలకు అతీతుడు."[1]

మరొక చోట అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

"బహుదైవారాధకులు తప్పకుండా ఇలా అంటారు, ఒకవేళ అల్లాహ్‌యే కోరి ఉండినట్లయితే, మేము గాని, మా తాత ముత్తాతలు గాని బహుదైవారాధన చేసే వారము కాము. మరియు మేము దేనినీ నిషేధించి ఉండేవారము కూడా కాదు.

---

*1. (9, సూరతు తౌబా : 30-31)*

*2. (6, సూరతుల్ అన్ఆమ్ : 148-149) ఇంకా (10 సూరతు, ఆయతు 17, - 20 సూరతు, ఆయతు 48)*

ఇటువంటి మాటలనే మాటిమాటికి కల్పించి వారికి పూర్వంవారు కూడా సత్యాన్ని తిరస్కరించారు. చివరకు వారు మా శిక్షను చవిచూశారు. వారితో ఇలా అను: "మీ వద్ద ఏదైనా జ్ఞానం ఉందా మా ముందు పెట్టటానికి? మీరు కేవలం అంచనాలను అనుసరిస్తున్నారు, మీరు చేసేవన్నీ వట్టి ఊహాగానాలే." ఇంకా ఇలా అను: "(మీ వాదానికి భిన్నంగా) సత్యానికి చేర్చే వాదన అల్లాహ్ వద్ద ఉంది. అల్లాహ్ గనక సంకల్పించి ఉన్నట్లయితే నిస్సందేహంగా మీ అందరికీ ఆయన మార్గం చూపి ఉండేవాడు."[2]

## ప్రవక్త ముహమ్మద్ (స) వారిపై అబద్ధాలు అంటగట్టేవారు

(يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا لَا تُقَدِّمُوا بَيْنَ يَدَيِ اللَّهِ وَرَسُولِهِ وَاتَّقُوا اللَّهَ إِنَّ اللَّهَ سَمِيعٌ عَلِيمٌ).

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "విశ్వాసులారా! అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ ముందు నడవకండి. అల్లాహ్‌కు భయపడండి. అల్లాహ్ సమస్తమూ వినే వాడు, సర్వమూ ఎరిగినవాడూను."[1]

అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ అధిగమించకండి. అనుసరించండి, విముఖులు కాకండి, విధేయులై ఉండండి. మీ వ్యవహారాలలో మీరే చొరవ తీసుకుని నిర్ణయాలు తీసుకోకండి. కాని మొదట అల్లాహ్ గ్రంథంలో, ఆయన ప్రవక్త సూక్తులలో ఆ వ్యవహారాలకు సంబంధించిన మార్గదర్శక సూత్రాలు ఏమున్నాయో తెలుసుకోండి, ఆ తరువాత వాటిని పాటించండి.

కాని మనలో ఎంతో మంది విశ్వాసులు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆచరించని, అందజేయని ఆచారాలను, నియమాలను మరియు ధర్మంగా పరిగణించని కార్యాలను ఎంతో విశ్వాసంగా, ప్రేమగా అనుసరిస్తున్నారు, అవి అసత్యమైనవిగా నిరూపితమైనప్పటికీ వాటిని వదలకుండా అతిగా ప్రవర్తిస్తున్నారు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారి మీలాదున్ నబీ పేరున ఒక పండుగ, మరియు మేరాజున్ నబీ పేరున ఒక పండుగ, అలాగే చివరి బుధవారం (ఆఖరి చహార్‌షుంబా) అని అనేక పేర్లతో ఇస్లాం ధర్మంగా భావించని మరియు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆచరించని పండుగలను సున్నతుగా భావించి, ఇస్లాంలో లేనిపోని అనేక ఆచారాలు తమ సొంతంగా కల్పిం

1. *(సూరతుల్ హుజురాత్:1)*
2. *(59, సూరతుల్ హష్ర్:7)*

చుకొని ఆచరిస్తున్నారు. ఆపై అలా చేయడం ధర్మ సమ్మతముగానే నమ్ముతూ అల్లాహ్ వద్ద పుణ్యఫలం లభిస్తుందని భావిస్తున్నారు. అలాంటి వారి గురించి అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "అల్లాహ్ ప్రవక్త మీకు ఇచ్చిన దాన్ని తీసుకోండి, ఆయన మిమ్మల్ని నిషేధించిన దాని జోలికి పోకండి. అల్లాహ్‌కు భయపడండి, అల్లాహ్ కఠినంగా శిక్షించేవాడు."[2]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "అత్యుత్తమ వచనం అల్లాహ్ గ్రంథం. అత్యుత్తమ పద్ధతి ప్రవక్త ముహమ్మద్ (స) పద్ధతి. అత్యంత దుష్ట విషయాలు బిద్‌అత్‌లు (ప్రవక్త(స) మరియు సహాబాలు చెయ్యని ఆరాధనలు). ప్రతీ బిద్‌అత్ మార్గవిహీనమైనది."[2]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఎవరైతే తెలిసి నాపై అబద్ధాన్ని మోపుతాడో, అతను తన నివాసంగా నరకాన్ని పొందుతాడు."[3]

కనుక ఒక ఇస్లామీయ బోధకుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మాటను ఇతరులకు ప్రచురించకముందు కనీసం అది నిజమైనదా లేదా అని తెలుసుకుని చెప్పడం ఉత్తమమైనది. విన్నవాటన్నింటినీ ప్రచురించడం ధర్మ సమ్మతం కాదు. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఒక వ్యక్తి అసత్యవాది అనడానికి అతను విన్నదంతా చెప్పుకుంటూ ఉంటే చాలు."[4]

## వంచకులు అసత్యవాదులు

కొందరు అల్లాహ్‌ను విశ్వసిస్తున్నట్లుగా, మహా భక్తులుగా నటిస్తారు. అయినా వారు సత్యమైన విషయాలకు విరుద్ధులు.

కనుక అల్లాహ్ వారి గురించి ఇలా తెలియజేశాడు:

"అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని మేము విశ్వసించాము అని అనేవారు కూడా

*2. (సహీహ్ ముస్లిం: 1435)*

*3. (సహీహ్ బుఖారీ: 1209, సహీహ్ ముస్లిం:4)*

*4. (సహీహ్ ముస్లిం:6)*

*5. (2, సూరతుల్ బఖరా:8)*

కొందరు ఉన్నారు. కాని వాస్తవంగా వారు విశ్వాసులు కారు. అల్లాహ్‌ను, విశ్వాసులను వారు మోసం చేస్తున్నారు. కాని యదార్థంగా వారు తమను తాము తప్ప మరెవరినీ మోసం చెయ్యటం లేదు."[5]

మరొక చోట అలాంటి వారి గురించి అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "ఓ ప్రవక్తా! ఈ కపటులు నీ వద్దకు వచ్చినప్పుడు, మీరు నిశ్చయంగా అల్లాహ్ ప్రవక్తలే అని మేము సాక్ష్యమిస్తున్నాము అని అంటారు. అవును, నీవు నిజంగానే ఆయన ప్రవక్తవు అని అల్లాహ్‌కు తెలుసు. కాని ఈ కపటులు పచ్చి అసత్యవాదులని అల్లాహ్ సాక్ష్యమిస్తున్నాడు."[1]

## ప్రజల మధ్య ప్రచారం చేసే అసత్యాలు

ఇతరులు చెప్పని విషయాలను చెప్పినట్లుగా చెప్పుకుంటూ తిరిగేవారిని కూడా అసత్యవాదులు అని అంటాము. ఇది మరింత ఘోరమైన పాపం.

అల్లాహ్ ఇలా ప్రకటించాడు: "మీకు తెలియని విషయం వెంట పడకండి. నిశ్చయంగా కళ్ళూ, చెవులూ, మనస్సూ అన్నింటి విషయంలోనూ విచారణ జరుగుతుంది."[2]

ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు:

(آيَةُ الْمُنَافِقِ ثَلَاثٌ إِذَا حَدَّثَ كَذَبَ وَإِذَا وَعَدَ أَخْلَفَ وَإِذَا اؤْتُمِنَ خَانَ ).

"వంచకుల చిహ్నాలు మూడు, మాట్లాడినప్పుడు అబద్ధాలాడటం, మాటను నిలబెట్టుకోక పోవటం, అప్పగింతలో మోసం చెయ్యటం."[3]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: నిరంతరంగా అబద్ధాలు చెప్పే వ్యక్తిని మరియు అబద్ధాలు చెప్పుటకై ప్రయత్నించే వ్యక్తిని అల్లాహ్ వద్ద అసత్యవాదిగా వ్రాయడం జరుగుతుంది."[4]

మనం అనవసరమైన మాటలు మాట్లాడకూడదు అవి నిజమైనవైతే తప్ప. ఎందుకంటే, ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

*1. (63, సూరతుల్ మునాఫిఖూన్:1)* *2. (17, సూరతు బనీ ఇస్రాయీల్:36)*

3. (సహీహ్ బుఖారీ: 32, సహీహ్ ముస్లిం: 89)

4. (సహీహ్ బుఖారీ: 5629, సహీహ్ ముస్లిం:4720)

5. (సహీహ్ బుఖారీ: 5671, సహీహ్ ముస్లిం: 67) 6. (సహీహ్ అబూదావూద్: 4990)

"ఎవరైతే అల్లాహ్‌ను మరియు ప్రళయ దినాన్ని విశ్వసిస్తున్నారో, వారు మంచిని (సత్యమే) పలకండి, లేదంటే మాట్లాడకుండా ఉండండి."[5]

## నవ్వించటానికి అబద్ధాలు చెప్పకూడదు

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(وَيْلٌ لِلَّذِي يُحَدِّثُ فَيَكْذِبُ لِيُضْحِكَ بِهِ الْقَوْمَ وَيْلٌ لَهُ وَيْلٌ لَهُ).

"వారు నాశనం కావాలి, ఎవరైతే ఇతరులను నవ్వించటానికి అబద్ధాలు చెప్పుతారో, వారు నాశనం కావాలి. మరియు వారు నాశనము కావాలి" అని తెలిపారు.[6]

## చిన్న పిల్లలతో సరదాగా కూడా అబద్ధాలాడకూడదు

హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ ఆమిర్ (రజియల్లాహు అన్హు) కథనం: "ఒక రోజు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మా ఇంటికి వచ్చి కూర్చున్నారు, అప్పుట్లో నేను చిన్న పిల్లవాణ్ణి, నేను ఆడుకోవడానికి బయలు దేరాను, మా అమ్మ నన్ను: "ఓ అబ్దుల్లాహ్! ఇటు రావా నీకు (ఏమైనా) ఇస్తాను" అని పిలిచింది.

ఆ మాటను విన్న ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం), 'నీవు ఏం ఇవ్వదలుచుకున్నావు?' అని ప్రశ్నించారు.

దానికి ఆమె, "నేను ఖర్జూరం ఇవ్వాలనుకున్నాను." అని చెప్పింది.

తరువాత ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా అన్నారు: "ఒకవేళ అతనికి ఏమీ ఇవ్వకున్నట్లయితే నీవు అబద్ధం చెప్పినట్లు రాయడం జరుగు తుంది."[1]

## అబద్ధపు స్వప్నాలు చెప్పకునేవారి గతి

హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఎవరైతే స్వప్నంలో కనని విషయాలను కనినట్లుగా చెప్పుకుంటాడో (ప్రళయం రోజు) వారికి రెండు గోధుమల విత్తనాలు ఇచ్చి ముడి వేయుటకు ఆదేశించబడును. కాని అలా వారు ఎన్నడూ చేయలేరు. మరియు ఎవరైతే

---

*1. (సహీహ్ అబూదావూద్: 4991, అహ్మద్:15147, సిలసిలతుస్ సహీహా:748)*
*2. (సహీహ్ బుఖారీ: 6520)* *3. (సహీహ్ బుఖారీ: 1297)*

పరస్పరం మాట్లాడుకునేటప్పుడు వారి మాటలను ఇతరులు వినటాన్ని అయిష్టంగా భావించినప్పటికీ (ఇతరులు) విన్నట్లయితే ప్రళయ దినాన వినేవారి చెవులలో సీసం కాచి పోయటం జరుగుతుంది."[2]

ప్రవక్త ముహమ్మద్ (స)కు తెలియజేశారు:....

"ఆ తరువాత మీరు చూసిన రెండవ వ్యక్తి, అంటే ముచ్చలిగుంత దాక చెంప, ముక్కు, కళ్ళు చీల్చబడుతున్నవాడు ఉదయాన్నే ఇంటి నుంచి బయలుదేరి, లేనిపోని పుకార్లు లేవనెత్తి (అబద్ధాలను) లోకమంతా వ్యాపింపజేస్తుండేవాడు.." అని తెలిపారు.[3]

## అబద్ధాలు మూడు కారణాల వలన చెప్పవచ్చును

ప్రవక్త ముహ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా హజ్రత్ ఉమ్మే కుల్సూమ్ (రజియల్లాహు అన్హు) విన్నారనీ ఇలా తెలియజేశారు:

(لَيْسَ الْكَذَّابُ الَّذِي يُصْلِحُ بَيْنَ النَّاسِ وَيَقُولُ خَيْرًا وَيَنْمِي خَيْرًا).

"అబద్ధాలను ప్రజల వ్యవహారాలను సరిదిద్దుటకై చెప్పేవాడు అసత్యవాది కాడు. దాని వలన అతను మేలును కాంక్షిస్తున్నాడు, లేక మేలు కొరకై చెప్తున్నాడు."[1]

హజ్రత్ ఇబ్ను షిహాబ్ (రజియల్లాహు అన్హు) ఇలా తెలియజేశారు:

(وَلَمْ أَسْمَعْ يُرَخَّصُ فِي شَيْءٍ مِمَّا يَقُولُ النَّاسُ كَذِبٌ إِلَّا فِي ثَلَاثٍ الْحَرْبُ وَالْإِصْلَاحُ بَيْنَ النَّاسِ وَحَدِيثُ الرَّجُلِ امْرَأَتَهُ وَحَدِيثُ الْمَرْأَةِ زَوْجَهَا) .

"మూడు సందర్భాల కంటే ఎక్కువగా అబద్ధాలు చెప్పవచ్చుననీ అనుమతి ఇచ్చినట్లు నేను వినలేదు." ఒకటి: యుద్ధంలో, రెండు, ఇద్దరి మధ్య సంధి కోసం, మూడు భర్త భార్యకు మరియు భార్య భర్తకు (అందచందాల పట్ల పొగుడ్తూ) చెప్పే మాటలు.[2]



---

1. *(సహీహ్ బుఖారీ: 2495, సహీహ్ ముస్లిం:4717)*
2. *(సహీహ్ ముస్లిం:4717)*

# 5. అమానత్ (అప్పగింతలు)

**అమానత్ అంతే:** అప్పగింతలు. ఇంకా అనేక అర్థాలు కూడా ఉన్నాయి. వాటిలో అతి గొప్పదైనది:'అల్లాహ్ మాపై విధించిన ఆరాధనలను అప్పగింతగా భావించి వాటిని సక్రమంగా పాటించడము.'

**ధనం మరియు ఇతర సామగ్రి అప్పగింతలు:** ఒక వ్యక్తి ఇతరులకు భద్రపరుచు టకై ఇచ్చే సామగ్రిని లేక ధనాన్ని అమానత్ అని భావించాలి. అంటే, నా గడియారము మీ వద్ద ఉంచండి, నేను అవసరమైనప్పుడు మీ వద్ద నుండి తీసుకుంటాను. లేక ఈ డబ్బు మీ వద్ద ఉంచండి, నేను అడిగినప్పుడు తిరిగి ఇవ్వండి అని ఇతరులకు అప్పగించడం. ఇలా ఇతరుల వద్ద దాచుకొని మరియు తిరిగి అలాగే అప్పగించే పద్ధతిని అమానత్ అంటారు.

**ఇతరుల వస్తువులను వాడుకొని తిరిగి అప్పగించే పద్ధతిని కూడా 'అమానత్' అంటారు.** ఇతరుల వద్ద మనం గొడ్డలి, లేక పారా, లేక ఇంటి వస్తువులు అంటే; కత్తి పీట, రోకలి, సైకిల్ వంటివి వాడుకొని తిరిగి భద్రంగా వాపసు ఇచ్చే కార్యాన్ని కూడా అమానత్ అంటారు.

**అద్దెకు తీసుకున్న వస్తువులను కూడా అమానత్‌గా భావించాలి.** ఒకరి ఇల్లు లేక బండి లేక ఇతర విషయాలు అద్దెకు తీసుకొని తిరిగి ఇచ్చేటప్పుడు భద్రంగా తిరిగి ఇవ్వటాన్ని **'అమానత్'** అంటారు.

**దేశాన్ని పరిపాలించే వ్యక్తి ప్రజల క్షేమాన్ని అన్ని కోణాలుగా రక్షించే బాధ్యతను కూడా 'అమానత్' అంటారు.** ప్రజల ధన, మాన, ప్రాణాలు కాపాడుతూ ఉండాలి. ధర్మ పరంగా మరియు సామాజికపరంగా వారి మేలును సక్రమంగా తీర్చే బాధ్యతను విధిగా చేసుకోవాలి.

అలాగే రాజ్య పరిపాలనలో వివిధ హోదాలలో ఉన్న ప్రతి ఒక్కరు తమ తమ బాధ్యతను గుర్తించి సక్రమంగా అమలుపర్చడం కూడా 'అమానత్' అంటారు.

అమానత్‌ను ఎవరు ఎంత జాగ్రత్తగా మరియు ఎంత బాధ్యతగా సక్రమంగా నెరవేరుస్తారో వారు గొప్ప విశ్వసనీయులు.

ఎవరయితే ఎంత తక్కువగా ఆ బాధ్యతను నెరవేర్చుతారో వారు అంతే బలహీన విశ్వాసులు.

**సంతానం అప్పగింతలు:** భార్యా బిడ్డలు, ఇతర రక్త సంబంధాలను ప్రతి ఒక్కరు వారి వారి హక్కులను నెరవేర్చడము. ప్రతి వ్యక్తి తమ బాధ్యతను తెలుసుకుని వాటిని పాటించడము విధిగా తీసుకోవాలి. అలాగే ఇతరులకు చెప్పకూడదని దాచిపెట్టే రహస్యాలను అమానత్ అనే భావించాలి. ఇతరులకు చెప్పడం అమానత్‌ను భంగ పరచినట్లు అవుతుంది.

**మనపై విధిగా ఉన్న ఈ అప్పగింతల బాధ్యతను కచ్చితంగా నెరవేర్చాలి.** మనపై ఉన్న బాధ్యతల్లోకెల్లా అతి ముఖ్యమైన బాధ్యత అల్లాహ్ మనపై విధిగా చేసిన ఆరాధనలను జ్ఞానపూర్వకంగా తెలుసుకుని వాటిని నెరవేర్చడమే. ఎందుకంటే; మహోన్నతుడైన మన ప్రభువు అల్లాహ్‌యే, అతనికి భయపడి మనం సక్రమంగా నడుచుకున్నామంటే అల్లాహ్ మనపై విధించిన అప్పగింతను నెరవేర్చినట్లు. ఆ తరువాత ఆ అల్లాహ్‌కు భయపడే ఇతరుల హక్కులను కూడా మనం సక్రమంగా నెరవేర్చే ప్రయత్నం చేస్తాము. అల్లాహ్‌కు భయపడకుండా ఆయన హక్కులను నెరవేర్చ కుండా ఇతరుల హక్కులు మనం ఎలా చెల్లించగలము? కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

**(إِنَّا عَرَضْنَا الْأَمَانَةَ عَلَى السَّمَاوَاتِ وَالْأَرْضِ وَالْجِبَالِ فَأَبَيْنَ أَنْ يَحْمِلْنَهَا وَأَشْفَقْنَ مِنْهَا وَحَمَلَهَا الْإِنْسَانُ إِنَّهُ كَانَ ظَلُومًا جَهُولًا).**

"మేము ఈ అమానతును ఆకాశాల ముందూ, భూమి ముందూ, పర్వతాల ముందూ పెట్టాము. అవి దానిని మోయటానికి సిద్ధపడలేదు. దానికి భయ పడ్డాయి. కాని మానవుడు దాన్ని తనపై మోపుకున్నాడు. నిస్సందేహంగా, అతడు అన్యాయం చేసుకున్నాడు, మూర్ఖుడు."[1]

అంటే; ఖుర్ఆన్ గ్రంథం మరియు దాని నియమాలు మనపై అమానతుగా ఉన్న బాధ్యత. దాని ప్రకారం మనం నడుచుకున్నట్లయితే మనం ఆ అమానతును సక్రమంగా తీర్చినట్లు, లేకపోతే ఆ అమానతు పట్ల మనము మూర్ఖత్వాన్ని చూపినట్లు.

---

*1. (33, సూరతుల్ అహ్‌జాబ్:72)*

మరోచోట అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

**(إِنَّ اللَّهَ يَأْمُرُكُمْ أَنْ تُؤَدُّوا الْأَمَانَاتِ إِلَى أَهْلِهَا وَإِذَا حَكَمْتُمْ بَيْنَ النَّاسِ أَنْ تَحْكُمُوا بِالْعَدْلِ إِنَّ اللَّهَ نِعِمَّا يَعِظُكُمْ بِهِ إِنَّ اللَّهَ كَانَ سَمِيعًا بَصِيرًا).**

"ముస్లిములారా! అమానతులను యోగ్యులైన వారికి అప్పగించండి. ప్రజతల మధ్య తీర్పు చేసేటప్పుడు న్యాయంగా చేయండి. అని అల్లాహ్ మిమ్మల్ని ఆజ్ఞాపిస్తు న్నాడు. అల్లాహ్ మీకు ఎంతో చక్కని హితబోధ చేస్తున్నాడు. నిశ్చయంగా ఆయన అన్నీ వింటాడు, అన్నీ చూస్తాడు."[1]

**(أَنَّ عَبْدَ اللَّهِ بْنَ عُمَرَ يَقُولُ: سَمِعْتُ رَسُولَ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ كُلُّكُمْ رَاعٍ وَكُلُّكُمْ مَسْئُولٌ عَنْ رَعِيَّتِهِ الْإِمَامُ رَاعٍ وَمَسْئُولٌ عَنْ رَعِيَّتِهِ وَالرَّجُلُ رَاعٍ فِي أَهْلِهِ وَهُوَ مَسْئُولٌ عَنْ رَعِيَّتِهِ وَالْمَرْأَةُ رَاعِيَةٌ فِي بَيْتِ زَوْجِهَا وَمَسْئُولَةٌ عَنْ رَعِيَّتِهَا وَالْخَادِمُ رَاعٍ فِي مَالِ سَيِّدِهِ وَمَسْئُولٌ عَنْ رَعِيَّتِهِ قَالَ وَحَسِبْتُ أَنْ قَدْ قَالَ وَالرَّجُلُ رَاعٍ فِي مَالِ أَبِيهِ وَمَسْئُولٌ عَنْ رَعِيَّتِهِ وَكُلُّكُمْ رَاعٍ وَمَسْئُولٌ عَنْ رَعِيَّتِهِ).**

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"వినండి! మీలో ప్రతీ వ్యక్తి కాపలాదారుడు, అతని ఆధీనంలో ఉన్న ప్రతి ఒక్కరి విషయంలో ప్రశ్నించబడతాడు. ప్రజలకు నాయకుడైన ఇమామ్ కాపలా దారుడు. అతని ఆధీనంలో ఉన్న ప్రజల విషయంలో అతన్ని ప్రశ్నించడం జరుగు తుంది. మనిషి తన ఇంటివారికి కాపలాదారుడు. వారి విషయంలో అతడు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. స్త్రీ తన భర్త ఇల్లు, అతని పిల్లలకు కాపలాదారి. వారిని గురించి ఆమెను ప్రశ్నించడం జరుగుతుంది. బానిస తన యజమాని వస్తు సామగ్రికి కాపలాదారుడు. అతన్ని వాటి విషయంలో ప్రశ్నించడం జరుగుతుంది. కాబట్టి వినండి! మీలో ప్రతి ఒక్కరు కాపలాదార్లే, ప్రతి వ్యక్తితో అతని బాధ్యత గురించి ప్రశ్నించడం జరుగుతుంది."

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "వారు తమ అమానతులకు, తమ వాగ్దానాలకు కట్టుబడి ఉంటారు."[1]

---

*1. (సహీహ్ బుఖారీ:844)*

మరో చోట అల్లాహ్ ఇలా తెలియజేశాడు: “తమ అమానతులను పరిరక్షించే వారు, తమ వాగ్దాలను నిలబెట్టుకునే వారు, తమ సాక్ష్యాల విషయంలో నిజాయితీగా ఉండేవారు, తమ నమాజును కాపాడుకునేవారు ఇలాంటి వారు సగౌరవంగా స్వర్గవనాలలో ఉంటారు.”[2]

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు, వంచకుల చిహ్నాలు మూడు:

1. మట్లాడినప్పుడు అబద్ధాలాడటం.
2. మాటను నిలబెట్టుకోకపోవటం.
3 అప్పగింతలో మోసం చెయ్యటం.[3]

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మాట్లాడుతుండగా ఒక పల్లెవాసి హఠాత్తుగా వచ్చి ప్రళయం ఎప్పుడు నెరవేరుతుందని ప్రశ్నించాడు. దానికి ప్రవక్త ముహమ్మద్ (స): “ఎప్పుడైతే అప్పగింత హరింపబడుతుందో అప్పుడు ప్రళయం కోసం నిరీక్షించండి” అని అన్నారు.

అది ఎలా హరింపడుతుందని ఒకతను అడిగాడు.

దానికి ప్రవక్త ముహమ్మద్ (స): “ఎప్పుడైతే (ముఖ్యమైన) వ్యవహారం అసమర్ధులకు అప్పగించబడుతుందో అప్పుడు ప్రళయానికై నిరీక్షించండి” అని తెలియజేశారు.[4]

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

ప్రతి సభ (రహస్యం) అమానతు. కాని మూడు సభలు అమానతు కావు;

1 అన్యాయంగా రక్తపాతం చేసిన సభ.
2 వ్యభిచారం చేసే సభ.

---

1. *(23,సూరతుల్ మూమినూన్: 8)*
2. *(70,సూరతుల్ మఆరిజ్: 32-35)*
3. *(సహీహ్ బుఖారీ:32, సహీహ్ ముస్లిం: 89)*
4. *(సహీహ్ బుఖారీ: 57)*

3 అన్యాయంగా ధనాన్ని దోచుకోబడుతున్న సభ.[1]

★ అంటే, ఒకచోట ఒకడిని అన్యాయంగా చంపుతున్నారంటే మనం దాన్ని చూసి దాచిపెట్టడం సమంజసం కాదు. జరిగిన అన్యాయాన్ని గురించి సాక్ష్యం చెప్పాలి.

★ ఎవరైనా వ్యభిచారానికి గురికాబడిన లేక వ్యభిచారం చేసేవారుంటే దానిని కూడా దాచకుండా సాక్ష్యం చెప్పాలి.

★ ఎవరైనా ఇతరుల ధనాన్ని దోచుకున్నట్లయితే దాని గురించి మనం చూశామా లేక మనకు తెలిసిందంటే అక్కడ కూడా మనం సాక్ష్యం చెప్పాలి. ఏమో మాకు తెలీదంటూ ఉండకూడదు. ఇవి అల్లాహ్ యొక్క హద్దులు. వాటి పట్ల మనం సాక్ష్యం చెప్పకపోతే పాపాత్ముల అవుతాము.



# 6. సలాము చెప్పే విధానం

**‘అస్సలాము’ అంటే:** శాంతి, సుఖము.

**‘అస్సలాము’** అల్లాహ్ పేర్లకు చెందిన ఒక పేరు. దీనిని దుఆ పదముగా కూడా వాడుతారు.

మనం ఇతరులతో కలసినప్పుడు సంభాషణకు ముందు: **‘అస్సలాము అలైకుం వ రహ్మాతుల్లాహ్”** (ఇహలోకంలోను పరలోకంలోను శాంతి సుఖాలు పొందు) అని ప్రార్థిస్తాము.

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

“మీరు ఇళ్లల్లోకి ప్రవేశించినప్పుడు మీ ఇంటివారికి సలాము చేయండి. ఇది మేలు కొరకు చేయబడే ప్రార్థన. అల్లాహ్ తరఫు నుండి నిర్ణయించబడింది. ఎంతో శుభవంతమైనది, పరిశుద్ధమైనది. ఈ విధంగా అల్లాహ్ తన ఆయతులను మీకు ఉపదేశిస్తున్నాడు, మీరు ఆలోచించి అర్థం చేసుకుని వ్యవహరిస్తారని ఆశించ బడుతోంది.”[1]

పరస్పరం సలాము చెప్పుకునే పదాలు:

**అస్సలాము అలైకుం.**

**అస్సలాము అలైకుం వ రహ్మాతుల్లాహి**

**అస్సలాము అలైకుం వ రహ్మాతుల్లాహి వ బరకాతుహు.**

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఒక సభలో ఉండగా ఒక వ్యక్తి వచ్చాడు,

అతను: **‘అస్సలాము అలైకుం’** (السَّلَامُ عَلَيْكُمْ) అని చెప్పాడు.

దానికి ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం): ‘పది పుణ్యాలు’ అన్నారు. తరువాత మరొక వ్యక్తి వచ్చాడు.

అతను: **‘అస్సలాము అలైకుం వ రహ్మాతుల్లాహి’ (السَّلَامُ عَلَيْكُمْ وَرَحْمَةُ اللَّهِ)** అని అన్నాడు.

---

*1. (24 సూరతున్ నూర్:61)*

దానికి ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం): 'ఇరవై పుణ్యాలు' అన్నారు. తరువాత మూడవ వ్యక్తి వచ్చాడు,

అతను:**'అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహి వబరకాతుహు'** **(السَّلَامُ عَلَيْكُمْ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهُ)** అని అన్నాడు.

దానికి ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం): 'ముప్పయి పుణ్యాలు' అన్నారు.[1]

## సలాము వలన ప్రేమభిమానాలు మెరుగుపడుతాయి

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**(لَا تَدْخُلُونَ الْجَنَّةَ حَتَّى تُؤْمِنُوا وَلَا تُؤْمِنُوا حَتَّى تَحَابُّوا أَوَلَا أَدُلُّكُمْ عَلَى شَيْءٍ إِذَا فَعَلْتُمُوهُ تَحَابَبْتُمْ أَفْشُوا السَّلَامَ بَيْنَكُمْ).**

"మీరు మోమిన్ కానంతవరకు స్వర్గంలో ప్రవేశించలేరు. పరస్పరం ప్రేమాభి మానాలతో మెలగనంతవరకు మోమిన్‌లు కాలేరు. మీరు పరస్పరం ప్రేమాభి మానాలతో మసలుకునే ఓ ఉపాయం తెలుపమంటారా? మీ మధ్య 'సలామ్'ను విస్తృతం చేసుకోండి."[2]

## సలాము చెప్పటం సున్నతు, ఆ సలాముకు జవాబు చెప్పటం వాజిబు

అల్లాహ్ ఇలా ఆదేశించాడు: "మీకు ఎవరైనా గౌరవభావంతో సలాము చేస్తే అతనికి మీరు అంతకంటే ఉత్తమమైన పద్ధతిలో ప్రతి సలాము చెయ్యండి. లేదా కనీసం అదే విధంగానైనా జవాబు ఇవ్వండి. అల్లాహ్ ప్రతి దానికి లెక్క తీసుకుంటాడు."[3]

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

---

1. *(సహీహ్ అబూదావూద్:5195, సహీహ్ తిర్మిజీ:602)*
2. *(సహీహ్ ముస్లిం:81)*
3. *(4, సూరతున్ నిసా:86)*

ప్రతి ముస్లింపై సాటి ముస్లింకు ఆరు హక్కులున్నాయి. అప్పుడు అక్కడున్న వారు అవి ఏవి? అని అడగ్గా; ఆయన (స) ఈ విధంగా బోధించారు:

1. ముస్లిం సోదరుడిని కలిస్తే అతనికి సలాం చెయ్యి.
2. అతను విందుకు ఆహ్వానిస్తే ఆహ్వానాన్ని స్వీకరించు.
3. అతను హితవు చెయ్యమని కోరితే హితవు చెయ్యాలి.
4. అతను తుమ్మి 'అల్‌హమ్దులిల్లాహ్' అంటే, నీవు దానికి 'యర్‌హము కల్లాహ్' అని బదులివ్వు.

   (ఆ తరువాత జవాబుకు ప్రతి జవాబుగా: 'యహ్‌దీకుముల్లాహు వ యుస్‌లిహ్ బాలకుమ్' అని చెప్పాలి)
5. అతను వ్యాధిగ్రస్తుడయితే వెళ్ళి పరామర్శించు.
6. అతను చనిపోతే అతని జనాజాకు (నమాజుకు మరియు శ్మశానానికి) తోడుగా వెళ్ళు.[1]

## మల, మూత్ర విసర్జన సమయంలో సలాము చెప్పకూడదు, దానికి బదులు కూడా చెప్పకూడదు

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మూత్ర విసర్జన చేస్తుండగా ఒక వ్యక్తి వచ్చి 'సలామ్' చేశాడు. అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అతనికి జవాబు చెప్పలేదు.[2]

కాబట్టి మల మూత్ర విసర్జన చేస్తుండగా సలాము చెప్పకూడదు, సలాము చెప్పిన వారికి జవాబు కూడా ఇవ్వకూడదు.

## సలాము మరియు (కరచాలనం) ముసాఫహ్ చెయ్యడం

సలామ్ చెప్పడము మరియు సలాము తరువాత అభిమానించుకోవడం (ముసాఫహ్, చేతులు కలుపుకోవడం) వలన మంచి పుణ్య ఫలితం లభిస్తుంది.

---

*1. (సహీహ్ ముస్లిం:4023)*

*2. (సహీహ్ ముస్లిం:555)*

మనిషికి సలామ్ చేస్తే పుణ్యం ఉంది. ఆ తరువాత 'ముసాఫహ్' చేస్తే మరింత పుణ్యం అధికమవుతుంది.

కనుక ప్రవక్త ముహ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِنَّ الْمُؤْمِنَ إِذَا لَقِيَ الْمُؤْمِنَ فَسَلَّمَ عَلَيْهِ وَأَخَذَ بِيَدِهِ فَصَافَحَهُ تَنَاثَرَتْ خَطَايَاهُمَا كَمَا يَتَنَاثَرُ وَرَقُ الشَّجَرِ).

"నిశ్చయంగా ఒక విశ్వాసి మరొక విశ్వాసికి కలిసినప్పుడు అతనికి సలామ్ చేసి, చెయ్యిలో చెయ్యి కలిపినట్లయితే, వారి నుండి వారి పాపాలు రాలి పోతాయి, ఎలాగైతే చెట్టు నుండి దాని ఆకులు రాలిపోతాయో."[1]

## ప్రతి సలామ్, సలామ్ చేప్పేవారి కంటే గొప్పగా చెప్పాలి

ఇంట్లో ఉన్నవారికి సలామ్ చేస్తే కనీసం వారికి ప్రతి సలామ్ చెయ్యాలి. లేక దానికంటే గొప్పగా సలామ్‌కు జవాబు ఇవ్వాలి. కనుక అల్లాహ్ ఇలా ఆదేశించాడు:

وَإِذَا حُيِّيتُم بِتَحِيَّةٍ فَحَيُّوا بِأَحْسَنَ مِنْهَا أَوْ رُدُّوهَا إِنَّ اللَّهَ كَانَ عَلَى كُلِّ شَيْءٍ حَسِيبًا

"మీకు ఎవరైనా గౌరవభావంతో సలాము చేస్తే అతనికి మీరు అంతకంటే ఉత్తమమైన పద్ధతిలో ప్రతి సలాము చెయ్యండి. లేదా కనీసం అదేవిధంగానైనా జవాబు ఇవ్వండి. అల్లాహ్ ప్రతి దానికి లెక్క తీసుకుంటాడు."[2]

## ముసాఫహా (కరచాలనం) విశిష్టత

హ॒జ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు:

(مَا مِنْ مُسْلِمَيْنِ يَلْتَقِيَانِ فَيَتَصَافَحَانِ إِلَّا غُفِرَ لَهُمَا قَبْلَ أَنْ يَفْتَرِقَا).

"మీలో ఎవరైనా ఇద్దరు ముస్లిం సోదరులు కలుసుకున్నప్పుడు ఒకరికొకరు ముసాఫహా చేసుకుంటే (చేతులు కలుపుకున్నట్లయితే) వారిద్దరు విడిపోక ముందే వారి పాపాలు క్షమించబడుతాయి."[3]

---

1. *(త॒బ్రానీ ఫిల్ అవ్‌సత్:250, సహీహ్ అత్తర్గీబ్:2720)*
2. *(4,సూరతున్ నిసా:86)*

# పర స్త్రీలకు సలాము చెప్పవచ్చునా?

ఎంతో మంది యువ బాల, బాలికలు పరస్పరం సలాము చెప్పుకోవడం. కరచాలనం చేయడం ఫ్యాషన్‌గా మారిపోయింది. ఇవంతా చాలా చిన్న విషయాలుగా భావిస్తున్నారు. ఇస్లామీయ ధర్మ నియమాలను వదలి ధర్మం తప్పినవారి చేష్టలకు, వారి పద్ధతులకు అలవాటు పడి ఇస్లామీయ క్రమశిక్షణ లేకుండా తప్పుడు మార్గానికి గురికాబడుతున్నారు. ఇది ధర్మపరంగా చాలా ఘోరమైన పాపం.

కనుక ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా హెచ్చరించారు:

(لأَنْ يُطْعَنَ فِي رَأْسِ رَجُلٍ بِمِخْيَطٍ مِنْ حَدِيدٍ خَيْرٌ لَهُ مِنْ أَنْ يَمَسَّ امْرَأَةً).

"ఒక వ్యక్తి పరస్త్రీని తాకడం కంటే, వ్యక్తి తన తలలో మేకు దింపుకున్నా మేలు."[1]

అంటే పరస్త్రీలను తాకడమే అంత ఘోరమైన పాపంగా భావించబడిందంటే హగ్ చేసుకోవడం (కౌగిలించుకోవడం). టాటాలు చెప్పుకోవడం, సలామ్ చెప్పడం అంతయూ ధర్మసమ్మతం కానివి. స్త్రీలకు సలామ్ చెప్పవలసిన అవసరం వచ్చిందంటే దానికి కొన్ని నియమాలున్నాయి. ఆ నియమాల ప్రకారం స్త్రీ, పురుషులు మసలుకోవాలి.

ఇమామ్ ఇబ్నుల్ ఖయ్యూమ్ (రహ్మ) ఇలా తెలియజేశారు:

"వృద్ధ స్త్రీలకు సలాము చేయవచ్చును మరియు వారికి జవాబు చెప్పవచ్చును, కాని (పర వృద్ధ స్త్రీలను కూడా కౌగిలించుకోరాదు) తమ మహ్రిమ్‌లకు (తోడ పుట్టిన వారికి, కూతుళ్ళకు తల్లికి) సలాము చెప్పవచ్చును. చెయ్యి కూడా కలుపవచ్చును. అలాగే అవిశ్వాసులకు మనము ముందుగా సలాము చెప్పకూడదు, ఒకవేళ వారు సలాము చేస్తే జవాబు ఇవ్వవచ్చును. లేక **'వఅలైకుం'** అని కూడా చెప్పవచ్చు.

---

*3. (సహీహ్ అబూదావూద్:5212)*

*1. (అల్ మోజముల్ కబీర్ లిత్ తబ్రానీ: 16881, సహీహ్ అత్తర్గీబ్ వత్తర్హీబ్: 1910)*

## ఇంట్లోకి వెళ్లినప్పుడు సలాము చెప్పడం అభిలషణీయం

మీరు ఇంట్లోకి పోతే ఒకవేళ ఇంట్లో ఎవరూ లేకపోతే అప్పుడు ఆ వ్యక్తి తనకు తాను సలాము చేసుకోవాలి. అంటే: **السَّلَامُ عَلَيْنَا وَعَلَى عِبَادِ اللَّهِ الصَّالِحِينَ** **"అస్సలాము అలైనా వఅలా ఇబాదిల్లాహిస్ సాలిహీన్)**[2]

ఒకవేళ ఆ ఇంట్లో తమ భార్యా పిల్లలు మాత్రమే ఉంటే, అప్పుడు సలాము చెప్పి, తరువాత **(تَحِيَّةً مِنْ عِنْدِ اللَّهِ مُبَارَكَةً طَيِّبَةً)** 'తహియ్యతన్ మిన్ ఇన్దిల్లాహి ముబారకతన్ తయ్యిబతన్' అని చెప్పండి.[1]

## సలాము చెప్పి పంపినవారికి జవాబు ఎలా ఇవ్వాలి?

ఒక వ్యక్తి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) వద్దకు వచ్చి ఇలా చెప్పాడు. నా తండ్రి మీకు సలాము చెప్పారు. అప్పుడు ప్రవక్త (స) : **(عَلَيْكَ وَعَلَى أَبِيكَ السَّلَامُ)** 'అలైక, వఅలా అబీకస్ సలామ్' అని బదులిచ్చారు.[2]

## సలామ్ బిగ్గరగా చెప్పాలి, జవాబు కూడా బిగ్గరగా ఇవ్వాలి :

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ మరియు సాబిత్ బిన్ ఉబైద్ (రజియల్లాహు అన్హు) కథనం, నేను ఒక సభలో ప్రవేశించాను. దానిలో హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) గారు కూడా ఉన్నారు. అప్పుడు ఆయన ఇలా తెలియజేశారు: "నీవు సలామ్ చేస్తే వినిపించేటట్టు చెయ్యి. ఎందుకంటే, ఇది ఎంతో ఉత్తమమైన స్వాగతము."[3]

ఇమామ్ నవ్వీ (రహ్మ) ఇలా వ్యాఖ్యానించారు: 'సలామ్ చెప్పేవారు బిగ్గరగా చెప్పాలి.' ఎవరికైతే మనం సలామ్ చేస్తామో కనీసం వారైనా విని దానికి బదులిచ్చేలా చెప్పాలి.

ఒకవేళ తన మనసులో చెప్పుకున్నట్లైతే జవాబు చెప్పడం అక్కడున్న వారిపై విధిగా ఉండదు. అలాగే సలామ్‌కు జవాబు బిగ్గరగానే చెప్పాలి.

ఒకవేళ సలామ్ చేసినవాడికి మన జవాబు వినిపించకపోతే, అతనికి జవాబు ఇచ్చే విధి తొలిగిపోదు.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త

ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్దకు ఒక వ్యక్తి వచ్చి ఇలా అడిగాడు: 'ఇస్లాం ధర్మంలో అన్నిటికంటే ఉత్తమమైనవి ఏవి?' ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా సెలవిచ్చారు:

(تُطْعِمُ الطَّعَامَ وَتَقْرَأُ السَّلَامَ عَلَى مَنْ عَرَفْتَ وَمَنْ لَمْ تَعْرِفْ) ''ఇతరులకు భోజనం పెట్టడం, పరిచయమున్నా లేకపోయినా వారందరికీ సలామ్ చేయడం.''[1]

## సవారిపై ఉన్నవాడు నడిచేవాడికి సలామ్ చెయ్యాలి :

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు.

★ "సవారిపై ఉన్నవాడు నడిచేవాడికి సలామ్ చేయాలి.

★ నడిచేవాడు కూర్చున్నవాడికి సలామ్ చేయాలి.

★ చిన్నకూటమి (సభ) పెద్ద కూటమికి సలామ్ చేయాలి."[2]

మరొక ఉల్లేఖనం ప్రకారం :

(يُسَلِّمُ الصَّغِيرُ عَلَى الْكَبِيرِ وَالْمَارُّ عَلَى الْقَاعِدِ وَالْقَلِيلُ عَلَى الْكَثِيرِ)

★ "చిన్నవాడు పెద్దవారికి సలామ్ చేయాలి.

★ నడిచేవాడు కూర్చున్నవారికి సలామ్ చేయాలి.

★ చిన్న కూటమి (సభ) పెద్ద కూటమికి సలామ్ చేయాలి."[3]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "మీరు సభలోకి చేరుకుంటే సలామ్ చెప్పండి, సభ నుండి లేచి తిరిగి పోయేటప్పుడు కూడా సలామ్ చెప్పండి. రెండు సమయాల సలామ్ చెప్పడం (పుణ్యపరంగా) సమానమైనది."[4]

హజ్రత్ అనస్ (రజియల్లాహు అన్హు) కథనం, ఒకసారి ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారితో నేను వెళ్ళుతుండగా, చిన్నపిల్లల ముందు నుంచి పోయాము. అప్పుడు ముహమ్మద్ (స) వారికి 'సలామ్' చెప్పారు.[1] అంటే, పెద్దలు తమకంటే చిన్నవారికి సలామ్ చెప్పవచ్చును.

## మూడుసార్లు సలామ్ చెప్పవచ్చును

హ్రజత్ అనస్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఒక మాటను అర్థమయ్యే వరకు మూడు సార్లుగా చెప్పేవారు. ఇంకా ఏదైనా సమూహం వద్దకు పోతే మూడు సార్లు సలామ్ చెప్పేవారు.[2]

ఇమామ్ ఇబ్ను హజర్ (రహ్మ) ఇలా అన్నారు: "ఎవరికయినా సలామ్ చేసిన తరువాత వినిపించకపోతే, వారికి రెండోసారి, మూడోసారి కూడా సలామ్ చెప్పవచ్చును. కాని మూడుసార్లకు మించి చెప్పకూడదు."

## నమాజు చేస్తుండగా సలామ్‌కు జవాబు చేతివ్రేళ్ళతో సైగ చెయ్యాలి

హ్రజత్ సుహైబ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నమాజు చేస్తుండగా నేను ఆయన వద్దకు పోయి 'సలామ్' చేశాను. అప్పుడు ఆయన జవాబుగా సైగ చేశారు. 'ఆయన తమ వ్రేలుతో సైగ చేసినట్లుగా మాత్రమే నాకు తెలుసనీ' ఆయన అన్నారు.[3]

మరొక ఉల్లేఖనం ప్రకారం, ఆయన తమ అరచెయ్యితో సైగ చేశారు, మరియు తమ తలతో సైగ చేశారు. ఇలా రెండు విధాలుగా కూడా సైగ చేసే అనుమతి ఉంది.

## సలామ్ చేసిన తరువాత మరలా సలామ్ చెయ్యాలంటే

హ్రజత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఎవరైతే తమ సోదరుణ్ణి కలుస్తారో తప్పకుండా వారికి సలామ్ చెప్పండి. ఒకవేళ మీ మధ్యన చెట్టు లేక గోడ లేక రాయి అడ్డు వచ్చిన తరువాత మరలా కలుసుకున్నారంటే అప్పుడు కూడా సలామ్ చెప్పండి."[1]

## నిద్రలో ఉన్న వ్యక్తి వద్ద సలామ్ చెప్పే విధానం :

ఒక వ్యక్తి ఇతరుల ఇంట్లోకి లేక గదిలోకి పోతే అక్కడ కొందరు నిద్రలో

మరియు కొందరు మెలకువలో ఉంటే, మెలకువలో ఉన్నవారు మాత్రమే వినేటట్లు సలామ్ చెప్పాలి. నిద్రలో ఉన్నవారి నిద్రను చెడగొట్టకూడదు. ఎందుకంటే , హజ్రత్ మిగ్‌దాద్ బిన్ అస్వద్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) "రాత్రి సమయంలో వచ్చేవారు. అప్పుడు ఆయన సలామ్ చేస్తే మెలకువలో ఉన్నవారు మాత్రమే వింటారు. నిద్రలో ఉన్నవారిని నిద్ర నుండి లేపరు."[2]

## కరచాలనం (షేక్ హాండ్) :

ఇబ్ను ఉసైమీన్ (రహ్మ) ఇలా తెలియజేశారు: కొంతమంది సభలోకి పోతే, అక్కడ ఉన్న మొదటి వ్యక్తి నుండి చివరి వ్యక్తి వరకు చేతులు కలుపుకుంటూ పోయి కూర్చుంటారు. ఇలా చేయడం ఇస్లామీయ పద్ధతి కాదు. సున్నతు కూడా కాదు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా చేసేవారు కూడా కాదు. అలాగే సహాబాలు (రజియల్లాహు అన్హు) పద్ధతి కూడా అలా లేదు. సభలోకి ప్రవేశిస్తే సభ చివరన పోయి కూర్చుండేవారు. సభలలో లేచి నిలబడి ముసాఫాహ్ చేసినట్లు, హదీసు గ్రంథాలలో ఆధారాలు లేవు. ముసాఫాహ్ చేయడం అనేది ఇతరులను ఆహ్వానించుటకు మరియు కలుసుకొనుటకు మనం పాటించే పద్ధతి. ఇలాంటి పద్ధతి ధర్మపరంగా ఉత్తమమైనది.

## సలామ్ చెప్పడంలో కొన్ని నియమాలు

★ ఒక వ్యక్తి సభలో ఉన్నవారికి సలామ్ చేస్తే వారందరూ జవాబు చెప్తే శ్రేష్ఠమైనది. లేక ఒక్క వ్యక్తి జవాబు ఇస్తే కూడా వారిపై విధిగా ఉన్న జవాబు తొలిగిపోతుంది. హజ్రత్ అలీ బిన్ అబూతాలిబ్ (రజియల్లాహు అన్హు) కథనం: "సభలో ఉన్నవారు ఏ ఒక్కరైనా సలామ్ చేస్తే చాలు, మరియు వారిలో నుండి ఏ ఒక్కరైనా జవాబు ఇస్తే చాలు."[1]

★ పెద్దలు చిన్నపిల్లలకు సలామ్ చేస్తే అతను జవాబు ఇస్తే మేలైనది. ఒకవేళ జవాబు ఇవ్వకపోతే అతనిపై ఎలాంటి దోషము లేదు. ఎందుకంటే, అతనిపై ఇస్లాం నియమాలు ఇంకా విధి కాలేదు. అలాగే చిన్నపిల్లలు పెద్దలకు సలామ్ చేస్తే జవాబు విధిగా ఇవ్వాలి.

★ అవిశ్వాసులకు సలామ్ చెప్పకుండా ఇతర పదాలతో 'ఎలా ఉన్నావు? బాగున్నావా?' అని కూడా పలుకరించవచ్చు.

**షేఖుల్ ఇస్లాం ఇమామ్ ఇబ్నుతైమియా (రహ్మ) ఇలా అభిప్రాయపడ్డారు :** 'వారిని మంచి పదాలతో, సంతోషకర పదాలతో స్వాగతించవచ్చు.'

★ ఏ సభలోనైతే అవిశ్వాసులు మరియు విశ్వాసులు ఉంటారో, వారికి సలామ్ చెప్పవచ్చును. లేక **'అస్సలాము అలా మనిత్తబఅల్ హుదా'** అనే పదాలు వాడవచ్చును.

★ ఖుర్ఆన్ పారాయణం చేసేవారు ఇతరులకు సలామ్ చెప్పవచ్చును. సలామ్ చేసిన వారికి జవాబు కూడా చెప్పవచ్చును.

★ శుక్రవారం రోజు ఇమామ్ జుమా ఖుత్బా ప్రసంగిస్తుండగా సలామ్ చెప్ప కూడదు. ప్రసంగం వింటున్న వారు వారికి జవాబు కూడా ఇవ్వకూడదు. ఒకవేళ సలామ్ ఎవరైనా చేస్తే వారికి జవాబుగా చేత్తో సైగ చేయవచ్చును.[1]

1 *(సహీహ్ ఆదబుల్ ముఫ్రద్ : 451)*
2 *(సహీహ్ అబూదావూద్ : 5231, ముస్నద్ అహ్మద్ : 22025)*
3 *(సహీహ్ అదబుల్ ముఫ్రద్ : 409 – 1005 / 773)*
1 *(సహీహ్ బుఖారీ : 11, సహీహ్ ముస్లిం : 56)*
2 *(సహీహ్ బుఖారీ : 5764, సహీహ్ ముస్లిం : 4019)*
3 *(సహీహ్ బుఖారీ : 5763)*
4 *(సహీహ్ తిర్మిజీ : 2706)*
1 *(సహీహ్ ముస్లిం : 4032)*
2 *(సహీహ్ బుఖారీ : 93)*
3 *(సహీహ్ అబూదావూద్ : 925, సహీహ్ తిర్మిజీ : 367)*
1 *(సహీహ్ అబూదావూద్ : 5200)*
2 *(సహీహ్ ముస్లిం : 3831)*
1 *(సహీహ్ అబూదావూద్ : 5210)*
1 *(ఫతావా అల్ లజ్నతుత్ దాయిమా – మక్కతుల్ ముకర్రమా)*

# 7. ఇతరుల వద్దకు పోయే మరియు అనుమతి కోరే నియమాలు

**అనుమతి అంటే?** ఇతరుల ఆధీనంలో ఉన్న విషయాలతో ప్రయోజనం పొందుటకై కోరే విధానాన్ని 'అనుమతి ' అంటారు.

ఇతరుల ఇండ్లలోకి పోవాలంటే మరియు ప్రత్యేకమైన సభ సమావేశం లోకి పోవాలనుకుంటే వారితో అనుమతి కోరడం ఇస్లామీయ ధర్మవిధానం. సుగుణ వంతుల విధానం కూడా. ఇది వారి గొప్పతనానికి, వారి క్రమశిక్షణకు నిదర్శనం.

అనుమతి కోరడం వల్ల వారి పవిత్రత, చిత్తశుద్ధి తెలుస్తుంది. ఎందుకంటే, ఒక వ్యక్తి హఠాత్తుగా ఇతరుల వద్దకు పోతే వారి మా టలను, వారి రహస్యాలను భంగపరచినట్లు అవుతుంది. లేక వారు వివిధ సందర్భాలలో ఉండగా మనం వారి వద్దకు చేరితే, పరస్పరం సిగ్గుపడే అవకాశం ఉంటుంది. వినకూడదని భావించిన విషయాన్ని మనం విన్నట్లయితే లేక ఇతరులు చూడకూడదని భావించిన వాటిని మనం చూస్తే ఇరువైపులా బాధపడతారు.

ఇతరుల వద్దకు పోయినప్పుడు వారిని అనుమతి తీసుకునే ప్రవేశించాలి. అనుమతి ప్రాప్తమయితే వారి వద్దకు పోవచ్చును. అనుమతి ప్రాప్తముకాని స్థితిలో వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలి. ఇదే మనందరికి ఉత్తమమైన మరియు గౌరవమైన పద్ధతి.

## ఇతరుల వద్దకు పోయి సుఖసంతోషాలను తెలుసుకునే ఘనత

హ్రజత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(مَنْ عَادَ مَرِيضًا أَوْ زَارَ أَخًا لَهُ فِي اللَّهِ نَادَاهُ مُنَادٍ أَنْ طِبْتَ وَطَابَ مَمْشَاكَ وَتَبَوَّأْتَ مِنْ الْجَنَّةِ مَنْزِلًا).

"ఎవరైతే అల్లాహ్ ప్రేమను కాంక్షిస్తూ వ్యాధిగ్రస్తుడిని పరామర్శించుటకు పోతాడో, లేక తమ ధార్మిక సోదరుని (దీనీ భాయి) వద్దకు (పలుకరించుటకు) పోతాడో, కేక పెట్టేవాడు (దైవదూత) కేకపెట్టి అతనితో ఇలా అంటాడు: "నీవు ఉత్తముడివి, నీ నడక మేలైనది. స్వర్గంలో ఒక గృహాన్ని నివాసంగా పొందుతావు."[1]

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

ఒక వ్యక్తి తన సోదరుడు ఉన్న పల్లెకు (మంచీ చెడు తెలుసుకొనుటకు) పోయాడు. అతను ఆ దారిన పోయేటప్పుడు అతని వద్దకు అల్లాహ్ ఒక దూతను పంపాడు.

అతను : ఆ వ్యక్తితో, 'ఎక్కడికి పోతున్నావని' ప్రశ్నించాడు.

అతడు : 'ఈ పల్లెలో నా సోదరుడు ఉన్నాడు' అని అన్నాడు.

దైవదూత : 'అతనికి నీవు చెల్లించవలసిన రుణం ఏమైనా ఉందా? దానిని నీవు తీర్చడానికి పోతున్నావా?' అని అడిగారు.

అతను :'అలా ఏమీ లేదు, అల్లాహ్ కోసమే అతన్ని నేను ప్రేమిస్తున్నాను' అని అన్నాడు.

తరువాత దైవదూత: 'ఎలా నీవు అతన్ని ప్రేమిస్తున్నావో, అలాగే అల్లాహ్ కూడా నిన్ను ప్రేమిస్తున్నాడని చెప్పమని అల్లహ్ నీ వద్దకు నన్ను పంపాడు' అని తెలియజేశారు.[2]

## అనుమతి కోరాలనే ఆదేశం

ఇతరుల ఇండ్లలోకి పోవాలంటే ఇంటివారి నుండి అనుమతి పొందిన తరువాతనే వారి ఇండ్లలోకి పోవాలి. కనుక అల్లహ్ ఇలా ఆదేశించాడు.

(يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا لَا تَدْخُلُوا بُيُوتًا غَيْرَ بُيُوتِكُمْ حَتَّى تَسْتَأْنِسُوا وَتُسَلِّمُوا عَلَى أَهْلِهَا ذَلِكُمْ خَيْرٌ لَكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُونَ).

"విశ్వసించిన ప్రజలారా! మీ ఇండ్లలోకి తప్ప ఇతరుల ఇండ్లలోకి ప్రవేశించకండి, ఇంటి వారి అంగీకారం పొందనంత వరకు, ఇంటివారికి సలాం చేయనంత వరకు. ఈ పద్ధతి మీకు ఎంతో ఉత్తమమైనది. మీరు ఈ హితోపదేశం జ్ఞాపకం ఉంచుకుంటారని ఆశించబడుతోంది."[3]

## ఇండ్లలోకి అనుమతి లేకుండా చూడకూడదు

నివాస గృహాల పవిత్రతను, రహస్యాలను కాపాడుటకై అనుమతి కోరడం ఉత్తమమైన పద్ధతి.

హజ్రత్ సహల్ బిన్ సఅద్ (రజియల్లాహు అన్హు) కథనం, ఒక వ్యక్తి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇంటికెళ్ళి తలుపు కన్నంలో నుంచి తొంగి చూశాడు.

అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చేతిలో దువ్వెన ఉంది. ఆ దువ్వెనతో తలను గోక్కుంటున్నారు. అప్పుడు (ఆ వ్యక్తిని చూసి): "ఒకవేళ నీవు నన్ను ఇలా తొంగి చూస్తున్నావని తెలిసి ఉంటే ఈ దువ్వెనతోనే నీ కళ్ళలో గుచ్చేవాణ్ణి" అని అన్నారు.

ఆ తరువాత అతనితో : "ఇలా తొంగి చూడకూడదనే కదా అనుమతి కోరాలనే విధానం ఉండేది" అని అన్నారు.[4]

## అనుమతి కోరే విధానం

**(حَدَّثَنَا رَجُلٌ مَنْ بَنِي عَامِرٍ: أَنَّهُ اسْتَأْذَنَ عَلَى النَّبِيِّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ فِي بَيْتٍ فَقَالَ أَلِجُ فَقَالَ النَّبِيُّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ لِخَادِمِهِ اخْرُجْ إِلَى هَذَا فَعَلِّمْهُ الِاسْتِئْذَانَ فَقُلْ لَهُ قُلْ السَّلَامُ عَلَيْكُمْ أَأَدْخُلُ فَسَمِعَهُ الرَّجُلُ فَقَالَ السَّلَامُ عَلَيْكُمْ أَأَدْخُلُ فَأَذِنَ لَهُ النَّبِيُّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ فَدَخَلَ).**

బనూ ఆమిర్ జాతికి చెందిన ఒక వ్యక్తి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్దకు వచ్చి, "నేను ఇంట్లోకి దూరొచ్చా?" అని అనుమతి కోరాడు. అది విన్న ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) తన దాసుడిని ఇలా ఆదేశించారు: "నీవు పోయి అతనికి అనుమతి కోరే విధానం నేర్పమని" ఇలా తెలియజేశారు.

'అస్సలాము అలైకుం, నేను ప్రవేశించవచ్చునా?' అని చెప్పగా, ఆ వచ్చిన వ్యక్తి (ప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం తెలిపిన విధానం ప్రకారం).

"అస్సలాము అలైకుం, నేను రావచ్చునా" అని అనుమతి కోరాడు. అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (స) ఆ వ్యక్తికి అనుమతి ప్రసాదించారు. దాని తరువాత ఆ వ్యక్తి లోపలికి ప్రవేశించాడు.[5]

## అనుమతి కోరేవాడు ఇంటి వద్ద ఎక్కడ నిలబడాలి?

సఅద్ బిన్ ఉబాదా (రజియల్లాహు అన్హు) కథనం, ఒక వ్యక్తి వచ్చి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వారి తలుపు ముఖాముఖీగా నిలబడ్డాడు. తరువాత ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వచ్చి, “ఇలాగేనా (తలుపు ముందు) నిలబడేది? అనుమతి కోరే విధానం ఉండేదే (ఇంట్లోకి చూడకూడదని) చూపుల కోసం” అని అన్నారు.[6]

(كَانَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا أَتَى بَابَ قَوْمٍ لَمْ يَسْتَقْبِلْ الْبَابَ مِنْ تِلْقَاءِ وَجْهِهِ وَلَكِنْ مِنْ رُكْنِهِ الْأَيْمَنِ أَوْ الْأَيْسَرِ وَيَقُولُ السَّلَامُ عَلَيْكُمْ).

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ బుస్రిన్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇతరుల ఇంటి వద్దకు పోయినప్పుడు తలుపు ముందు నిలబడరు. కాని తలుపు కుడి వైపున లేక ఎడమ వైపున (ప్రక్కకు జరిగి) నిలబడేవారు. తరువాత **‘అస్సలాము అలైకుం’** అని చెప్పేవారు.[7]

## అనుమతి కోరేవారు తమ పేరు చెప్పాలి

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం, నా తండ్రి ఇతరులకు తీర్చవలసిన అప్పు గురించి (మాట్లాడుటకై) నేను ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇంటికి పోయి తలుపు తట్టాను. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) “ఎవరు అక్కడా?” అని ప్రశ్నించారు. నేను ‘నేనండీ!’ అని అన్నాను.

తరువాత ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహ్ అలైహి వ సల్లం) (పేరు చెప్పలేనందుకు చిరాకు చెందుతూ) నేను, నేనేనంటే? నచ్చలేనట్లుగా నాకు అన్పించింది.[8]

ఇమామ్ ఇబ్ను జౌజీ (రహ్మ) ఇలా వ్యాఖ్యానించారు : పేరు చెప్పకుండా ‘నేను’ అనే పదం వాడడం వలన అహంకారంగా భావించవచ్చు. నేను అంటే నా పేరు, లేక నా జాతి చెప్పవలసిన అవసరమేమున్నది.

నేను అంటే, నేనే కదా, అని అహంకారంగా తన పేరు చెప్పలేదన్న విషయం తెలుస్తుంది. అందువలన ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారికి అలా చెప్పడం నచ్చలేదు.

## మూడుసార్లు అనుమతి కోరాలి

హజ్రత్ అబూ మూసా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(اَلِاسْتِئْذَانُ ثَلَاثٌ فَإِنْ أُذِنَ لَكَ وَإِلَّا فَارْجِعْ). "మూడుసార్లు అనుమతి కోరినప్పటికీ మీకు అనుమతి ప్రాప్తం కాకపోతే తిరిగి వెళ్ళిపోండి."[9]

హజ్రత్ అబ్దుల్‌బర్ (రహ్మ) ఈ హదీసును ఇలా వివరించారు :

★ "మొదటిసారి అనుమతి కోరడం అనుమతిగా భావించబడింది.

★ రెండోసారి అనుమతి కోరడం అభిప్రాయంగా భావించబడింది.

★ మూడవసారి అనుమతి కోరడం తిరిగి వెళ్ళిపోవాలని అర్థం. మూడు సార్లకు మించి అనుమతి కోరకూడదు."

## సలామ్ చేసిన తరువాత అనుమతి కోరాలి

ఇమామ్ నవ్వీ (రహ్మ) ఇలా తెలియజేశారు: అనుమతి కోరాలని ఇస్లామీయ పండితులందరూ ఏకీభవించారు. ఖుర్ఆన్ మరియు సహీహ్ హదీసు గ్రంథాలలో స్పష్టంగా ఆదేశించడం జరిగింది.

మొదట సలామ్ చేసి తరువాత అనుమతి కోరడం సున్నతు ఆచారంగా భావించబడింది. అయిన కొందరు సలామ్ మొదట చెప్పాలా లేక అనుమతి కోరాలా అన్న విషయంలో భిన్న అభిప్రాయాలు తెలియజేశారు.

సున్నతు విధానం ప్రకారం, మూడు అభిప్రాయాలు ఉన్నాయి :

1. సలామ్ చేసి తరువాత అనుమతి కోరడం. ఇలాగే పై హదీసులో ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నేర్పినారు.
2. మొదట అనుమతి కోరి తరువాత సలామ్ చెప్పడం.
3. మనం ఇంటివారికి కళ్ళముందు చూస్తున్నట్లయితే మొదట సలామ్ చేసి తరువాత అనుమతి కోరాలి. పద్ధతి ప్రకారం ఇదే సున్నతు.

## అనుమతి చిహ్నం పెట్టవచ్చును

హ్రజత్ ఇబ్ను మస్‌వూద్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నాకు ఇలా తెలియజేశారు.

(إِذْنُكَ عَلَيَّ أَنْ يُرْفَعَ الْحِجَابُ وَأَنْ تَسْتَمِعَ سِوَادِي حَتَّى أَنْهَاكَ).

"(ఇంటి) పరదా లేపబడి ఉంటే అదే నా అనుమతి చిహ్నం, మరియు మా మాటలు మీరు వినకూడదనీ నివారించే వరకు వినవచ్చును.[10]

అంటే, అందరు సరదాగా కూర్చుని మాట్లాడుకుంటుంటే మనం కూడా వారితో కలసి సరదాగా ఉండవచ్చు. మాట్లాడవచ్చు. మాటలు వినవచ్చు. ఇక్కడ అనుమతి అవసరం లేదు. కాని ముఖ్యమైన సభ లేక సంభాషణ జరుగుతుంటే అప్పుడు అనుమతి పొందవలసిన అవసరం ఉంటుంది.

## ఇంట్లో ఉన్నవారికి సలామ్ :

అల్లాహ్ ఇలా తెలియజేశాడు.

(فَإِذَا دَخَلْتُمْ بُيُوتًا فَسَلِّمُوا عَلَى أَنْفُسِكُمْ تَحِيَّةً مِنْ عِنْدِ اللَّهِ مُبَارَكَةً طَيِّبَةً كَذَلِكَ يُبَيِّنُ اللَّهُ لَكُمُ الْآيَاتِ لَعَلَّكُمْ تَعْقِلُونَ).

"మీరు ఇండ్లలోకి ప్రవేశించినప్పుడు మీ ఇంటి వారికి సలాము చేయండి. ఇది మేలు కొరకు చేయబడే ప్రార్థన. అల్లాహ్ తరఫు నుండి నిర్ణయించ బడింది. ఎంతో శుభవంతమైనది, పరిశుద్ధమైనది. ఈ విధంగా అల్లాహ్ తన ఆయతులను మీకు ఉపదేశిస్తున్నాడు, మీరు ఆలోచించి అర్థం చేసుకొని వ్యవహరిస్తారని ఆశించబడుతోంది."[11]

హ్రజత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(قَالَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ لا تَدْخُلون الجَنَّةَ حَتَّى تُؤْمِنُوا وَلَا تُؤْمِنُوا حَتَّى تَحَابُّوا أَوَلَا أَدُلُّكُمْ عَلَى شَيْءٍ إِذَا فَعَلْتُمُوهُ تَحَابَبْتُمْ أَفْشُوا السَّلَامَ بَيْنَكُمْ).

"మీరు మూమిన్ కానంతవరకు స్వర్గంలో ప్రవేశించలేరు. పరస్పరం ప్రేమాభిమానాలతో మెలగనంత వరకు మోమిన్‌లు కాలేరు. మీరు పరస్పరం

ప్రేమాభిమానాలతో మసలుకునే ఓ ఉపాయం తెలుపమంటారా? మీ మధ్య 'సలామ్'ను విస్తృతం చేసుకోండి.[12]

## పిల్లలు యుక్త వయస్సుకు చేరితే అనుమతి కోరాలి :

అల్లాహ్ ఇలా తెలియజేశాడు. "మీ పిల్లలు యుక్త వయస్సుకు చేరుకున్నప్పుడు తమ పెద్దలు అనుమతి తీసుకునే విధంగానే వారు కూడా అనుమతి తీసుకుని మరీ రావాలి. ఇలా అల్లాహ్ తన వాక్యాలను మీ ముందు విశదం చేస్తున్నాడు. ఆయన జ్ఞాని మరియు వివేకి."[13]

హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం: "వారి సంతానంలో కొందరు యుక్త వయస్సుకు చేరితే అనుమతి లేకుండా ఆయన వద్దకు పోయేవారు కారు."[14]

హ్రజత్ ఇబ్ను మస్వూద్ (రజియల్లాహు అన్హు) ఇలా తెలియజేశారు. "మీ తల్లుల వద్దకు పోవాలంటే అనుమతి తీసుకోండి."[15]

హ్రజత్ అతా (రజియల్లాహు అన్హు) కథనం, నేను హ్రజత్ ఇబ్ను అబ్బాస్ (రజియల్లాహు అన్హు) గారితో:

'నా చెల్లెలి వద్దకు అనుమతి తీసుకుని వెళ్ళాలా?' అని అడిగాను.

దానికి ఆయన : 'అవును, అని అన్నారు.

'వారు నా గదిలోనే ఉన్నప్పటికీ అనుమతి తీసుకోవాలా?' అని అడిగారు. దానికి ఆయన: 'వారిని నగ్నంగా నీవు చూడుటకు ఇష్టపడతావా?' అని ప్రశ్నించారు.[16]

హ్రజత్ ముస్లిం బిన్ నజీర్ (రజియల్లాహు అన్హు) గారితో ఒక వ్యక్తి, "నా తల్లి వద్దకు పోవాలంటే అనుమతి కోరాలా?" అని ప్రశ్నించాడు. అబ్బాస్ (రజి): ఒకవేళ నీవు అనుమతి తీసుకోక అలాగే పోతే, నీవు అయిష్టంగా భావించే విషయాన్ని చూస్తావు" అని అన్నారు.[17]

## తలుపు తట్టే విధానం :

హ్రజత్ అనస్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త

ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) "ఇంటి తలుపులను (చేతి వ్రేళ్ళ) గోర్లతో తట్టేవారు."[18]

కొంతమంది ప్రజలు తలుపును తమ చేతి హస్తములతో ధబా, ధబామని బాదుతూ నిలబడుతారు. అలా తలుపును తట్టడం ధర్మపద్ధతి కాదు.

## పరస్పరం కలుసుకున్నప్పుడు వంగడం లేక ముద్దు పెట్టడం నిషిద్ధం

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) కథనం: ఒక వ్యక్తి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారిని :

ఓ ప్రవక్తా! మేము మా సోదరునితో లేక స్నేహితునితో వంగి అభిమానించు కోవడం ధర్మమేనా? అని ప్రశ్నించాడు?

ఆయన : కాదు, అని సమాధానమిచ్చారు.

తరువాత అతను : "పరస్పరం ఆలింగనము చేసుకొని ముద్దు పెట్టుకోవడం ధర్మమేనా?" అని ప్రశ్నించాడు

ఆయన: కాదు, అని అన్నారు.

తరువాత అతను : "ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారి చెయ్యి పట్టుకుని చెయ్యి కలపవచ్చునా?" అని అడిగాడు.

అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం): అవును, అని సమాధానమిచ్చారు.[19]

---

1. (సహీహ్ తిర్మిజీ : 2008)
2. (సహీహ్ ముస్లిం : 4656)
3. (24, సూరతున్ నూర్ : 27)
4. (సహీహ్ బుఖారీ : 5772, సహీహ్ ముస్లిం : 4013)
5. (సహీహ్ అబూదావూద్ : 5177)
6. (సహీహ్ అబూదావూద్ : 5174)
7. (సహీహ్ అబూదావూద్ : 5186)

8. (సహీహ్ బుఖారీ : 5781, సహీహ్ ముస్లిం : 4012)
9. (సహీహ్ ముస్లిం : 4007)
10. (సహీహ్ ముస్లిం : 4033)
11. (24, సూరతున్ నూర్ : 61)
12. (సహీహ్ ముస్లిం : 81)
13. (24, సూరతున్ నూర్ : 59)
14. (బుఖారీ అదబుల్ ముఫ్రద్)
15. (ముసన్నఫ్ అబీ షైబా : 3/454, అస్సుననుల్ కుబ్రా లిల్ బైహఖీ : 7/97)
16. (బుఖారీ అదబుల్ ముఫ్రద్ : 1063)
17. (బుఖారీ అదబుల్ ముఫ్రద్ : 1060)
18. (బుఖారీ అదబుల్ ముఫ్రద్, షోబిల్ ఈమాన్)
19. (సహీహ్ తిర్మిజీ, సహ్హాహు అల్బాని : 2728)



# 8. సభ, సమావేశం మర్యాదలు

## ఇతరులు కూర్చున్న చోటు నుండి లేపకూడదు

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(لَا يُقِيمُ الرَّجُلُ الرَّجُلَ مِنْ مَجْلِسِهِ ثُمَّ يَجْلِسُ فِيهِ). "మీలో ఏ వ్యక్తి కూడా మరో వ్యక్తి కూర్చున్న చోటు నుండి లేపి వారి చోటులో కూర్చోకూడదు."[1]

హజ్రత్ జాబిర్ బిన్ సముర (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సభలోకి మేము ప్రవేశిస్తే, సభ చివరిలో పోయి కూర్చుంటాము. (అంటే ఎక్కడ చోటు ఖాళీ ఉంటే అక్కడ కూర్చునేవారు.)[2]

## తమ ముందు ప్రజలు గౌరవిస్తూ నిలబడాలని కోరకూడదు

హజ్రత్ ముఆవియా (రజియల్లాహు అన్హు), హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజియల్లాహు అన్హు) ఇబ్ను ఆమిర్ వద్దకు పోయారు.

అప్పుడు ఇబ్ను ఆమిర్ లేచి నిలబడ్డారు. కాని అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ లేచి నిలబడలేదు. తరువాత ముఆవియా (రజియల్లాహు అన్హు) ఇబ్ను ఆమిర్ గారిని కూర్చోమన్నారు.

తరువాత అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి) : "ఎవరైతే గౌరవానికై తమ ముందు ప్రజలు నిలబడాలని ఇష్టపడతారో, వారు నరకాగ్నిని తమ నివాసంగా చేర్చుకోవలసిందే" అని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవచించగా నేను విన్నాను అని తెలియజేశారు.[3]

## సభలో సర్దుకొని ఇతరులకు చోటు కల్పించాలి

అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا إِذَا قِيلَ لَكُمْ تَفَسَّحُوا فِي الْمَجَالِسِ فَافْسَحُوا يَفْسَحِ اللَّهُ لَكُمْ).

"విశ్వసించిన ఓ ప్రజలారా! మీ సమావేశాలలో (వచ్చేవారికి) చోటు కల్పిం

చండని మీతో అన్నప్పుడు మీరు జరిగి చోటు కల్పించండి. అల్లాహ్ మీకు విశాలమైన చోటును ప్రసాదిస్తాడు."[4]

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు.

(أَنَّهُ نَهَى أَنْ يُقَامَ الرَّجُلُ مِنْ مَجْلِسِهِ وَيَجْلِس فِيهِ آخَرُ وَلَكِنْ تَفَسَّحُوا). ''మీలో ఎవరూ (సభలో) ఇతరుల్ని లేపి వారి చోటులో కూర్చోకూడదు. కాని జరిగి సర్దు బాటు చేసుకుని చోటు ఇవ్వాలి."[5]

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(مَنْ قَامَ مِنْ مَجْلِسِهِ ثُمَّ رَجَعَ إِلَيْهِ فَهُوَ أَحَقُّ بِهِ). "మీలో ఎవరైనా కూర్చున్న చోటు నుండి లేచిపోయి తరువాత తిరిగి వస్తే, అక్కడ మళ్ళీ కూర్చునే హక్కు అతనికే ఉంది."[6]

అంటే, ఒక వ్యక్తి ఇతర అవసరాలకై పోయి తిరిగి వచ్చే వరకు అతని చోటును ఇతరులు ఆక్రమించి చోటునివ్వకుండా చేయడం ధర్మసమ్మతము కాదు.

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఇద్దరు వ్యక్తుల మధ్య అనుమతి లేకుండా దూరి కూర్చోవడం ధర్మ సమ్మతం కాదు.[7]

## అతిథులను సత్కరించాలి

హజ్రత్ అబూ షురైహ్ అల్‌కాబీ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(لَا يَحِلُّ لِرَجُلٍ أَنْ يُفَرِّقَ بَيْنَ اثْنَيْنِ إِلَّا بِإِذْنِهِمَا)

(الضِّيَافَةُ ثَلَاثَةُ أَيَّامٍ جَائِزَتُهُ قِيلَ مَا جَائِزَتُهُ قَالَ يَوْمٌ وَلَيْلَةٌ وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللَّهِ وَالْيَوْمِ الْآخِرِ فَلْيُكْرِمْ ضَيْفَهُ وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللَّهِ وَالْيَوْمِ الْآخِرِ فَلْيَقُلْ خَيْرًا أَوْ لِيَسْكُتْ).

"ఎవరయితే అల్లాహ్‌ను, పరలోక దినాన్ని విశ్వసిస్తారో, వారు తమ అతిథిని ఆదరించాలి. మొదటి రోజున బ్రహ్మాండమైన విందునిచ్చి సత్కరించాల్సిన రోజు (ఆ రోజు ప్రత్యేకంగా తమ శక్తి మేరకు స్వాదిష్టమైన భోజన పానీయాలను సిద్ధపర్చాలి). ఆతిథ్యం మూడు రోజుల వరకు (ధర్మ సమ్మతంగా) ఉంది. ఆ తరువాత అతిథికి చేసే సేవలు 'సదఖా'గా పరిగణించబడతాయి. ఇంటివారిని కష్టపెట్టే వరకు బస చేయడం అతిథికీ ధర్మసమ్మతం కాదు."[8]

## పోట్లాటకు దూరం ఉండాలి

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఎవరయితే అల్లాహ్‌ను, పరలోక దినాన్నీ విశ్వసిస్తారో, వారు మంచినే పలకండి. లేకుంటే నిశ్శబ్దంగా ఉండండి."[9]

హజ్రత్ అబూ ఉమామా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "తమ పక్షంలో పోట్లాడే హక్కు ఉన్నప్పటికీ, అతను పోట్లాడకుండా వదిలేస్తాడో, అతని కొరకు స్వర్గంలో ఒక ప్రక్కన ఇల్లు సొంతమవుతుంది. దాని కోసం నేను పూచీ వహిస్తాను."[10]

## మాటకారితనంలో సంభాషించడం

హజ్రత్ జాబిర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ప్రళయ దినాన నాకు అత్యంత చేరువలో ఉంటూ నాకు అత్యంత ప్రీతి పాత్రులయినవారు మీలో నైతికత రీత్యా ఉత్తములయినవారు మరియు నాకు అతి దూరంగా ఉండేవారు అత్యధిక అప్రియులయినవారు, మీలో నైతికంగా హీనమయినవారు. వీరు తమ మాటలతో మాయజేసేవారు. నోరు వంకరజేసి (మెడ త్రిప్పుతూ) మాట్లాడేవారు, అహంకారంతో మాట్లాడేవారు."[11]

## చిరునవ్వుతో కలవడం

హజ్రత్ అబూ జర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(لَا تَحْقِرَنَّ مِنَ الْمَعْرُوفِ شَيْئًا وَلَوْ أَنْ تَلْقَى أَخَاكَ بِوَجْهٍ طَلْقٍ). "మంచి పనిని ఏమాత్రం హీనంగా భావించకు నీ సోదరుడిని చిరునవ్వుతో కలుసుకోవడం కూడా పుణ్యకార్యమైనదే."[12]

## పుణ్యాత్ములతో సహవాసం

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా ప్రవచించారు:

(الرَّجُلُ عَلَى دِينِ خَلِيلِهِ فَلْيَنْظُرْ أَحَدُكُمْ مَنْ يُخَالِلُ). "మనిషి తన మిత్రుని ధర్మాన్ని (జీవిత విధానాలను) అనుసరిస్తాడు. మీరు ఎలాంటి వారితో స్నేహబంధం చేస్తు న్నారో, ముందుగానే ఆలోచించి స్నేహం చేయండి."[13]

హజ్రత్ అబూ సయీద్ అల్ ఖుద్రీ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా నేను ఇలా విన్నాను. (لَا تُصَاحِبْ إِلَّا مُؤْمِنًا وَلَا يَأْكُلْ طَعَامَكَ إِلَّا تَقِيٌّ). "కేవలం విశ్వాసితో స్నేహబంధం చెయ్యండి. మరియు కేవలం ధర్మ నిష్ఠగల వారే మీ భోజనాలు తినాలి."[14]

## ముగ్గురిలో ఒకరిని వదలి పరస్పరం రహస్యంగా మాట్లాడు కోకూడదు

హజ్రత్ ఇబ్ను మస్ఊద్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ముగ్గురు వ్యక్తులు ఉండగా ఒక వ్యక్తిని వదిలి మిగతా ఇద్దరు వ్యక్తులు రహస్యంగా మాట్లాడుకోకూడదు. అలా చేయడం వల్ల ఆ వ్యక్తికి బాధ కలుగుతుంది. (లేదా ఆ సభలో) ఇంకా కొంతమంది మీతో కలుసుకోనంత వరకు (రహస్యంగా మాట్లాడుకోకూడదు)."[15]

అలాగే ముగ్గురిలో ఇద్దరికి ఒక భాష వచ్చి మరొకరికి ఆ భాష రాదనుకుంటే ఆ ఇద్దరు ఒకే భాషలో మాట్లాడకూడదు. ముగ్గురికి అర్థమయ్యే భాషలోనే మాట్లా డాలి. లేక అధికమైన మనుషులు ఉండి అనేకమైన భాషలు వాడుతుంటే తప్ప.

## సభలో జిక్ర్(ధ్యాన) ప్రాముఖ్యత

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఏ సమూహం వారయినా ఒక సభలో కూర్చొని అల్లాహ్ నామస్మరణ చేసినచో, దైవదూతలు వారి చుట్టూ ఉంటారు, ఆయన కారుణ్యం వారిని కప్పివేస్తుంది, వారిపై ప్రశాంతత అవతరిస్తుంది. మరియు అల్లాహ్ వారి (దైవదూతల) మధ్య వారిని ప్రశంసిస్తాడు."[16]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఏదైనా సమూహం ఒక సభలో కూర్చుని ముహమ్మద్ (స)పై 'దరూద్ దుఆ' చదవనిచో, అలాంటి వారు (ప్రళయం రోజు) పశ్చాత్తాపం చెందుతారు.'[17]

## సభ నుండి పోయేటప్పుడు అనుమతి కోరాలి :

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِذَا زَارَ أَحَدُكُمْ أَخَاهُ فَجَلَسَ عِنْدَهُ فَلَا يَقُومَنَّ حَتَّى يَسْتَأْذِنَهُ)

"మీలో ఎవరైనా ఒక సోదరుని వద్దకు పోయి అక్కడ కూర్చొన్న తరువాత తిరిగి లేచి పోవాలంటే అనుమతి తీసుకుని పోవాలి."[18]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(قَالَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا انْتَهَى أَحَدُكُمْ إِلَى الْمَجْلِسِ فَلْيُسَلِّمْ فَإِذَا أَرَادَ أَنْ يَقُومَ فَلْيُسَلِّمْ فَلَيْسَتْ الْأُولَى بِأَحَقَّ مِنْ الْآخِرَةِ).

"మీరు సభలోకి చేరుకుంటే సలామ్ చెప్పండి, మరియు సభ నుండి లేచి తిరిగి పోయేటప్పుడు కూడా సలామ్ చెప్పండి, రెండు సమయాల సలామ్ చెప్పడం (పుణ్యపరంగా) సమానమైనది."[19]

## సభ నుండి తిరిగిపోవాలంటే దుఆ

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సభ నుండి లేచి పోవాలంటే ఇలా చదివేవారు:

**سُبْحَانَكَ اللَّهُمَّ وَبِحَمْدِكَ أَشْهَدُ أَنْ لَا إِلَهَ إِلَّا أَنْتَ أَسْتَغْفِرُكَ وَأَتُوبُ إِلَيْكَ "సుబ్హానకల్లాహుమ్మ వబిహందిక అష్హదు అల్లా ఇలాహ ఇల్లా అన్‌త, అస్‌తగ్‌ఫిరుక వఅతూబు ఇలైక"** అని చదివినచో ఆ సభలో జరిగిన పొరపాట్లు క్షమించబడతాయి."[20]

---

1. (సహీహ్ బుఖారీ : 5798, సహీహ్ ముస్లిం : 4043)
2. (సహీహ్ అబూదావూద్ : 4825)
3. (సహీహ్ అబూదావూద్ : 5229)
4. (58, సూరతుల్ ముజాదలహ్ : 11)
5. (సహీహ్ బుఖారీ 5799 : సహీహ్ ముస్లిం : 4044)
6. (సహీహ్ ముస్లిం : 4047)
7. (సహీహ్ అబూదావూద్ : 4845)
8. (సహీహ్ బుఖారీ : 5995, సహీహ్ ముస్లిం : 3256)
9. (సహీహ్ బుఖారీ : 2482, సహీహ్ ముస్లిం : 67)
10. (సహీహ్ అబూదావూద్ : 4800)
11. (సహీహ్ తిర్మిజీ : 2018)
12. (సహీహ్ ముస్లిం : 4760)
13. (సహీహ్ తిర్మిజీ : 2378, సహీహ్ అబూదావూద్, 4833, ముస్నద్ అహ్మద్ : 7685)
14. (అబూదావూద్ , హసన్: 4832)
15. (సహీహ్ బుఖారీ : 5816, సహీహ్ ముస్లిం : 4053)
16. (సహీహ్ ముస్లిం : 4868)
17. (సహీహ్ తిర్మిజీ : 3380)
18. (సహీహ్ అల్ జామే : 584; ఫైజుల్ ఖదీర్ లిల్ మనావి : 655, వద్ దైలమి : 1/304-1200)
19. (సహీహ్ అబూదావూద్: 5208, సహీహ్ తిర్మిజీ : 2706)
20. (సహీహ్ తిర్మిజీ : 3433)

# 9. ఆవలింతలు మరియు తుమ్ములు

ఇస్లామీయ షరీఅత్ ప్రకారం అనేక ఆచారాల మరియు వ్యవహారాల గురించి వివిధమైన నియమాలు, నిబంధనలు నేర్పడం జరిగింది.

మనిషి వ్యవహరించే కొన్ని పద్ధతులను చెడ్డవిగా భావించి వాటిని సరిదిద్దడం జరిగింది. మంచి పద్ధతులను సమర్ధించడం కూడా జరిగింది. అందువలన ఇక్కడ మనము ఆవలింతల మరియు తుమ్ముల వాస్తవాన్ని తెలుసుకుంటూ, వాటి పట్ల పాటించవలసిన జాగ్రత్తలను కూడా తెలుసుకుందాము.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా సెలవిచ్చారు: “నిశ్చయంగా అల్లాహ్ తుమ్ములను ఇష్టపడతాడు. కాని ఆవలింతలు అల్లాహ్‌కు అయిష్టమైనవి.”[1]

ఇమామ్ ఖుర్తుబీ (రహ్మ) ఇలా తెలియజేశారు:

★ “ఆవలింతలు వచ్చే సమయంలో మేము వాటిని (ప్రభావాన్ని) తగ్గించుకోకపోతే షైతాన్ నవ్వుతాడు, నోటిలోకి పోతాడు.”

★ మరి కొందరు ఇలా అన్నారు: ‘షైతాన్ వారి నోటిలో కక్కుతాడు.’

హజ్రత్ అబూ సయీద్ అల్ ఖుద్రీ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِذَا تَثَاوَبَ أَحَدُكُمْ فِي الصَّلَاةِ فَلْيَكْظِمْ مَا اسْتَطَاعَ فَإِنَّ الشَّيْطَانَ يَدْخُلُ)

“మీలో ఎవరికయినా నమాజులో ఉండగా ఆవలింతలు వస్తే వాటిని తమ శక్తికొలది ఆపే ప్రయత్నం చేయండి, ఎందుకంటే షైతాన్ (మీ నోటిలో) దూరుతాడు.”[2]

ఇబ్నుల్ అరబి (రహ్మ) ఇలా తెలియజేశారు:

“హా హా అని నోరు పెద్దగా తెరచి ఆవలింతలు చేయడం మంచిది కాదు. నమాజులో ఉండగా మరింత జాగ్రత్తగా ఉండాలి.”

## ఆవలింతలు ఎందుకు వస్తాయి

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఆవలింతలు షైతాన్ వలన వస్తాయి."[3]

ఫజ్లుల్లాహ్ జీలానీ (రహ్మ) ఇలా తెలియజేశారు: "మనిషికి వళ్ళు బరువైతే మరియు కడుపు నిండా తిని, మత్తుగా ఉంటే ఆవలింతలు వస్తాయి. ఎందుకంటే , మనిషి తన మనోవాంఛల ప్రకారం నడుచుకుని, హద్దుమీరి తినిన తరువాత షైతాన్ ఎలా తిప్పుతాడో అలా అతను తిరుగుటకు ప్రయత్నిస్తాడు."

## ఆవలింతలను చెడ్డవిగా భావించుటకు కారణాలు

1. ఆవలింతలు షైతాన్ వలన వస్తాయి.
2. ఆవలింతలు అల్లాహ్‌కు అయిష్టమైనవి.
3. ఆవలింతల కారణంగా షైతాన్ నవ్వుతాడు.
4. ఆవలింతలు వస్తే సోమరితనానికి చిహ్నంగా భావించాలి.

ఆవలింతల కారణంగా షైతాన్ సంతోషిస్తాడు. ఎందుకంటే, ఒక దైవదాసుడు సోమరితనం వలన దైవదాస్యాన్ని పాటించడంలో అశ్రద్ధ వహిస్తాడు, ఆరాధనలకు దూరమవుతాడు.

## ఆవలింతలు వస్తే ఆపే పద్ధతి

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"మీలో ఎవరికైనా ఆవలింతలు వస్తే వాటిని తమ శక్తికొలది ఆపే ప్రయత్నం చేయండి."[4]

హజ్రత్ ఇబ్ను ఉసైమిన్ (రహ్మ) ఇలా తెలియజేశారు:

"ఆవలింతలను ఆపాలంటే క్రింది పెదవిని అదిమేటట్టు చెయ్యండి. నోరు పెద్దగా తెరుచుకోకుండా చెయ్యండి. లేక మీకు తోచిన విధంగా ఆవలింతలను ఆపే

ప్రయత్నం చెయ్యండి. ఆపలేని స్థితిలో నోరు తెరుచుకున్నప్పుడు నోటిపై హస్తమును అడ్డుగా పెట్టండి.”

## ముఖ్యగమనిక :

కొంతమంది ప్రజలు ఆవలింతలు వస్తే నోటిని పూర్తిగా తెరచి చిటికలు వేస్తారు. కొంతమంది **‘అస్తగ్ ఫిరుల్లాహ్’** అంటుంటారు. కాని ఈ రెండు ఆచారాలకు ధర్మపరమైన ఎలాంటి ఆధారాలు లేవు. కనుక ధర్మంగా ఉన్న పద్ధతిని పాటించి పుణ్యాలను మీ సొంతం చేసుకోండి.

---

*1.* (సహీహ్ బుఖారీ : 5755)

*2.* (సహీహ్ ముస్లిం : 5313)

*3.* (సహీహ్ బుఖారీ : 5755, సహీహ్ ముస్లిం : 5310)

*4.* (సహీహ్ ముస్లిం : 5313)



# 10. తుమ్ములు

ప్రతి మనిషికి తుమ్ములు వస్తాయి, పుట్టిన బిడ్డలకు సయితం తుమ్ములు వస్తాయి. తుమ్ముల కారణంగా మనిషి తల భారం కూడా తగ్గుతుంది. శరీరంలో నూతన ఉత్తేజం కూడా కనిపిస్తుంది. కొందరైతే అదే పనిగా ముక్కుపొడికి అలవాటు పడి తుమ్ముతుంటారు. ఒకవేళ తుమ్ములు రాకపోతే ముక్కులో గుడ్డపేలిక దూర్చి మరీ తుమ్ముతుంటారు. కొంతమందికి జలుబు చేస్తే తుమ్ములు వస్తాయి. కొంత మంది ప్రజలకు అలర్జి కారణంగా కూడా తుమ్ములు వస్తుంటాయి.

మన సమాజంలో కొంతమంది ప్రజలు తుమ్ముల విషయంలో మూఢ నమ్మ కాలకు మూఢ విశ్వాసాలకు గురికాబడి లేనిపోని అపోహలు పెంచుకున్నారు. ఎవరైనా బయటకు బయలుదేరేటప్పుడు ఇతరులు తుమ్మితే లేక స్వయంగా అతనే తుమ్మితే అపశకునంగా భావించి ఇంట్లోకి తిరిగి వచ్చి కొద్ది సేపు కూర్చుని తరువాత బయలుదేరుతారు. కొంతమంది ప్రజలు ఇంటి గుమ్మమున నిలబడి తుమ్మితే ఇంటి గుమ్మంపై నీళ్ళు చల్లుతారు. ఇలా అనేక విధమైన నమ్మకాలు కొంతమంది ప్రజలలో విస్తరించి ఉన్నాయి.

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"తుమ్మిన తరువాత **'అల్ హమ్దులిల్లాహ్'** అని చెప్పితే, దానిని విన్న ప్రతి ముస్లిం తుమ్మినవాడికి జవాబు ఇవ్వాలి."[1]

హజ్రత్ ఇమామ్ ఖుర్తుబీ (రహ్మ) గారు ఇలా వ్యాఖ్యానించారు:

ఈ హదీసు ద్వారా తుమ్మిన వ్యక్తి అతని ముందున్నవారు వినేటట్లు (అల్ హమ్దులిల్లాహ్) పదాలను చెప్పాలి. ఎందుకంటే, ఆ పదాలను విన్నవారు విధిగా జవాబు ఇవ్వాలి.

హజ్రత్ ఇబ్ను ఉసైమీన్ (రహ్మ) ఇలా తెలియజేశారు: తుమ్మిన వ్యక్తి చెప్పే పదాలను (అల్ హమ్దులిల్లాహ్) ఇతరులు వినేటట్లు చెప్పాలి.

## తుమ్ము ఘనత

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్

(సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِنَّ اللَّهَ يُحِبُّ الْعُطَاسَ وَيَكْرَهُ التَّثَاؤُبَ فَإِذَا عَطَسَ فَحَمِدَ اللَّهَ فَحَقٌّ عَلَى كُلِّ مُسْلِمٍ سَمِعَهُ أَنْ يُشَمِّتَهُ وَأَمَّا التَّثَاؤُبُ فَإِنَّمَا هُوَ مِنْ الشَّيْطَانِ).

"అల్లాహ్ తుమ్ములను ఇష్టపడతాడు. ఆవలింతను అయిష్టపడుతాడు. మీరు తుమ్మినప్పుడు **'అల్ హమ్దులిల్లాహ్'** అనాలి. దానిని విన్న ప్రతి ముస్లిం తుమ్మిన వారికి జవాబు ఇవ్వాలి."[2]

హజ్రత్ ఇబ్ను ఉసైమిన్ (రహ్మ) ఇలా తెలియజేశారు: అల్లాహ్ తుమ్ములను ఎందుకు ఇష్టపడతాడంటే, తుమ్మిన వ్యక్తి బాగా హుషారుగా ఉంటాడు. అల్లాహ్ హుషారుగా ఉన్న వ్యక్తిని ఇష్టపడతాడు. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(الْمُؤْمِنُ الْقَوِيُّ خَيْرٌ وَأَحَبُّ إِلَى اللَّهِ مِنْ الْمُؤْمِنِ الضَّعِيفِ وَفِي كُلٍّ خَيْرٌ..) "శక్తిమంతుడైన విశ్వాసి బలహీనుడైన విశ్వాసి కంటే మేలైనవాడు మరియు అల్లాహ్‌కు ఎంత గానో ఇష్టమైనవాడు. ప్రతి ఒక్కరిలోను మేలు ఉన్నది..."[3]

ఒక వ్యక్తికి తుమ్ములు వచ్చాయంటే అతను ఎంతగానో చురుకుగా హుషారుగా ఉన్నాడని అర్థం. అందుకనే తుమ్ములంటే అల్లాహ్‌కు ఇష్టమైనవి. తుమ్మిన వ్యక్తి **'అల్ హమ్దులిల్లాహ్'** అని అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపవలెను. అల్లాహ్‌కు కృతజ్ఞతలు చెల్లించేవాళ్ళే ప్రియమైన దాసులు.

## తుమ్మినప్పుడు పలికే పదాలు

1. మీరు తుమ్మిన తరువాత **(اَلْحَمْدُ لِلّٰهِ)** **'అల్ హమ్దులిల్లాహ్'** అని అనండి.[4]
2. మీరు తుమ్మిన తరువాత **(الْحَمْدُ لِلَّهِ عَلَى كُلِّ حَالٍ)** **'అల్ హమ్దులిల్లాహి అలా కుల్లి హాలిన్'** అని పలకండి.[5]
3. మీరు తుమ్మిన తరువాత **(الْحَمْدُ لِلَّهِ رَبِّ الْعَالَمِينَ)** **'అల్ హమ్దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్'** అని పలకండి.[6]
4. హజ్రత్ రిఫాఅ బిన్ రాఫె (రజియల్లాహు అన్హు) కథనం, ఒకరోజు నేను

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వెనుక నమాజు చేశాను. అప్పుడు నాకు తుమ్ము వచ్చింది. నేను ఇలా :

**(اَلْحَمْدُ لِلّٰهِ حَمْدًا كَثِيْرًا طَيِّبًا مُبَارَكًا فِيْهِ مَبَارَكًا عَلَيْهِ كَمَا يُحِبُّ رَبُّنَا وَيَرْضَى)**

**"అల్ హమ్దులిల్లాహి హమ్దన్ కసీరన్ తయ్యిబన్ ముబారకన్ ఫీహ్, ముబా రకన్ అలైహి కమా యుహిబ్బు రబ్బునా వ యర్దా"** అని అన్నాను.[7]

## తుమ్మేటప్పుడు మెల్లగా తుమ్మాలి

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) తుమ్మేటప్పుడు తమ చేతిని లేక చేతి గుడ్డను తమ ముఖంపై అడ్డుపెట్టుకుని శబ్దం చిన్నగా వచ్చేటట్లు తుమ్మేవారు.[8]

## నమాజు చేస్తుండగా తుమ్మినప్పుడు ఏం చేయాలి?

నమాజు చేస్తుండగా తుమ్మినప్పుడు **'అల్ హమ్దులిల్లాహ్'** అని ఇతరులు వినేటట్లుగా చెప్పవచ్చును. ఈ విషయాన్ని ధర్మపండితులు ఏకీభవించారు. వారిలో సహాబీయులందరూ, తాబయీన్‌లు మరియు ఇమామ్ అహ్మద్ బిన్ హమ్బల్, ఇమామ్ నవ్వీ, ఇమామ్ ఇబ్ను తైమియా మరియు ఇబ్ను ఉసైమీన్ (రహ్మతుల్లాహి అలైహి అజ్మఈన్) ఇంకా 'లజ్నతుద్ దాయిమా' అనే (ఫత్వాలు జారీచేసే మహత్తరమైన మహా కూటమి, సౌదియా అరేబియా) అభిప్రాయం కూడా ఇదే.

హజ్రత్ రిఫాఅ బిన్ రాఫె (రజియల్లాహు అన్హు) కథనం, ఒక రోజు నేను ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వెనుక నమాజు చేశాను. అప్పుడు నాకు తుమ్ము వచ్చింది. ఆ తరువాత నేను :

(اَلْحَمْدُ لِلّٰهِ حَمْدًا كَثِيْرًا طَيِّبًا مُبَارَكًا فِيْهِ مُبَارَكًا عَلَيْهِ كَمَا يُحِبُّ رَبُّنَا وَيَرْضَى).

**"అల్ హమ్దులిల్లాహి హమ్దన్ కసీరన్ తయ్యిబన్ ముబారకన్ ఫీహ్, ముబారకన్ అలైహి కమా యుహిబ్బు రబ్బునా వ యర్దా"** అని చదివాను.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నమాజు ముగించిన తరువాత ప్రజల వైపు తిరిగి ఇలా అన్నారు:

**(قَالَ رَأَيْتُ بِضْعَةً وَثَلَاثِينَ مَلَكًا يَبْتَدِرُونَهَا أَيُّهُمْ يَكْتُبُهَا أَوَّلُ)** "ముప్ఫయి దైవదూతల కంటే ఎక్కువగా ముందు (ఆ పదాల పుణ్యాలను) నేను రాస్తాననీ పోటీ పడుతుండగా చూశాను."[9]

కొందరు హజ్రత్ ఇమామ్ ఇబ్ను ఉసైమిన్ (రహ్మ) గారిని నమాజు చేస్తుండగా తుమ్మినట్లయితే (అల్ హమ్దులిల్లాహి) చెప్పవచ్చునా అని ప్రశ్నించారు? అప్పుడు ఆయన 'అవును' చెప్పవచ్చుననీ సమాధానమిచ్చారు.

తరువాత ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) హదీసు ఆధారంగా ఇలా ప్రస్తావించారు. హజ్రత్ ముఆవియా బిన్ హకమ్ (రజియల్లాహు అన్హు) మరియు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నమాజుకై నిలబడ్డారు. అప్పుడు ఒక వ్యక్తి తుమ్మినాడు. అతను **'అల్ హమ్దులిల్లాహ్'** అని చెప్పాడు...."[10]

## తుమ్మినవాడు అల్‌హమ్దులిల్లాహ్ అంటే విధిగా దానికి జవాబు పలకాలి

హజ్రత్ ఇబ్ను దఖీఖ్ అల్ ఈద్, నాసిరుద్దీన్ అల్బాని, ఇబ్ను ఉసైమిన్ (రహ్మ) మరియు ధర్మ గురువులందరి అభిప్రాయం:

"తుమ్మినవారు **'అల్ హమ్దులిల్లాహ్'** అని చెప్పితే, దానిని విన్నవారు విధిగా (**యర్‌హముకల్లాహ్**) అని బదులు చెప్పాలి."

హదీసులలో ఏ పదాలైతే ప్రచురించబడి ఉన్నాయో తుమ్మినప్పుడు ఆ పదాలనే చదవాలి. తమ ఇష్టానుసారంగా ఇతర పదాలు కలిపి వేరే దుఆలు చదవకూడదు.

## ఒక వ్యక్తి మూడు మార్లకంటే ఎక్కువగా తుమ్మినప్పుడు ఎలా బదులివ్వాలి

మూడు మార్లకంటే ఎక్కువగా ఒక వ్యక్తి తుమ్ముతున్నట్లయితే ఆ వ్యక్తికి మూడు మార్లు మాత్రమే జవాబు ఇవ్వాలి. దానికంటే మించి జవాబు ఇవ్వనక్కరలేదు. ఎందుకంటే, హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లం) ఇలా ప్రవచించారు.

(إِذَا عَطَسَ أَحَدُكُمْ فَلْيُشَمِّتْهُ جَلِيسُهُ فَإِنْ زَادَ عَلَى ثَلَاثٍ فَهُوَ مَزْكُومٌ وَلَا يَشْمُتْ بَعْدَ ذَلِكَ).

"ఎవరైనా మీ ముందు తుమ్మితే అప్పుడు అక్కడుండేవారు (**యర్హముకల్లాహ్**) అని చెప్పండి. ఒకవేళ జలుబు పట్టిన వ్యక్తి మూడు మార్లకంటే ఎక్కువగా తుమ్మితే, మీరు మూడు మార్ల కంటే ఎక్కువగా జవాబు ఇవ్వకండి."[11]

**మరొక ఉల్లేఖన ప్రకారం:** "తుమ్ములు ఒకసారి, రెండుసార్లు మరియు మూడు సార్లు, అంతకంటే మించినట్లయితే అది జలుబుగా భావించండి."[12]

హజ్రత్ సల్మా బిన్ అకూఅ (రజియల్లాహు అన్హు) కథనం, ఒకరోజు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఉండగా నేను కూడా అక్కడే ఉన్నాను. అప్పుడు ఒక వ్యక్తి తుమ్మినాడు. జవాబుగా ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) : **'యర్హముకల్లాహ్'** అని అన్నారు.

అతను : రెండోసారి తుమ్మినాడు, మరలా **'యర్హముకల్లాహ్'** అని అన్నారు.

అతను : మూడవసారి తుమ్మినాడు, అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (స) : "నీకు జలుబు పట్టింది." అని అన్నారు.[13]

## 'యర్హముకల్లాహ్' అని చెప్పిన వారికి తుమ్మినవాడు జవాబు ఇవ్వాలి

ఆ జవాబు అనేక పదాలుగా హదీసు గ్రంథాలలో ప్రచురించబడి ఉన్నాయి, అవి ఇలా ఉన్నాయి:

1. **يَغْفِرُ اللهُ لَنَا وَ لَكُمْ** **'యగ్ఫిరుల్లాహు లనా వలకుమ్'** అని చెప్పాలి.[14]
2. **يَهْدِيْكُمُ اللهُ وَيُصْلِحُ بَالَكُمْ** **'యహ్దీకుముల్లాహు వ యుస్లిహ్ బాలకుమ్'**[15]
3. హజ్రత్ ఇబ్ను అబ్బాస్ (రజి) ఇలా చెప్పేవారు.

**عَافَانَا اللهُ وَ إِيَّاكُمْ مِنَ النَّارِ وَ يَرْحَمُكَ اللهُ** **'అఫానల్లాహు వ ఇయ్యాకుం మినన్ నారి, వ యర్హముకల్లాహు'**[16]

4. హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) ఇలా చెప్పేవారు.

**يَغْفِرُ اللهُ لِي وَ لَكُمْ** 'యగ్‌ఫిరుల్లాహు లీ, వ లకుమ్'[17]

5. హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) ఇలా చెప్పేవారు.

**يَرْحَمْنَا اللهُ وَ إِيَّاكُمْ وَ يَغْفِرُ اللهُ لَنَا وَ لَكُمْ** 'యర్‌హమ్‌నల్లాహు వ ఇయ్యాకుమ్ వ యగ్‌ఫిరుల్లాహు లనా వ లకుమ్'[18]

## తుమ్మినవారు 'అల్ హమ్దులిల్లాహ్' చెప్పకపోతే జవాబు ఇవ్వనక్కర లేదు

హజ్రత్ అబూ మూసా అల్ అష్‌అరీ (రజియల్లాహు అన్హు) కథనం, నేను ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రకటించినట్లు ఇలా విన్నాను:

**(إِذَا عَطَسَ أَحَدُكُمْ فَحَمِدَ اللَّهَ فَشَمِّتُوهُ فَإِنْ لَمْ يَحْمَدِ اللَّهَ فَلَا تُشَمِّتُوهُ)** "మీలో ఎవరికైనా తుమ్ములు వస్తే **'అల్ హమ్దులిల్లాహ్'** చెప్పితే, మీరు దానికి జవాబు ఇవ్వండి. ఒకవేళ **'అల్ హమ్దులిల్లాహ్'** చెప్పకపోతే, మీరు జవాబు ఇవ్వకండి."[19]

**(عَنْ أَنَسِ بْنِ مَالِكٍ قَالَ: عَطَسَ عِنْدَ النَّبِيِّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ رَجُلَانِ فَشَمَّتَ أَحَدَهُمَا وَلَمْ يُشَمِّتْ الْآخَرَ فَقَالَ الَّذِي لَمْ يُشَمِّتْهُ عَطَسَ فُلَانٌ فَشَمَّتَّهُ وَعَطَسْتُ أَنَا فَلَمْ تُشَمِّتْنِي قَالَ إِنَّ هَذَا حَمِدَ اللَّهَ وَإِنَّكَ لَمْ تَحْمَدِ اللَّهَ).**

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) ఇలా తెలియజేసారు. ఇద్దరు వ్యక్తులు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఉండగా తుమ్మినారు, వారిలో ఒకడు **'అల్ హమ్దులిల్లాహ్'** అని చెప్పాడు, రెండో వ్యక్తి చెప్పలేదు.

ఆ రెండో వ్యక్తి : ప్రవక్త (స) గారిని ఇలా ప్రశ్నించాడు: "మీరు **'అల్ హమ్దులిల్లాహ్'** అని పలికిన వ్యక్తికి **(యర్‌హముకల్లాహ్)** అని జవాబు ఇచ్చారు. నేను తుమ్మితే మీరు నాకు జవాబు ఇవ్వలేదు?

దానికి ప్రవక్త (స) గారు ఇలా సమాధానమిచ్చారు: అతను **(అల్ హమ్దులిల్లాహ్)** అని అన్నాడు. నీవు **'అల్ హమ్దులిల్లాహ్'** అని చెప్పలేదు.[20]

## స్త్రీలు, పురుషులు

తుమ్ముల జవాబు పరస్పరం చెప్పుకోవచ్చు. ఇస్లామీయ షరీఅత్ ప్రకారం

ప్రతి విధానం స్త్రీల కొరకు, పురుషుల కొరకు వర్తిస్తాయి. కాని స్త్రీల కొరకు వేరే విధానం ప్రత్యేకిస్తే తప్ప.

ఇక్కడ కూడా స్త్రీలకు ప్రత్యేకించే విధానం లేదు. కాబట్టి వారు కూడా పురుషుల వలే తుమ్ములకు జవాబు ఇవ్వాలి.

ఒకవేళ పరస్త్రీలకు బదులిస్తే లేక స్త్రీలు పరపురుషులకు బదులిస్తే లేనిపోని ఆశలు లేక శంకలు వారిలో జనించే అవకాశం ఉంటే పరస్పరం తుమ్ములకు జవాబులు చెప్పుకోవలసిన అవసరం లేదు.

---

*1.* (సహీహ్ బుఖారీ : 5755)
*2.* (సహీహ్ బుఖారీ : 5755)
*3.* (సహీహ్ ముస్లిం : 4816)
*4.* (సహీహ్ బుఖారీ : 5755)
*5.* (సహీహ్ అబూదావూద్ : 5033, సహీహ్ తిర్మిజీ : 2741)
*6.* (సహీహ్ అదబుల్ ముఫ్రద్ లిల్ బుఖారీ : 934 / 719, తబ్రానీ, హాకిమ్)
*7.* (సహీహ్ అబూదావూద్ : 773, సహీహ్ తిర్మిజీ : 404)
*8.* (సహీహ్ అబూదావూద్ : 5029)
*9.* (సహీహ్ అబూదావూద్ : 770, సహీహ్ తిర్మిజీ : 404)
*10.* (సహీహ్ ముస్లిం : 836, సహీహ్ అబూదావూద్ : 930)
*11.* (ఇబ్ను సున్నీ, సిల్‌సిలతుస్ సహీహా : 1330)
*12.* (సహీహ్ అదబుల్ ముఫ్రద్ లిల్ బుఖారీ : 939 / 722)
*13.* (సహీహ్ తిర్మిజీ : 2743)
*14.* (సహీహ్ అల్ జామే అస్సగీర్: 688, తబ్రాని)
*15.* (సహీహ్ బుఖారీ : 5756)
*16.* (సహీహ్ అదబుల్ ముఫ్రద్ లిల్ బుఖారీ : 929 / 714)
*17.* (సహీహ్ అదబుల్ ముఫ్రద్ లిల్ బుఖారీ : 934 / 719)
*18.* (అదబుల్ ముఫ్రద్ : 933 / 718)
*19.* (సహీహ్ ముస్లిం : 5308)
*20.* (సహీహ్ ముస్లిం : 5307)



# 11. భోజన మర్యాదలు

సర్వ అనుగ్రహాల ప్రదాత అల్లాహ్ మాత్రమే! ఆయన మనకు అనేక అనుగ్రహాలను ప్రసాదించాడు, వాటిని లెక్కించాలంటే కూడా మనం లెక్కించలేము. అలాగే ఆయనకు కృతజ్ఞతలు చూపవలసిన రీతిలో కూడా మనం కృతజ్ఞతలు చూపలేము. అల్లాహ్ అనుగ్రహాలు తనకు తోచిన విధానంలోనే ప్రజలకు ప్రసాదిస్తున్నాడు. సర్వ అనుగ్రహాలు అల్లాహ్ ఆధీనంలో మాత్రమే ఉన్నాయి. కనుక దరిద్రులు ధనవంతులవుతారు. మరొక్కప్పుడు ధనవంతులు దరిద్రులవుతారు. మామూలు మనిషి రాజు అయిపోతాడు. రాజు కూడా మామూలు మనిషి అయిపోతాడు. సర్వ అధికారాలకు అర్హుడైనవాడు ఆ అల్లాహ్ మాత్రమే.

అల్లాహ్ అనుగ్రహాలను మహాప్రసాదంగా భావించి అల్లాహ్‌కు నిరంతరం కృతజ్ఞతలు తెలుపటం మన కర్తవ్యం. ఆ కృతజ్ఞతలు చెప్పుకునే విధానాన్ని అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారు పలు విధాలుగా మనకు నేర్పినారు. ఆ విధానాలను మనం పాటించినట్లయితే అల్లాహ్ అనుగ్రహాలు మరియు పుణ్యాలు కూడా మనకు లభిస్తాయి.

మనిషి ఆహారంగా తీసుకునే వస్తువులలో కొన్ని వస్తువులను మరియు కొన్ని పానీయాలను సేవించకూడదని అల్లాహ్ నిషేధించాడు.

ఎందుకంటే, ఆ వస్తువులు మనిషికి అనేక రకాలుగా హాని చేస్తాయి. హాని కలిగించేవాటిని తినటం లేక త్రాగటం ఆరోగ్యానికి మంచిది కాదు. అల్లాహ్ అనుమతి కూడా లేదు. అనుమతి లేని వస్తువులను సేవించడం వల్ల అనారోగ్యానికి గురికాబడడమే కాకుండా, పాపాలకు కూడా గురికాబడతాము.

హలాల్ చేయబడ్డ వస్తువులు, తినే మరియు త్రాగే పదార్థాలు, మనిషికి స్వస్థతను మరియు శక్తిని ప్రసాదించుటకై ఉన్నాయి. వాటినే మనం తినాలి, త్రాగాలి. అవి ఆరోగ్యానికి మంచివి. దైవభీతితో తినడం వల్ల పుణ్యాలు కూడా ప్రాప్తమవుతాయి.

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు: .

(وَيُحِلُّ لَهُمُ الطَّيِّبَاتِ وَيُحَرِّمُ عَلَيْهِمُ الْخَبَائِثَ) 'వారి (ప్రజల) కొరకు పరిశుద్ధమైన

వస్తువులను ధర్మసమ్మతం చేశాడు. అపరిశుద్ధమైన వాటిని నిషిద్ధం చేశాడు."[1]

మరోచోట ఇలా తెలియజేశాడు:

(يَا أَيُّهَا الرُّسُلُ كُلُوا مِنَ الطَّيِّبَاتِ وَاعْمَلُوا صَالِحًا إِنِّي بِمَا تَعْمَلُونَ عَلِيمٌ).

"ఓ ప్రవక్తలారా! స్వచ్ఛమైన వస్తువులను తినండి, మంచి పనులు చేయండి. మీరు ఏది చేసిన నాకు అది తెలియకపోదు."[2]

ఖుర్ఆన్ గ్రంథంలో మరోచోట అల్లాహ్ ఇలా తెలియజేశాడు :

(ثُمَّ لَتُسْأَلُنَّ يَوْمَئِذٍ عَنِ النَّعِيمِ) "తరువాత ఆ రోజున మీరు తప్పనిసరిగా ఈ సౌఖ్యాలను గురించి ప్రశ్నించబడతారు."[3]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "హరాం సంపాదనతో పెరిగే శరీరం అది అగ్నిలో కాలడానికి తగినది."[4]

## బంగారం మరియు వెండి పాత్రలలో తినకూడదు మరియు త్రాగకూడదు

(سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ لَا تَلْبَسُوا الْحَرِيرَ وَلَا الدِّيبَاجَ وَلَا تَشْرَبُوا فِي آنِيَةِ الذَّهَبِ وَالْفِضَّةِ وَلَا تَأْكُلُوا فِي صِحَافِهَا فَإِنَّهَا لَهُمْ فِي الدُّنْيَا وَلَنَا فِي الْآخِرَةِ).

హజ్రత్ హుజైఫా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రకటిస్తుండగా నేను ఇలా విన్నాను: "మీరు (పురుషులు)పట్టును మరియు పట్టుతో చేసిన వస్త్రాలను ధరించకండి. బంగారం మరియు వెండి పాత్రలలో (స్త్రీ, పురుషులు) త్రాగకండి, ఇంకా ఆ (బంగారు) పళ్లెములలో తినకండి, అవి ఇహలోకంలో వారి (అవిశ్వాసుల) కొరకు ఉన్నాయి. అవి పరలోకంలో (స్వర్గంలో) మా కొరకు ఉన్నాయి."[5]

హజ్రత్ ఉమ్మె సల్మా కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు.

(مَنْ شَرِبَ فِي إِنَاءٍ مِنْ ذَهَبٍ أَوْ فِضَّةٍ فَإِنَّمَا يُجَرْجِرُ فِي بَطْنِهِ نَارًا مِنْ جَهَنَّمَ).

"ఎవరయితే వెండి లేక బంగారు గిన్నెతో (చెంబుతో) త్రాగుతారో! నిజానికి వారు తమ పొట్టలో నరకాగ్ని గుటకలు నింపినట్లే"[6]

## దేనికైనా ఆనుకొని తినకూడదు

كُنْتُ عِنْدَ النَّبِيِّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ : (فَقَالَ لِرَجُلٍ عِنْدَهُ لَا آكُلُ وَأَنَا مُتَّكِئٌ).

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "నేను ఆనుకొని ఉండి ఏమియు తినను."[7]

★ ఆనుకొని అహంకారమైన విధానంలో కూర్చొని త్రాగడం, లేక తినడం మంచిది కాదు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు :

(آكُلُ كَمَا يَأْكُلُ الْعَبْدُ ، وَأَجْلِسُ كَمَا يَجْلِسُ الْعَبْدُ)

"నేను దాసుణ్ణి, దాసుడు తినే విధంగానే తింటాను. దాసుడు కూర్చుండే విధంగానే కూర్చుంటాను."[8]

## భోజనం వడ్డించిన తరువాత నమాజుకు వెళ్ళకూడదు

హజ్రత్ అనస్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"మగ్రిబ్ నమాజు చేయడానికి ముందే భోజనం వడ్డించడం జరిగితే, భోజనం చేయండి. భోజనంలో ఆలస్యం చేయకండి."[9]

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు.

(إِذَا وُضِعَ الْعَشَاءُ وَأُقِيمَتْ الصَّلَاةُ فَابْدَءُوا بِالْعَشَاءِ).

"రాత్రి భోజనం వడ్డించినప్పుడు ఇషా నమాజు కొరకు ఇఖామత్ చెప్పినచో! అప్పుడు మీరు ముందు భోజనం చేయాలి."[10]

## తినక ముందు చేతులను నీళ్ళతో శుభ్రం చేసుకోవాలి

తినక ముందు నీళ్ళతో చేతులు శుభ్రం చేసుకోవాలని ప్రామాణికమైన హదీసులు లేవు. కాని అనేక బలహీనమైన హదీసులున్నాయి. అయినా ఇస్లాం

నియమాలు పరిశుభ్రతను పాటించుట వైపే మొగ్గు చూపుతాయి. అందుకని అన్నం తినక ముందు చేతులను శుభ్రంగా కడిగి తినడం ఎంతో ఉత్తమమైనది.

## తిన్న తరువాత చేతులను శుభ్రం చేసుకోవాలి

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మేక భుజాన్ని తిన్నారు. తరువాత పుక్కిలించి, చేతులు కడిగినారు. మరియు నమాజు చేశారు."[11]

## తినక ముందు, తిన్న తరువాత ప్రార్థన :

హజ్రత్ ఉమర్ బిన్ అబూ సల్మా (రజియల్లాహు అన్హు) కథనం: నేను చిన్నప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇంట్లో భోజనం చేస్తూ నా చేతిని పళ్లెం మొత్తం తిప్పేవాణ్ణి, అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నన్ను ఇలా ఆదేశించారు: "ఓ అబ్బాయి! **'బిస్మిల్లాహ్'** చెప్పి, నీ ముందు ఉండే దాన్ని కుడిచేత్తో తిను" అప్పటి నుండి నేను అదే విధంగా తింటున్నాను.[12]

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**(إِذَا أَكَلَ أَحَدُكُمْ فَلْيَذْكُرْ اسْمَ اللَّهِ تَعَالَى فَإِنْ نَسِيَ أَنْ يَذْكُرَ اسْمَ اللَّهِ تَعَالَى فِي أَوَّلِهِ فَلْيَقُلْ بِسْمِ اللَّهِ أَوَّلَهُ وَآخِرَهُ).**

మీరు భోజనం (ప్రారంభించినప్పుడు) తినేటప్పుడు **'బిస్మిల్లాహ్'** చెప్పండి, ఒకవేళ ప్రారంభంలో మరచిపోతే : **'బిస్మిల్లాహి అవ్వలహు వ ఆఖిరహు'** అని చెప్పండి.[13]

హజ్రత్ ముఆజ్ బిన్ అనస్ (రజియల్లాహు అన్హు) ఆయన తండ్రి కథనం, ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు: "భోజనం చేసిన తరువాత **(اَلْحَمْدُ للهِ الَّذِيْ أَطْعَمَنِيْ هَذَا وَرَزَقَنِيْهِ مِنْ غَيْرِ حَوْلٍ مِّنِّيْ وَلاَ قُوَّةٍ).** **'అల్ హమ్దు లిల్లాహిల్లజీ అత్అమనీ, హాజా వ రజఖనీహి మిన్ గైరి హవ్లిన్ మిన్నీ వలా ఖువ్వతిన్'** అని ప్రార్థన చేస్తే, గతంలో అతను చేసిన పాపాలు క్షమించబడతాయి."[14]

# ఉత్తమమైన రీతిలో తినడం

హ[జత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(لَا تَأْكُلُوا بِالشِّمَالِ فَإِنَّ الشَّيْطَانَ يَأْكُلُ بِالشِّمَالِ) "ఎడమ చెయ్యితో తినకండి. ఎందుకంటే, షైతాన్ ఎడమ చెయ్యితో తింటాడు."[15]

హ[జత్ అబ్దుల్లాహ్ ఇబ్ను అబ్బాస్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (స) : نَهَى رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ أَنْ يُتَنَفَّسَ فِي الْإِنَاءِ أَوْ يُنْفَخَ فِيهِ "పాత్రలో శ్వాస వదులుటను మరియు పాత్రలో నోటితో ఊదుటను నిషేధించారు."[16]

హ[జత్ అబ్దుల్లాహ్ ఇబ్ను అబ్బాస్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(إِذَا أَكَلَ أَحَدُكُمْ طَعَامًا فَلَا يَأْكُلْ مِنْ أَعْلَى الصَّحْفَةِ وَلَكِنْ لِيَأْكُلْ مِنْ أَسْفَلِهَا فَإِنَّ الْبَرَكَةَ تَنْزِلُ مِنْ أَعْلَاهَا).

"మీరు భోజనం చేసేటప్పుడు పళ్ళెం పై (మధ్య) భాగంలో ఉన్న అన్నాన్ని తినకండి, కాని పళ్ళెం క్రింద (మీ ముందు) భాగంలో ఉన్న అన్నాన్ని తినండి. ఎందుకంటే, పళ్ళెం (మధ్య) భాగంలో శుభాలు అవతరిస్తాయి."[17]

అన్నం తినేటప్పుడు పళ్ళెం మధ్యలో నుంచి తిని చుట్టూర ఉన్న అన్నం తరువాత తినడం మంచిది కాదు. కాని తమ ముందు భాగం నుండి అన్నం తినాలి. ఒకవేళ పూర్తి అన్నం తినగలిగితే కూడా తమ ముందు నుంచే తినాలి.

(كَانَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ يَأْكُلُ بِثَلَاثِ أَصَابِعَ وَيَلْعَقُ يَدَهُ قَبْلَ أَنْ يَمْسَحَهَا).

హ[జత్ కఅబ్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) ఆయన తండ్రి కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) తమ చేతి మూడు వ్రేళ్ళతో తినేవారు, తరువాత తమ చేతిని తుడవక ముందు (వ్రేళ్ళను) నాకేవారు.[18]

హ[జత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త

ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవచించారు:

(كَانَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ يَأْكُلُ بِثَلَاثِ أَصَابِعَ وَيَلْعَقُ يَدَهُ قَبْلَ أَنْ يَمْسَحَهَا).

"చెయ్యి వ్రేళ్లను మరియు పళ్ళెమును (వ్రేళ్ళతో) నాకాలని ఆదేశించారు. తరువాత ఇలా అన్నారు: "ఎందుకంటే, దేనిలో (ఏ మెతుకు గింజలో) శుభాలు ఉన్నాయో మీకు తెలీదు కదా!"[19]

**నోట్ :** పళ్ళెంను నాలుకతో నాకడం కాదు. చేతి వ్రేళ్ళతో నాకడం.

భోజనంలో శుభాలను అల్లాహ్ ప్రసాదించాడు. కాని ఆ భోజనం ఏ మెతుకులో శుభాలు దాగి ఉన్నాయో ఎవరికి తెలుసు. కాబట్టి మనిషి తిన్న తరువాత అతని వ్రేళ్ళలో లేక పళ్ళెములో మిగిలిపోయిన అన్నం గింజలను వదలకుండా పూర్తిగా తినాలి. ఆ అన్నం గింజలు క్రింద పడిపోయి ఉంటే వాటిని కూడా తీసుకుని దుమ్ము లేక మట్టి తగిలి ఉంటే దాన్ని శుభ్రపరచి తినాలి. అలా చేస్తే శు భాలు కలిగి ఉన్న అన్నం మన భాగ్యంలో లభించవచ్చు.

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవచించారు:

(إِذَا وَقَعَتْ لُقْمَةُ أَحَدِكُمْ فَلْيَأْخُذْهَا فَلْيُمِطْ مَا كَانَ بِهَا مِنْ أَذًى وَلْيَأْكُلْهَا وَلَا يَدَعْهَا لِلشَّيْطَانِ وَلَا يَمْسَحْ يَدَهُ بِالْمِنْدِيلِ حَتَّى يَلْعَقَ أَصَابِعَهُ فَإِنَّهُ لَا يَدْرِي فِي أَيِّ طَعَامِهِ الْبَرَكَةُ).

"భోజనం చేసేటప్పుడు మీ మెతుకులు క్రింద పడిపోతే వాటిని ఎత్తుకోవాలి. వాటికి ఏమైనా దుమ్ము తగిలి ఉంటే వాటిని శుభ్రం చేసి తినండి, షైతాన్ కొరకు వదలకండి, చక్కగా వ్రేళ్ళను నాకే వరకు టవల్ (నీళ్ళ)తో శు భ్రపరచకండి, ఎందుకంటే, దేనిలో (ఏ మెతుకు గింజలో) శుభాలు ఉ న్నాయో మీకు తెలీదు."[20]

## తినేటప్పుడు రెండేసి పండ్లు తీసుకోకూడదు

(نَهَى النَّبِيُّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ أَنْ يَقْرُنَ الرَّجُلُ بَيْنَ التَّمْرَتَيْنِ جَمِيعًا حَتَّى يَسْتَأْذِنَ أَصْحَابَهُ)

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (స): "రెండేసి ఖర్జూరాలు తీసుకోవటాన్ని నిషేధించారు. కాని సభలో ఉన్నవారితో (రెండేసి ఖర్జూరాలకై) అనుమతి తీసుకుంటే తప్ప."[21]

మనం నలుగురిలో ఖర్జూరాలు, ద్రాక్షాపండ్లు, ఇతర పండ్లు ఫలాలు తింటుండగా ఆత్రంతో ఇతరులు ఎక్కడ తినేస్తారేమోననీ రెండేసి మూడేసి ఎత్తుకుని లేక నోటి నిండా నింపుకుని తినడం మంచిది కాదు. ఆ సభలో ఉన్నవారు కూడా తినేటట్టు ఆలోచించి ఒక్కొక్కటిగా తింటే అందరికీ అందుతాయి మరియు సభకి గౌరవం కూడా ఉంటుంది. ఒకవేళ అందరు తిని మిగిలిపోయేటట్టు ఉంటే, అప్పుడు అక్కడున్న వారితో అనుమతి కోరి రెండేసి మూడేసి తినవచ్చును. ఎలాంటి దోషము లేదు.

## అన్నం చల్లారిన తరువాత తినడం మంచిది

(عَنْ أَسْمَاءَ بِنْتِ أَبِي بَكْرٍ أَنَّهَا كَانَتْ إِذَا ثَرَدَتْ غَطَّتْهُ شَيْئًا حَتَّى يَذْهَبَ فَوْرُهُ ثُمَّ تَقُولُ إِنِّي سَمِعْتُ رَسُولَ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ إِنَّهُ أَعْظَمُ لِلْبَرَكَةِ).

హజ్రత్ అస్మా బిన్తె అబూ బకర్ (రజియల్లాహు అన్హు) కథనం, నేను 'సరీద్' (రొట్టె మరియు మాంసము కూర కలిపి ఉంచి తినే భోజనం) చేస్తే దాని వేడి తొలిగి పోయే వరకు కప్పి ఉంచుతాను. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా నేను ఇలా విన్నాను. "నిశ్చయంగా దానిలో (వేడి తొలిగిన భోజనంలో) అత్యంత శుభాలు ఉన్నాయి."[22]

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) (لاَ يُؤْكَلُ طَعَامٌ حَتَّى يَذْهَبَ بُخَارَهُ) "భోజనం యొక్క వేడి (ఆవిరి) తొలిగిపోయే వరకు తినేవారు కారు."[23]

## భోజనంలో లోపాలు ఎత్తిచూపకూడదు

(عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللَّهُ عَنْهُ قَالَ: مَا عَابَ النَّبِيُّ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ طَعَامًا قَطُّ إِنْ اشْتَهَاهُ أَكَلَهُ وَإِلَّا تَرَكَهُ).

హజ్రత్ అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఎన్నడూ భోజనంలో లోపాలు ఎత్తి చూపలేదు. ఏదైనా ఇష్టముంటే తింటారు, ఒకవేళ ఇష్టం లేదంటే తినకుండా వదిలేస్తారు.[24]

## ఒంటరిగా భుజించటం కంటే పంక్తి భోజనం ఉత్తమమైనది

అధికమైన సంఖ్యలో అన్నం వద్ద కూర్చొని భుజించడం ఎంతో మేలైనది, ఎంత ఎక్కువ సంఖ్యలో భోజనం చేసేవారు ఉంటారో అంత ఎక్కవగా శుభాలు ప్రాప్తమవుతాయి.

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా నేను ఇలా విన్నాను :

**(طَعَامُ الْوَاحِدِ يَكْفِي الِاثْنَيْنِ وَطَعَامُ الِاثْنَيْنِ يَكْفِي الْأَرْبَعَةَ وَطَعَامُ الْأَرْبَعَةِ يَكْفِي الثَّمَانِيَةَ)** 'ఒక వ్యక్తి అన్నం, ఇద్దరికి సరిపోతుంది. మరియు ఇద్దరి అన్నం నలుగు రికి సరిపోతుంది. మరియు నలుగురి అన్నం, ఎనిమిది మందికి సరిపోతుంది.[25]

ఒకరోజు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అనుచరులు "మేము అన్నం బాగానే తింటున్నాము అయినా కడుపు నిండడం లేదు" అని అడిగారు. దానికి ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) : 'మీరు వేరువేరుగా తింటున్నారేమో' అని ప్రశ్నించారు.

వారు : 'అవును, అని సమాధానమిచ్చారు.

దానికి ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) : 'అయితే మీరు కలిసి తినండి, **'బిస్మిల్లాహ్'** చెప్పండి, దానివల్ల మీకు శుభాలు ప్రాప్తమవుతాయి." అని అన్నారు.[26]

## అతిగా భుజించకూడదు :

**(عَنْ مِقْدَامِ بْنِ مَعْدِي كَرِبَ قَالَ: سَمِعْتُ رَسُولَ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ مَا مَلَأَ آدَمِيٌّ وِعَاءً شَرًّا مِنْ بَطْنٍ بِحَسْبِ ابْنِ آدَمَ أُكُلَاتٌ يُقِمْنَ صُلْبَهُ فَإِنْ كَانَ لَا مَحَالَةَ فَثُلُثٌ لِطَعَامِهِ وَثُلُثٌ لِشَرَابِهِ وَثُلُثٌ لِنَفَسِهِ)**

హజ్రత్ మిగ్దాద్ బిన్ మాదికరబ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా నేను ఇలా విన్నాను: "మానవుడు తన కడుపు కంటే ఎక్కువగా చెడ్డదైన ఏ పళ్ళెము నింపడు. అతను తన వీపును చక్కగా నిలబెట్టుకొనుటకు కొన్ని మెతుకులు తిన్నా తన కడుపుకు

సరిపోతుంది. ఒకవేళ తినాలే అనుకుంటే, (కడుపు) మూడు భాగాల్లో ఒక భాగం తినుటకు, మరొక భాగం త్రాగుటకు, మరొక భాగం శ్వాస పీల్చుటకై ఉంచండి" అని అన్నారు.[27]

---

1. *(సూరతుల్ ఆరాఫ్ :157)*
2. *(23 సూరతుల్ మూమీనూన్ : 51)*
3. *(102, సూరతు త్తకాసుర్ : 8)*
4. *(హాకిమ్, బైహఖీ ఫీ షోబిల్ ఈమాన్)*
5. *(సహీహ్ బుఖారీ : 5006, సహీహ్ ముస్లిం : 3850)*
6. *(సహీహ్ బుఖారీ : 5203, సహీహ్ ముస్లిం : 3847)*
7. *(సహీహ్ బుఖారీ : 4980)*
8. *(ముస్‌నద్ అబూయాలా : 4920, బగ్వీ ఫీ షర్హుస్ సున్న 3/187/2, సహీహ్ అల్ జామే : 6,7)*
9. *(సహీహ్ బుఖారీ : 632, సహీహ్ ముస్లిం : 867)*
10. *(సహీహ్ బుఖారీ : 631)*
11. *(ముస్నద్ అహ్మద్ : 8688)*
12. *(సహీహ్ బుఖారీ : 4957, సహీహ్ ముస్లిం : 3767)*
13. *(సహీహ్ అబూదావూద్ : 3767)*
14. *(సహీహ్ తిర్మిజీ : 3458, సహీహ్ ఇబ్నుమాజ : 3285)*
15. *(సహీహ్ ముస్లిం : 3763)*
16. *(సహీహ్ అబూదవూద్: 3728, సహీహ్ తిర్మిజీ: 1888, సహీహ్ అల్ జామే: 6820)*
17. *(సహీహ్ అబూదావూద్ : 3772)*
18. *(సహీహ్ ముస్లిం : 3790)*
19. *(సహీహ్ ముస్లిం : 3792)*
20. *(సహీహ్ ముస్లిం : 3793)*
21. *(సహీహ్ బుఖారీ : 2309, సహీహ్ ముస్లిం : 3810)*
22. *(దార్మీ, అహ్మద్ : 2570, సిల్‌సిలతుస్ సహీహ్, 392)*
23. *(బైహఖీ : 20/210, సిల్‌సిలతుస్ సహీహ్, 392)*
24. *(సహీహ్ బుఖారీ : 3299, సహీహ్ ముస్లిం : 3844)*
25. *(సహీహ్ ముస్లిం : 3836)*
26. *(ఇబ్ను మాజ : 2657, అహ్మద్)*
27. *(తిర్మిజీ, ఇబ్నుమాజ, సిల్‌సిలతుస్ సహీహ్ : 2265)*

# 12. ప్రశాంతంగా నిద్రపోయే మరియు మేల్కొనే విధానం

మానవునికి అల్లాహ్ ప్రసాదించిన ముఖ్యమైన అనుగ్రహాలలో నిదుర ఒక గొప్ప అనుగ్రహం. ఒక వ్యక్తి కష్టపడి అలసిపోయినప్పుడు నిద్ర ద్వారానే సుఖాన్ని పొందుతాడు. పగలంతా శ్రమపడి అలసిపోయి, శరీరమంతా నొప్పులకు, బాధలకు గురికాబడినప్పుడు చక్కగా నిదుర పట్టితే చాలు ఆ బాధలన్నీ చిటికెలో మాయం అవుపోతాయి. తరువాత తిరిగి అతను నూతన ఉత్తేజాన్ని మరియు నూతన శక్తిని పొందుతాడు.

అల్లాహ్ ఇలా తెలియజేశాడు :

(وَمِنْ آيَاتِهِ مَنَامُكُمْ بِاللَّيْلِ وَالنَّهَارِ وَابْتِغَاؤُكُمْ مِنْ فَضْلِهِ إِنَّ فِي ذَلِكَ لَآيَاتٍ لِقَوْمٍ يَسْمَعُونَ) "ఇంకా ఆయన సూచనలలో రాత్రివేళ, పగటివేళ మీరు నిద్ర పోవటం, మీరు ఆయన కృపను అన్వేషించటం కూడా ఉన్నాయి. వినేవారికి ఇందులో అనేక సూచనలున్నాయి."[1]

కొంతమంది ప్రజలు నిద్ర లేదంటూ బాధపడేవారు కూడా ఉన్నారు. ఇంకా కొంత మంది ప్రజలు నిద్ర పట్టడం లేదంటు మందులు తీసుకుంటారు. మరి కొందరయితే మత్తు పానీయాలు తీసుకొని నిద్రకు అలవాటు పడ్తారు. మరి కొంత మంది ప్రజలకు నిద్ర అనేది అసలు పట్టనే పట్టదు. అలాంటప్పుడు వారు అనేక విధాలుగా మానసిక రోగాలకు గురికాబడి వివిధమైన బాధలు పడుతుంటారు. అలా నిదురలేని కారణంగా అనేక సమస్యలకు గురికాబడి మానసికంగా కుమిలి పోతుంటారు. చివరికి కొంత మంది ఆత్మహత్యలు కూడా చేసుకుంటున్నారు.

మనిషికి నిదుర ఎలా పట్టుతుంది అంటే, ఆ విషయాన్ని అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(اللَّهُ يَتَوَفَّى الْأَنْفُسَ حِينَ مَوْتِهَا وَالَّتِي لَمْ تَمُتْ فِي مَنَامِهَا فَيُمْسِكُ الَّتِي قَضَى عَلَيْهَا الْمَوْتَ وَيُرْسِلُ الْأُخْرَى إِلَى أَجَلٍ مُسَمًّى إِنَّ فِي ذَلِكَ لَآيَاتٍ لِقَوْمٍ يَتَفَكَّرُونَ).

"అల్లాహ్‌యే ఆత్మలను వాటి మరణ సమయంలో స్వాధీనం చేసుకుంటాడు.

మరణంరాని ఆత్మలను కూడా వాటి నిద్రావస్థలో ఆయన వశపరచుకుం టున్నాడు. మరియు మరణ ఉత్తర్వులు ఖరారైన వారి ఆత్మలను ఆపుకుం టాడు. ఇతర ఆత్మలను ఒక నిర్ణీత గడువు వరకు వదలిపెడుతున్నాడు. చింతన చేసేవారి కోసం ఇందులో ఎన్నో సూచనలున్నాయి."[2]

మరొక చోట అల్లాహ్ ఇలా తెలియజేశాడు :

(وَهُوَ الَّذِي يَتَوَفَّاكُمْ بِاللَّيْلِ وَيَعْلَمُ مَا جَرَحْتُمْ بِالنَّهَارِ ثُمَّ يَبْعَثُكُمْ فِيهِ لِيُقْضَى أَجَلٌ مُسَمًّى ثُمَّ إِلَيْهِ مَرْجِعُكُمْ ثُمَّ يُنَبِّئُكُمْ بِمَا كُنْتُمْ تَعْمَلُونَ).

"ఆయనే రాత్రి పూట మీ ఆత్మలను స్వాధీనం చేసుకుంటాడు. పగటి పూట మీరు చేసేదంతా ఆయనకు తెలుసు. మళ్ళీ ఆయన నిర్ధారిత సమయాన్ని పూర్తి చేయటానికి మిమ్మల్ని అందులో మేల్కొలుపుతాడు. ఆ తర్వాత మీరంతా ఆయన వైపునకే మరలిపోవలసి ఉన్నది. ఆ తరువాత మీరు చేస్తూ ఉండిన కర్మలన్నింటినీ ఆయన మీకు తెలుపుతాడు."[3]

నిద్రను 'వఫాతే అస్గర్' (చిన్న తరహా మరణం) గానూ, మృత్యువును 'వఫాతే అక్బర్' (పెద్ద తరహా మరణం)గానూ వ్యవహరిస్తారు. కనుక అల్లాహ్ మనిషిని చిన్నపాటి మరణావస్థ నుంచి మేల్కొలిపి జీవితాన్ని ప్రసాదిస్తాడు. ఈ జీవన్మరణాలు మనిషిని మృత్యువు కబళించే వరకూ అనుదినం వస్తూనే ఉంటాయి. మరణానంతర జీవితంపై సంశయంలో పడివున్న ప్రబుద్ధులకు పైన ఇవ్వబడిన ఈ అమూల్యమైన ఆయతులు ఒక గుణపాఠం వంటివి.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: (إِنَّ اللَّهَ قَبَضَ أَرْوَاحَكُمْ حِينَ شَاءَ وَرَدَّهَا عَلَيْكُمْ حِينَ شَاءَ). "నిశ్చయంగా అల్లాహ్ అనుకున్నప్పుడు మీ ఆత్మలను తీసుకుంటాడు, ఆయన అనుకున్నప్పుడు తిరిగి మీ ఆత్మలను శరీరాలలోకి పంపుతాడు."[4]

## నిద్రసమయం

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఈ విధంగా ప్రవచించారు:

(إِذَا نَعَسَ أَحَدُكُمْ وَهُوَ يُصَلِّي فَلْيَرْقُدْ حَتَّى يَذْهَبَ عَنْهُ النَّوْمُ فَإِنَّ أَحَدَكُمْ إِذَا صَلَّى وَهُوَ نَاعِسٌ لَا يَدْرِي لَعَلَّهُ يَسْتَغْفِرُ فَيَسُبُّ نَفْسَهُ).

"మీలో ఎవరికయినా నమాజులో కునుకుపాటు వస్తే, నిద్ర దూరమైనదాకా పడుకోవటం మంచిది. ఎందుకంటే, మీలో ఎవరయినా కునుకుపాట్ల మధ్య నమాజ్ చేస్తే అతను (అల్లాహ్‌ను) క్షమాపణలు వేడుకునే బదులు తన్ను తాను తిట్టుకునే ప్రమాదముంటుంది."[5]

హజ్రత్ అబూ బర్జా (రజియల్లాహు అన్హు) కథనం : ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇషా నమాజుకు ముందు పడుకోవటాన్ని, ఇషా నమాజు తర్వాత కబుర్లు చెప్పుకోవటాన్ని అసహ్యించుకొనేవారు.[6]

హజ్రత్ ఇబ్ను మస్‌వూద్ (రజియల్లాహు అన్హు) కథనం, రాత్రి (ఫజర్ నమాజ్) చేయకుండా తెల్లవారే దాకా పడుకున్న వ్యక్తి గురించి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ముందు ప్రస్తావించగా విన్నాను.

(ذَاكَ رَجُلٌ بَالَ الشَّيْطَانُ فِي أُذُنَيْهِ أَوْ قَالَ فِي أُذُنِهِ) "అలాంటి వ్యక్తి చెవిలో లేక చెవుల్లో షైతాన్ మూత్రం చేస్తాడు" అని అన్నారు.[7]

**(عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللَّهُ عَنْهُ أَنَّ رَسُولَ اللَّه صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: يَعْقِدُ الشَّيْطَانُ عَلَى قَافِيَةِ رَأْسِ أَحَدِكُمْ إِذَا هُوَ نَامَ ثَلَاثَ عُقَدٍ يَضْرِبُ كُلَّ عُقْدَةٍ عَلَيْكَ لَيْلٌ طَوِيلٌ فَارْقُدْ فَإِنْ اسْتَيْقَظَ فَذَكَرَ اللَّهَ انْحَلَّتْ عُقْدَةٌ فَإِنْ تَوَضَّأَ انْحَلَّتْ عُقْدَةٌ فَإِنْ صَلَّى انْحَلَّتْ عُقْدَةٌ فَأَصْبَحَ نَشِيطًا طَيِّبَ النَّفْسِ وَإِلَّا أَصْبَحَ خَبِيثَ النَّفْسِ كَسْلَانَ).**

హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఈ విధంగా ప్రవచించారు:

"మీలో ఎవరయిననా పడుకొని ఉన్నప్పుడు షైతాన్ అతని ముచ్చిలి గుంటపై మూడు ముళ్ళు వేస్తాడు. ప్రతి ముడి మీద 'ఇంకా చాలా రాత్రి ఉంది. హాయిగా నిద్రపో' అంటూ మంత్రించి ఊదుతాడు. అలాంటప్పుడు మనిషి గనక నిద్రలేచి అల్లాహ్‌ను స్మరిస్తే (ఆ ముడులలో) ఒక ముడి ఊడిపోతుంది. ఆ తర్వాత అతను వుజూ కూడా చేస్తే రెండో ముడి ఊడి పోతుంది. ఆ తర్వాత అతను నమాజు చేసు కుంటే ముళ్ళన్నీ ఊడిపోతాయి. దాంతో తెల్లవారుజామున నిద్రలేచేటప్పుడు అతను ఎంతో హుషారుగా నూతనోత్సాహంతో లేస్తాడు. లేకపోతే నిర్వేద మనసుతో, బద్ధకంగా లేస్తాడు."[8]

హజ్రత్ సఖ్ర్ బిన్ వదాఅ గామిది సహాబీ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) :

(اللَّهُمَّ بَارِكْ لِأُمَّتِي فِي بُكُورِهَا وَكَانَ إِذَا بَعَثَ سَرِيَّةً أَوْ جَيْشًا بَعَثَهُمْ مِنْ أَوَّلِ النَّهَارِ وَكَانَ صَخْرٌ رَجُلًا تَاجِرًا وَكَانَ يَبْعَثُ تِجَارَتَهُ مِنْ أَوَّلِ النَّهَارِ فَأَثْرَى وَكَثُرَ مَالُهُ).

"ఓ అల్లాహ్! నా అనుచర సమాజానికి వేకువజాములో శుభాన్ని ప్రసాదించు' అని ప్రార్థించారు. ఆయన ఏదయినా సైనిక పటాలాన్ని గాని లేదా దళాన్ని గాని పంపినప్పుడు వారిని వేకువ జామునే పంపేవారు."[9]

★ ఇషా నమాజుకు ముందు నిద్రపోరాదని చెప్పటంలోని మర్మం ఏమిటంటే, దాని వల్ల మనిషి నిద్ర మైకం చేత ఇషా నమాజుకు ఎగనామం పెట్టే ప్రమాదముంది. అందుకే ఇషా నమాజుకు ముందు నిద్రపోరాదని బోధించబడింది.

★ ఇషా నమాజు తర్వాత కబుర్లు చెప్పుకోవటాన్ని ఎందుకు వారించడం జరిగిందంటే, కబుర్లలో మునిగి రాత్రి ఆలస్యంగా నిద్రపోతే తహజ్జుద్, ఫజ్ర్ నమాజులకు మెలకువరాదు. ఆ విధంగా అనవసరంగా పాపంలో పడినట్లవుతుంది.

★ మనిషి నమాజు చేయకుండా నిద్రపోతే షైతాన్ ఆ వ్యక్తిపై ఏ విధంగా ప్రభావం వేస్తాడన్న విషయాన్ని తెలియజేయబడింది. ఫజ్ర్ నమాజు చేయని కారణంగానే షైతాన్ మనిషిని లోబరచుకునే అవకాశం దొరుకుతుంది. ఫలితంగా మనిషిని దైవదాస్యం నుండి, దైవ విధేయత నుండి ఆపటంలో విజయాన్ని సాధిస్తాడు.

★ ఒక వ్యక్తి ఫజ్ర్ నమాజు తరువాత ఏ పని మొదలుపెట్టినా అది లాభదాయకంగానూ, శుభకరంగానూ ఉంటుందని బోధపడుతోంది. వేకువజాము సమయంలో మనుషులు తాజాగా, హుషారుగా ఉంటారు. పని చేసే ఓపిక వారిలో పుష్కలంగా ఉంటుంది. అందుకనే ఆ సమయంలో చేసే పనులు అన్నీ చాలా తొందరగా పూర్తవుతాయి.

## నిద్రపోక మునుపు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి

ఇస్లాం ధర్మంలో నిద్ర పోవుట కొరకు కొన్ని ప్రత్యేకమైన నియమాలున్నాయి. వాటిని పాటిస్తే నిద్ర కూడా చక్కగా వస్తుంది. నిద్రలో భయపడడం, నిద్రలో ఉలిక్కి పడడం వంటి ఆందోళనకరమైన విషయాల నుండి రక్షించబడతారు. అలాగే నిద్ర నియమాలను పాటించడం వల్ల మనిషికి పుణ్యాలు కూడా లభిస్తాయి.

## 1. కంచె గోడ లేని ఇంటి మిద్దె (ఇంటి కప్పు)పై నిద్ర పోకూడదు

హజ్రత్ అలీ బిన్ షైబాన్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా హెచ్చరించారు:

(عَلَى ظَهْرِ بَيْتٍ لَيْسَ لَهُ حِجَارٌ فَقَدْ بَرِئَتْ مِنْهُ الذِّمَّةُ) 'కంచె గోడ (చేపట్టు గోడ) లేని ఇంటి మిద్దెపై నిద్ర పోయిన వారికి అల్లాహ్ వైపు నుండి రక్షణ హామీ లేదు."[10]

2. సాయంత్రం మీ పిల్లలను ఇంటి బయటకు వదలకండి. ఇంటి దీపాలు ఆర్పేయండి. (పొయ్యి, గ్యాసు, హీటర్లు, బత్తీలు మొదలగు నిప్పు రాజేసే వస్తువు లన్నిటినీ ఆర్పిన తరువాత నిద్రపోవాలి.)

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రబోధించారు :

(أَطْفِئُوا الْمَصَابِيحَ إِذَا رَقَدْتُمْ وَغَلِّقُوا الْأَبْوَابَ وَأَوْكُوا الْأَسْقِيَةَ وَخَمِّرُوا الطَّعَامَ وَالشَّرَابَ وَأَحْسِبُهُ قَالَ وَلَوْ بِعُودٍ تَعْرُضُهُ عَلَيْهِ).

"పాత్రల్ని మూసి ఉంచండి. త్రాగబడే (కుండల్ని, కూజాల్ని, పాత్రల్ని) కప్పి ఉంచండి. తలుపులు మూసి వేయండి. సాయంకాలం (మగ్రిబ్ సమయాన) పిల్లలను ఇంటి బయటకు వదలకండి. ఎందుకంటే, ఆ సమయంలో జిన్నులు (షైతాన్లు) సంచరిస్తుంటాయి. మరియు వారి ప్రభావం (పిల్లలపై) ఉంటుంది. నిద్రపోక ముందు దీపాలు ఆర్పేయండి. ఎందుకంటే, నిప్పు రవ్వలు కూడా ఇంటిని, ఇంట్లోని ఉన్నవారిని సమేతంగా కాల్చేయగలవు.[11]

## 3. బిస్మిల్లాహ్ అని ఇంటి తలుపు మూసి వేయాలి

తినే, త్రాగే వస్తువులపై బిస్మిల్లాహ్ అని మూత వేయాలి.

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రబోధించారు. "పాత్రల్ని మూసి ఉంచండి. దీపాలు ఆర్పేయండి. ఎందుకంటే షైతాను బిగించబడి ఉన్న కూజాల్ని, మూయబడి ఉన్న తలుపుల్ని తెరువలేడు. మీ వద్ద మూయటానికి ఏమీ లభించకపోతే దానికి అడ్డంగా **'బిస్మిల్లాహ్'** అని ఒక చెక్కముక్క అయినా ఉంచండి....[11]

## 4. బోర్లా నిద్దురపోకూడదు

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఒకసారి ఇలా తెలియ జేశారు: "బోర్లా పడి పడుకుంటే అల్లాహ్ ఆగ్రహిస్తాడు." మరొక ఉల్లేఖనం ప్రకారం "నిశ్చయంగా బోర్లా పడి పడుకోవడం నరకవాసుల చేష్టలు."[13]

5. హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "మనిషి తన భార్యను పడక మీదకు పిలవగా ఆమె నిరాకరించినందుకు అతను ఆమె మీద అలిగిన స్థితిలో రాత్రి గడిపితే తెల్లవారే వరకూ దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు."[14]

## 6. పది సంవత్సరములు దాటిన పిల్లల పడకలు వేరు చెయ్యాలి

హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "మీ పిల్లల వయస్సు ఏడు సంవత్సరములు దాటితే వీరిని నమాజు ఆచరించమని ఆజ్ఞాపించండి. పది సంవత్సరాల తరువాత (కూడా వారు నమాజు పట్ల నిర్లక్ష్యం వహిస్తే) వారిని కొట్టండి. మరియు వారి (పది సంవత్సరాలు దాటితే) పడకలను వేరు చేయండి."[15]

## పడకపై చేరుకున్నప్పుడు :

**1. పుణ్యప్రదమైన నిద్ర :** ఒక వ్యక్తి నిద్ర పోవటం కారణంగా నూతన శక్తి

తిరిగి ప్రాప్తమవుతుంది. అల్లాహ్ ఆరాధనలు చేయటానికి అనుకూలంగా ఉంటుం దనీ చిత్తశుద్ధితో నిద్రపోతే, ఆ నిద్ర సమయం వ్యర్థం కాకుండా అతనికి పుణ్యాలు ప్రాప్తిస్తాయి.

హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజియల్లాహు అన్హు) గారు తన నిద్రను పుణ్యకార్యంగా భావించేవారు. ఎలాగైతే 'ఖియాముల్ లైల్' నమాజ్‌ను పుణ్య కార్యంగా భావిస్తారో. ఆయన ఇలా అనేవారు. **"ఫ అహ్తసిబు నౌమతీ కమా అహ్తసిబు ఖౌమతీ"** (నేను నా నిద్రను పుణ్యకార్యంగా భావిస్తాను, ఎలాగైతే నేను నా నమాజును పుణ్యకార్యంగా భావిస్తానో.)[16]

2. హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రబోధించారు.

**(إِذَا أَوَى أَحَدُكُمْ إِلَى فِرَاشِهِ فَلْيَنْفُضْ فِرَاشَهُ بِدَاخِلَةِ إِزَارِهِ فَإِنَّهُ لَا يَدْرِي مَا خَلَفَهُ عَلَيْهِ ثُمَّ يَقُولُ: بِاسْمِكَ رَبِّ وَضَعْتُ جَنْبِي وَبِكَ أَرْفَعُهُ إِنْ أَمْسَكْتَ نَفْسِي فَارْحَمْهَا وَإِنْ أَرْسَلْتَهَا فَاحْفَظْهَا بِمَا تَحْفَظُ بِهِ عِبَادَكَ الصَّالِحِينَ).**

"మీరు లేనప్పుడు మీ పడకల మీద ఏమొచ్చి చేరిందో మీకు తెలియదు. కనుక మీలో ఎవరయినా పడక మీద మేను వాల్చినప్పుడు ముందుగా తన లుంగీ లోపలి భాగంతో సహా పడకను దులుపుకోవాలి. ఆ తర్వాత ఈ విధంగా ప్రార్థిం చాలి. **"బిస్మిక రబ్బీ వజఅ్‌తు జమ్బీ, వ బిక అర్ఫవుహు, ఇన్ అమ్‌సక్త నఫ్సీ ఫర్ హమ్‌హా, వ ఇన్ అర్‌సల్తహా ఫహ్ ఫజ్‌హా బిమా తహ్ఫజు బిహి ఇబాదకస్ సాలిహీన్."**[17]

3. హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) పడక మీదకు (నిద్ర పోవటానికి) వెళ్ళినప్పుడు ముఅవ్వజాత్‌లు (**ఖుల్ హువల్లాహు అహద్-ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్-ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్**) పఠించి అరచేతుల్లో ఊదుకుని ఆ అరచేతులతో శరీరాన్ని స్పృశించుకునేవారు.[18]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రతి రోజూ రాత్రి (నిద్ర పోవటానికి) పడక మీదకు చేరుకున్నప్పుడు అరచేతులు కలిపి అందులో ఊదేవారు.

తర్వాత అరచేతుల్లోనే **"ఖుల్ హుల్లాహ్ అహద్-ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్-ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్"** సూరాలు పఠించి వాటితో వీలైనంత వరకు శరీరాన్ని స్పృశించుకునేవారు. ముందు తల, ముఖం, శరీర ఉదర భాగం నుండి స్పృశించటం మొదలుపెట్టేవారు. ఈ విధంగా మూడు సార్లు చేసేవారు.[19]

4. నిద్రపోక మునుపు వుజూ చేసుకుని కుడి ప్రక్కకు తిరిగి నిద్ర పోవాలి. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు. "నీవు నిద్ర పోదలచినప్పుడు నమాజు కోసం చేసే విధంగా వుజూ చెయ్యి, ఆ తరువాత (పడకపై) కుడి వైపునకు తిరిగి పడుకో" అని అన్నారు.[20]

5. కుడి చేతిని కుడి చెంప క్రింద పెట్టుకొని నిద్రపోవాలి. హజ్రత్ హఫ్సా (రజియల్లాహు అన్హా) గారు ఇలా తెలియజేశారు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నిద్ర పోదలుచుకున్నప్పుడు కుడి చేతిని కుడి చెంప క్రింద పెట్టుకొని ఇలా వేడుకునేవారు.

**"అల్లాహుమ్మ ఖినీ అజాబక యౌమ తుబ్అసు ఇబాదక."**

(ఓ అల్లాహ్! నీవు నీ దాసుల్ని తిరిగి బ్రతికించి లేపిన రోజున నన్ను నీ శిక్ష నుండి కాపాడు)[21]

## నిద్ర కొరకు పఠించబడే కొన్ని దుఆలు

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "ఏ వ్యక్తి అయినా అల్లాహ్‌ను స్మరించనటువంటి స్థలములో పడుకుంటాడో ఆ స్థలము అతనికి అల్లాహ్ తరపున నష్టాన్ని పొందుటకు కారణమవుతుంది.'[22]

1. **"బిస్మిక అల్లాహుమ్మ అమూతు వ అహ్యా'.**'[23]
2. **"అల్ హమ్దు లిల్లాహిల్లజీ అత్అమనా వ సఖానా వ కఫానా వ ఆవానా, ఫకమ్ మిమ్మన్ లా కాఫియ లహూ వలా ముఅ్వియ."**[24]
3. **"అల్లాహుమ్మ రబ్బుస్ సమావాతి వ రబ్బుల్ అర్ధి వ రబ్బుల్ అర్షిల్ అజీమ్, రబ్బునా వ రబ్బ కుల్ల షైయిన్, ఫాలిఖల్ హబ్బి వన్ నవా, వ మున్జిలిత్ తౌరాతి వల్ ఇన్‌జీలి వల్ ఫుర్ఖాని, అవూజు బిక మిన్ షర్రి కుల్లి షైయిన్ అన్త ఆఖిజున్ బినాసియతిహీ. అల్లహుమ్మ అన్తల్ అవ్వలు ఫలైస ఖబ్లక**

**షైవున్, వఅన్తల్ ఆఖిరు ఫలైస బాదక షైవున్, వ అన్తల్ బాతిను ఫలైస దూనక షైవున్, ఇఖ్జీ అన్నద్ దైన వ అగ్నినా మినల్ ఫఖ్రి."[25]**

4. **"అల్లాహుమ్మ ఫాతిరస్ సమావాతి వల్ అర్జ్, ఆలిమిల్ గైబి వష్షహాదతి, రబ్బ కుల్లషైయిన్ వ మలీకహు. అష్హదు అల్లా ఇలాహ ఇల్లా అన్త అవూజు బిక మిన్ షర్రి నఫ్సీ వ షర్రి షైతాని వ షిర్కిహీ."[26]**

5. **"అల్లాహుమ్మ అస్లమ్తు వజ్హీ ఇలైక వ ఫవజ్తు అమ్రీ ఇలైక వ అల్ జత్తుజహ్రీ ఇలైక, రగబతన్, వ రహ్బతన్ ఇలైక, లా మల్జఅ వలా మన్జా మిన్క ఇల్లా ఇలైక. అల్లాహుమ్మ ఆమన్తు బికితాబికల్లజీ అన్జల్త, వ బినబియ్యి కల్లజీ అర్సల్త."**

నీవు ఈ దుఆ పఠించి నిద్రపోయినప్పుడు రాత్రికి రాత్రే మరణం సంభవిస్తే, అప్పుడు నీవు సహజత్వం (ఇస్లాం ధర్మం) పై మరణించినట్లుగా పరిగణించబడ తావు. ఒకవేళ తెల్లవారిన తరువాత బ్రతికి ఉంటే అప్పుడు కూడా నీకు శుభం కలుగుతుంది.[27]

★ సూరతుల్ బఖర చివరి రెండు ఆయతులను పఠించాలి. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "ఎవరైతే రాత్రి పూట సూరతుల్ బఖరలోని చివరి రెండు ఆయతులు పఠిస్తే వారికి ఆ రాత్రంతా ఆ రెండు ఆయతులే చాలు."[28]

★ "చాలు" అంటే, ఆ రాత్రి జరగబోయే అవాంఛనీయ సంఘటనల నుండి రక్షణ పొందటానికి ఆ రెండు ఆయతులు చాలు" అని అర్థం అని కొంతమంది అన్నారు.

★ మరికొంత మంది : "ఆ రాత్రంతా నమాజ్ చేసినంత పుణ్యం లభించటానికి ఆ రెండు ఆయతులు పఠిస్తే చాలు" అని అభిప్రాయపడ్డారు.

*(హదీసు కిరణాలు)*

★ ఆయతుల్ కుర్సీ పఠించాలి. దీనిని పఠిస్తే, "అల్లాహ్ తరఫు నుండి ఒక పర్య వేక్షకుడు నియమించబడతాడు. తెల్లవారే వరకు షైతాన్ మీ దరిదాపులకు కూడా రాడు."[29]

★ సూరతుల్ కాఫిరూన్ పఠించాలి. ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) హజ్రత్ నౌఫల్ గారికి ఇలా తెలియజేశారు: నీవు "ఖుల్ యా అయ్యుహల్ కాఫిరూన్" సూరాను పఠించి నిద్రపో. అది షిర్క్ నుండి విముక్తినిస్తుంది."[30]

★ అల్లాహు అక్బర్ 34 సార్లు, **సుబ్హానల్లాహ్** 33 సార్లు, **అల్‌హమ్దు లిల్లాహ్** 33 సార్లు పఠించాలి.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) హజ్రత్ అలీ మరియు హజ్రత్ ఫాతిమా (రజియల్లాహు అన్హు) గారికి ఇలా తెలియజేశారు: "అవి (ఆ పదాలను పఠించే ఘనత) మీ ఇద్దరి వద్ద బానిస (ఉండడం) కంటే మేలైనది."[31]

## నిద్ర నుండి మేల్కొనే విధానం మరియు దుఆలు

(اسْتَيْقَظَ رَسُولُ اللَّهِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ فَجَعَلَ يَمْسَحُ النَّوْمَ عَنْ وَجْهِهِ بِيَدَيْهِ ثُمَّ قَرَأَ الْعَشْرَ الْآيَاتِ الْخَوَاتِمَ مِنْ سُورَةِ آلِ عِمْرَانَ).

1. ప్రవక్త ముహమ్మద్ (స) : "నిద్ర నుండి మేల్కొని, కూర్చొని తమ రెండు చేతులతో ముఖముపై ఉన్న నిద్రను రుద్దుకొని దూరం చేసేవారు. తరువాత సూరతు 'ఆలి ఇమ్రాన్' చివరి పది ఆయతులు పఠించేవారు."[32]
2. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నిద్ర నుండి మేల్కొన్నప్పుడు మిస్వాక్‌తో నోటిని బాగా తోమి శుభ్రం చేసుకునేవారు.[33]
3. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) (పడక) వద్ద నీటి పాత్రను మరియు మిస్వాక్‌ను ఉంచేవారు. ఆయనకు మెలకువ వస్తే మల, మూత్రాల అవసరాలను తీర్చుకొని ఆ తరువాత మిస్వాక్ చేసేవారు.

*(అబూదావూద్ : 56)*

4. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్ద మిస్వాక్ లేకుంటే నిద్రపోయేవారు కాదు. ఆయన నిద్ర నుండి మేల్కొంటే మిస్వాక్ చేయడం ఆరంభించేవారు.[34]
5. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నిద్ర నుండి మెలకువ వస్తే, కాలకృత్యాలు తీర్చుకుంటే, ముఖము మరియు చేతులు కడుక్కొని ఆ తరువాత నిద్రపోయేవారు.[35]

6. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా తెలియజేశారు: "ఎవరైతే నిద్ర నుండి మేల్కొంటే వారు వుజూ చేసేటప్పుడు మూడుసార్లు ముక్కులోకి నీళ్ళను ఎక్కించుకొని బాగా చీదాలి. ఎందుకంటే, షైతాన్ అతని ముక్కు రంధ్రాలలో రాత్రిని గడుపుతాడు."[36]

7. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "ఎవరైనా నిద్ర నుండి మేల్కొంటే నీళ్ళ పాత్రలో చేతులను ముంచక మునుపు తమ చేతులను కడుక్కోవాలి. ఎందుకంటే, నిద్రావస్థలో మీ చేతులు ఎలా నిద్రించాయో మీకు తెలియదుగా!"[37]

★ మీ చేతులు ఎలా నిద్రించాయో అంటే, నిద్ర మైకంలో మనిషి చేతులు మర్మాంగాలను తాకే అవకాశం ఉంటుంది. లేదా దురద కారణంగా శరీరాన్ని గోక్కోవటం కూడా జరుగుతుంది. అందుకని నిద్ర నుండి మేల్కొని చేతులు కడుక్కొని ఆ తరువాత నీళ్ళ పాత్ర నుండి నీటిని తీసుకుని ఇతర పనులు కూడా చేసుకోవాలి.

8. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: ఎవరైతే నిద్ర నుండి మేల్కొని: **"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహులా షరీక లహు, లహుల్ ముల్కు వలహుల్ హమ్దు వహువ అలా కుల్లి షైయిన్ ఖదీర్, అల్‌హమ్దు లిల్లాహి వసుబ్హానల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు, అల్లాహు అక్బర్ వలా హౌలా వలా ఖువ్వత ఇల్లా బిల్లాహి" తరువాత "అల్లాహుమ్మగ్ఫిర్లీ"** అంటే, లేక దుఆ చేస్తే- అతని దుఆ అంగీకరించబడు తుంది. ఆ తరువాత అతను వుజూ చేసి నమాజు చేస్తే, అతని నమాజు స్వీకరించబడు తుంది.[38]

9. **"అల్ హమ్దులిల్లాహిల్లజీ అహ్యానా బాదమా అమాతనా వ ఇలైహిన్ నూషూర్"**[39]

10. నిద్రలో భయపడి లేక బిత్తరపోయి నిద్ర నుండి మెలకువ వస్తే **"అవూజు బికలిమాతిల్లాహిత్ తామ్మాతి మిన్ గజబిహి, ఇఖాబిహి, వ షర్రి ఇబాదిహి, మిన్ హమజాతిష్ షయాతీని వ అయ్ యహ్జురూన్"** అని చదవండి.[40]

## కలలు కంటే ?

కలలో మనిషి భయంకరమైన, బాధాకరమైన, సంతోషకరమైన, ఉత్సాహకర మైన దృశ్యాలెన్నో చూస్తుంటాడు. కొన్నిసార్లు భవిష్యత్తులో జరగబోయే సంఘటనలు ముందుగానే కలలోకి రావటంలోనూ ఆశ్చర్యం లేదు. ప్రవక్తలకు వచ్చే కలలు నిజమయ్యేవి మరియు దైవ ప్రవక్తలకు కలల ఆధారంగా ఆదేశాలు కూడా ఇవ్వడం జరుగుతుంది. ఇకపోతే సామాన్య ప్రజలకు దైవభీతి గల ప్రజలకు వచ్చే కలలు నిజము కావచ్చు లేదా నిజం కాకపోవచ్చు. కలలో చూసినట్టుగా జరగనూవచ్చు మరియు అలా జరగకపోవచ్చును.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: ప్రళయం సమీపించే కాలంలో విశ్వాసికి వచ్చే కలలు సాధారణంగా అసత్యమైనవి కాజాలవు. ప్రవక్త పదవి (నబువ్వత్)లోని నలభై ఆరు భాగాలలో విశ్వాసికి వచ్చే కల కూడా ఒకటి.[41]

మరొక ఉల్లేఖనం ప్రకారం, "మీలో కలల విషయంలో అందరికన్నా సత్య వంతుడయినవాడే మాట్లాలోనూ అందరికన్నా సత్యవంతుడై ఉంటాడు."[42]

హజ్రత్ అబూ సయీద్ అల్ ఖుద్రీ (రజియల్లాహు అన్హు) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్తుండగా తాను విన్నానని ఇలా తెలియ జేశారు: "మీకు సంతోషకరమైన (మంచి) కలలు అల్లాహ్ తరపు నుండి వస్తాయి. కనుక అలాంటి కలలు వచ్చినప్పుడు అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఆ కల గురించి ఇతరులతో చెప్పుకోవాలి." వేరొక ఉల్లేఖనంలో, "తను ఇష్టపడే వారికి మాత్రమే చెప్పుకోవాలి." అని ఉంది.[43]

మీలో ఎవరయినా కలలో అవాంఛనీయమైన విషయమేదయినా చూస్తే, అది షైతాన్ తరపు నుండి వచ్చిందని గ్రహించాలి. కనుక అతను వాటి కీడు నుండి శరణు వేడుకోవాలి. దాని గురించి ఎవరితోనూ చెప్పుకోకూడదు. ఆ కల వల్ల అతనికి ఎలాంటి నష్టం జరగదు.[44]

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "నన్ను స్వప్నావస్థలో చూసిన వాడు త్వరలోనే (ప్రళయ దినాన) జాగృతావస్థలో కూడా నన్ను చూస్తాడు. లేక

అతను నన్ను జాగృతావస్థలో చూసినట్లు చూస్తాడు. ఎందుకంటే, షైతాన్ నా రూపంలో (కలలోకి) రాలేడు."[45]

## చెడు కలలు కంటే ?

1. మూడుసార్లు ఎడమ వైపునకు ఉమ్మివేయాలి.
2. 'తఅవుజ్' (అవూజు బిల్లాహి మినష్షైతా నిర్రజీమ్) అని చదవాలి.
3. కలలో కన్న చెడు కల నుండి అల్లాహ్ శరణు కోరాలి.
4. నిద్రించి ఉన్న ప్రక్కను వదలి తిరిగి వేరే ప్రక్కపై పడుకోవాలి.
5. ఎవరితోనూ ఆ కల గురించి చెప్పకూడదు.
6. అల్లాహ్ చిత్తమైతే ఆ చెడు కల ప్రభావం మనపై పడదు.
7. నిద్ర నుండి మేల్కొని రెండు రకాతుల నమాజు చేయడం మరింత మేలైనది.
8. కలలో బిత్తరపోయి లేచినప్పుడు ఇలా పఠించాలి
   **"అవూజు బికలిమాతిల్లాహిత్ తామ్మాతి మిన్ గజబిహి వ షర్రి ఇబాదిహి వ మిన్ హమజాతిష్ షయాతీని వ అయ్ యహ్జురూన్."**[46]

## అబద్ధపు కలలు చెప్పుకోవటం

కొంతమంది ప్రజలు కలలు కనకపోయినా కన్నట్లు అబద్ధపు కలలను ప్రచారం చేస్తుంటారు. వాటి కారణంగా అమాయక ప్రజలను వివిధ రకాలుగా మోసగిస్తుంటారు. అలా అబద్ధపు కలలు ప్రచారం చేసుకోవటం కూడా మహా పాపమే అవుతుంది.

హజ్రత్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఈ విధంగా ప్రవచించారు "అన్నిటికంటే పెద్ద అబద్ధమేమిటంటే మనిషి కలలో చూడని దాన్ని చూశానని చెప్పటం."[47]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "ఎవరయితే తాను చూడని కల గురించి చూశానని అబద్ధం చెప్పాడో అతన్ని (ప్రళయ దినాన) రెండు బార్లి గింజల మధ్య ముడి వేయమని ఆజ్ఞాపించటం జరుగుతుంది. కాని అతను ఎన్నటికీ ఆ పని చేయలేడు."[47]

---

1. *(సూరతుర్ రూమ్ : 23)*
2. *(సూరతుజ్ జుమర్ : 42)*

3. *(అల్ అన్ఆమ్ : 60)*
4. *(సహీహ్ బుఖారీ : 560)*
5. *(సహీహ్ బుఖారీ : 205, సహీహ్ ముస్లిం : 1309)*
6. *(సహీహ్ బుఖారీ : 353, సహీహ్ ముస్లిం : 1026)*
7. *(సహీహ్ బుఖారీ : 3030, సహీహ్ ముస్లిం : 1293)*
8. *(సహీహ్ బుఖారీ : 1074, సహీహ్ ముస్లిం : 1295)*
9. *(సహీహ్ అబూదావూద్ : 2606)*
10. *(సహీహ్ అబూదావూద్ : 5041)*
11. *(సహీహ్ బుఖారీ : 5193)*
12. *(సహీహ్ ముస్లిం : 3756)*
13. *(సహీహ్ తిర్మిజీ : 2768, సహీహ్ ఇబ్నుమాజా : 3724)*
14. *(సహీహ్ బుఖారీ : 2998, సహీహ్ ముస్లిం : 2596)*
15. *(సహీహ్ అబూదావూద్ : 495)*
16. *(సహీహ్ బుఖారీ : 3996)*
17. *(సహీహ్ బుఖారీ : 5845, సహీహ్ ముస్లిం : 4889)*
18. *(సహీహ్ బుఖారీ : 5307)*
19. *(సహీహ్ బుఖారీ : 4630)*
20. *(సహీహ్ బుఖారీ : 239, సహీహ్ ముస్లిం : 4884)*
21. *(సహీహ్ అబూదావూద్ : 5059)*
22. *(సహీహ్ అబూదావూద్ : 5059)*
23. *(సహీహ్ బుఖారీ : 5849, సహీహ్ ముస్లిం : 4886)*
24. *(సహీహ్ ముస్లిం : 4890)*
25. *(ముస్తద్రక్ లిల్ హాకిమ్ :2002, సహీహ్ కలిముత్ తయ్యిబ్ లిల్ అల్బానీ : 41)*
26. *(సహీహ్ అబూదావూద్ : 5067)*
27. *(సహీహ్ బుఖారీ : 239, సహీహ్ ముస్లిం : 4884)*
28. *(సహీహ్ బుఖారీ : 3707, సహీహ్ ముస్లిం : 1340)*
29. *(సహీహ్ బుఖారీ : 3033)*

30. *(సహీహ్ అబూదావూద్ : 5055)*
31. *(సహీహ్ బుఖారీ : 3429, సహీహ్ ముస్లిం : 3906)*
32. *(సహీహ్ బుఖారీ : 4205)*
33. *(సహీహ్ బుఖారీ : 238, సహీహ్ ముస్లిం : 374)*
34. *(ముస్నద్ అహ్మద్ : 5707, సిల్‌సిలతుస్ సహీహా : 2111)*
35. *(సహీహ్ బుఖారీ : 5841, సహీహ్ ముస్లిం : 459)*
36. *(సహీహ్ బుఖారీ : 3052)*
37. *(సహీహ్ బుఖారీ : 157)*
38. *(సహీహ్ బుఖారీ : 1086)*
39. *(సహీహ్ బుఖారీ : 5837, సహీహ్ ముస్లిం : 4886)*
40. *(సహీహ్ తిర్మిజీ : 3528)*
41. *(సహీహ్ బుఖారీ : 6499, సహీహ్ ముస్లిం : 4200)*
42. *(సహీహ్ ముస్లిం : 4200)*
43. *(సహీహ్ బుఖారీ : 6470, సహీహ్ ముస్లిం : 4197)*
44. *(సహీహ్ బుఖారీ : 6470, సహీహ్ ముస్లిం : 4197)*
45. *(సహీహ్ బుఖారీ : 6478, సహీహ్ ముస్లిం : 4206)*
46. *(సహీహ్ అబూదావూద్ : 3893)*
47. *(సహీహ్ బుఖారీ : 6521)*
48. *(సహీహ్ బుఖారీ : 6520)*



# 13. వివాహ విధానం మరియు దాని ప్రాముఖ్యత

మానవ సమాజం అతి గౌరవప్రదమైన సమాజం. సిగ్గు, బిడియంతో కూడుకున్న సమాజం. కనుక మానవ సమాజంలో వివాహ సంబంధాల పట్ల అనేక జాగ్రత్తలు పాటిస్తారు. వివాహం లేకుండా ఆడ, మగ కలసిమెలసి ఉండటం సామాజికపరంగా మరియు ధర్మపరంగా తప్పు, నీచాతినీచమైన కార్యంగా మరియు ఘోరమైన పాపంగా నమ్ముతారు.

ప్రతి మానవుడిలో మంచీ చెడులు ఉంటాయి. **ఎవరైతే మంచిని మరియు మేలును కోరుకుంటాడో, అతడు మంచి మార్గాన్ని అన్వేషిస్తాడు. ఎవరైతే చెడును కోరుకుంటాడో, అతడు దానివైపే మొగ్గు చూపుతాడు.** సద్గుణాలు కలిగిన ప్రజలు మంచి ప్రోత్సహిస్తారు. మరియు మంచిని చేయాలంటూ ప్రచారం కూడా చేస్తారు.

ప్రియ ప్రజలారా! మానవ సమాజంలో మంచి అనుబంధాల కొరకై కొన్ని నియమాలు, నిబంధనలు ఉన్నాయి. ఆ కోవకు చెందిన వాటిలోనే వివాహం కూడా ఒకటి. **మనిషి జీవితంలో వివాహానికి కూడా కొన్ని ప్రత్యేకమైన నిబంధనలు ఉన్నాయి.** ఆ నిబంధనలను పాటిస్తూ, మానవ గౌరవ సంబంధాలను పవిత్రమైన స్థాయికి పెంచుకోవటం జరుగుతుంది.

ప్రజలు తమ మత విశ్వాసాలకు, విధి, విధానాలకు అనుగుణంగా నడచు కుంటారు. కనుక ధర్మ పరిధిలో వివాహానికి ప్రత్యేకమైన నియమాలు ఉన్నాయి. ఆ నియమాలు పాటించకుండా స్త్రీ, పురుషులు సహజీవనం చేయడం దాదాపు ప్రతి ధర్మానికి చెందిన ప్రజలు తప్పుగానే భావిస్తారు. **(అవివాహిత సంబంధానికి సమాజంలో ఎలాంటి మర్యాదలు లేక ఎలాంటి చట్టాలు ఇంతవరకు లేవు) ఎందుకంటే, అది మానవుని గొప్పతనాన్ని దిగజార్చే హీనమైన కార్యం.** దీనికి భిన్నంగా వివాహం అనేది ప్రతి యుగంలో గౌరవప్రదమైన ఒక గొప్ప విధానం. అది సమాజ మర్యాదలకు గొప్ప కిరీటం. బంధుత్వ బంధాలకు గట్టి పునాది. సుఖ శాంతులతో జీవనం గడుపుటకు, పరస్పరం పవిత్రమైన విశ్వాసాలకు, నమ్మకాలకు ఆయువుపట్టు. ప్రేమానురాగాలను అతి పవిత్రంగా పంచుకొనుట కొరకు మర్యాద

పూర్వకమైన, పవిత్రమైన ఏకైక మార్గం వివాహం అనేది నగ్న సత్యం.

ఈ గొప్ప కార్యం గురించి స్వయంగా అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(وَمِنْ آيَاتِهِ أَنْ خَلَقَ لَكُمْ مِنْ أَنْفُسِكُمْ أَزْوَاجًا لِتَسْكُنُوا إِلَيْهَا وَجَعَل بَيْنَكُمْ مَوَدَّةً وَرَحْمَةً إِنَّ فِي ذَلِكَ لَآيَاتٍ لِقَوْمٍ يَتَفَكَّرُونَ).

"ఆయన (అల్లాహ్) సూచనలలో మరొకటి ఏమిటంటే, ఆయన మీ కొరకు భార్యలను మీ జాతిలో నుండే సృష్టించాడు. మీరు వారి ద్వారా శాంతిని పొందటానికి, అలాగే ఆయన మీ మధ్య ప్రేమను, కారుణ్యాన్ని సృష్టించాడు. నిశ్చయంగా ఆలోచనాపరులకు ఇందులో ఎన్నో సూచనలున్నాయి."[1]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు:

(يَا مَعْشَرَ الشَّبَابِ مَنْ اسْتَطَاعَ الْبَاءَةَ فَلْيَتَزَوَّجْ فَإِنَّهُ أَغَضُّ لِلْبَصَرِ وَأَحْصَنُ لِلْفَرْجِ وَمَنْ لَمْ يَسْتَطِعْ فَعَلَيْهِ بِالصَّوْمِ فَإِنَّهُ لَهُ وِجَاءٌ).

"ఓ యువకులారా! మీలో వివాహం చేసుకునే స్తోమతను కలిగియున్న వ్యక్తి వివాహం చేసుకోవాలి. ఎందుకంటే, ఇది (వివాహం) చూపును క్రిందికి మరలించేది, మర్మాంగాన్ని పరిరక్షించేది. వివాహం చేసుకునే స్తోమతను కలిగియుండని వ్యక్తి తరచుగా ఉపవాసాలుండాలి. ఎందుకంటే, అది అతడి కొరకు (పాపాల నుంచి రక్షణ కొరకు) డాలు వంటిది."[2]

మన సమాజంలో యువతీయువకులు ఒక ఉన్నతమైన స్థాయికి చేరుకునే వరకు వివాహాలు చేసుకోరు. వారికి ఆర్థిక ఇబ్బంది, పేదరిక భయం వెంటాడుతూ ఉంటుంది. అందువలన అలాంటివారు వివాహానికి దూరంగా ఉంటారు. కాని అలా భయపడవలసిన అవసరం లేదని అల్లాహ్ ఖుర్ఆన్ గ్రంథంలో ఇలా తెలియజేశాడు:

(وَأَنْكِحُوا الْأَيَامَى مِنْكُمْ وَالصَّالِحِينَ مِنْ عِبَادِكُمْ وَإِمَائِكُمْ إِنْ يَكُونُوا فُقَرَاءَ يُغْنِهِمُ اللَّهُ مِنْ فَضْلِهِ وَاللَّهُ وَاسِعٌ عَلِيمٌ).

"మీలో వివాహం కాకుండా ఉన్న స్త్రీ, పురుషులకు వివాహం చెయ్యండి. అలాగే మంచి నడవడిక గల మీ బానిసలకు, బానిస స్త్రీలకు కూడా

వివాహం జరిపించండి. ఒకవేళ వారు పేదవారై ఉంటే అల్లాహ్ తన అనుగ్రహంతో వారిని ధనవంతులుగా చేస్తాడు. అల్లాహ్ విశాల సంపన్నుడు, సమస్తమూ తెలిసినవాడు."[3]

## ఉత్తమురాలయిన భార్య విశిష్టత

దైవ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు:

(الدُّنْيَا مَتَاعٌ وَخَيْرُ مَتَاعِ الدُّنْيَا الْمَرْأَةُ الصَّالِحَةُ) "ప్రపంచం సమస్తం జీవన సామగ్రి. ఈ ప్రపంచ సామగ్రిలో అన్నిటికంటే ఉత్తమమైన వస్తువు పుణ్య స్త్రీ (భార్య)."[4]

మరొక హదీసులో ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు:

("مَا اسْتَفَادَ الْمُسْلِمُ فَائِدَةً بَعْدَ تَقْوَى اللَّهِ تَعَالَى خَيْرًا لَهُ مِنْ زَوْجَةٍ صَالِحَةٍ، إِنْ أَمَرَهَا أَطَاعَتْهُ، وَإِنْ نَظَرَ إِلَيْهَا سَرَّتْهُ، وَإِنْ أَقْسَمَ عَلَيْهَا أَبَرَّتْهُ، وَإِنْ غَابَ عَنْهَا نَصَحَتْهُ فِي نَفْسِهَا").

"విశ్వాసి దైవభీతి తర్వాత మంచి భార్యను మించిన ఉత్తమ వస్తువును పొందలేదు. భర్త ఆదేశిస్తే ఆ ఆజ్ఞను పాటిస్తుంది. భర్త తనవైపు చూసినప్పుడు భర్తను సంతోషపరుస్తుంది, భర్త ఆమె విషయంలో ఎదయినా ప్రమాణం చేసినట్లయితే ఆమె అతడి ప్రమాణాన్ని నెరవేర్చడంలో సహకరిస్తుంది, అలాగే తన మానాభిమానాలనూ సంరక్షించుకుంటుంది."[5]

మరొక చోట ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు:

(تُنْكَحُ الْمَرْأَةُ لِأَرْبَعٍ لِمَالِهَا وَلِحَسَبِهَا وَلِجَمَالِهَا وَلِدِينِهَا فَاظْفَرْ بِذَاتِ الدِّينِ تَرِبَتْ يَدَاكَ).

స్త్రీని నాలుగు అంశాల ప్రాతిపదికన వివాహమాడడం జరుగుతుంది.

ఒకటి : ఆమె సంపద ప్రాతిపదికన.

రెండు : ఆమె వంశం ప్రాతిపదికన.

మూడు : ఆమె సౌందర్యం ప్రాతిపదికన.

నాలుగు : ఆమె ధర్మనిష్ఠ ప్రాతిపదికన.

“మీ చేతులకు మట్టి అంటుకోనుగాక! మీరు ధర్మనిష్ఠపరులైన స్త్రీలని వివాహ మాడండి.”[6]

పైన పేర్కొనబడిన హదీసు ఆధారంగా ధర్మ నిష్ఠత విషయంలో ప్రేమాను రాగాల మూలంగా స్త్రీ పురుషులు సమానులే. ఎందుకంటే, ఖుర్‌ఆన్ గ్రంథంలో అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(الْخَبِيثَاتُ لِلْخَبِيثِينَ وَالْخَبِيثُونَ لِلْخَبِيثَاتِ وَالطَّيِّبَاتُ لِلطَّيِّبِينَ وَالطَّيِّبُونَ لِلطَّيِّبَاتِ)

“అపవిత్ర స్త్రీలు అపవిత్ర పురుషులకు తగినవారు. అపవిత్ర పురుషులు అపవిత్ర స్త్రీలకు తగినవారు. (అలాగే) పవిత్ర స్త్రీలు పవిత్ర పురుషులకు తగినవారు. పవిత్ర పురుషులు పవిత్ర స్త్రీలకు తగినవారు.”[7]

మరొక చోట అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(الزَّانِي لَا يَنْكِحُ إِلَّا زَانِيَةً أَوْ مُشْرِكَةً وَالزَّانِيَةُ لَا يَنْكِحُهَا إِلَّا زَانٍ أَوْ مُشْرِك وَحُرِّمَ ذَلِكَ عَلَى الْمُؤْمِنِينَ).

“వ్యభిచారి అయిన పురుషుడు వ్యభిచారం చేసే స్త్రీని లేక ముష్రిక్కు స్త్రీని తప్ప మరెవరినీ వివాహమాడలేడు. అలాగే వ్యభిచారానికి పాల్పడే స్త్రీ కూడా వ్యభిచారం చేసే పురుషుడిని లేక ముష్రిక్కు మగాణ్ణి తప్ప వేరితరులను మనువాడ జాలదు, విశ్వాసుల కొరకు ఇది నిషేధించబడింది.”[8]

ఈ వాక్యం యొక్క భావం ఏమిటంటే, అడ్డదారులు తొక్కేవారు తమలాంటి జీవిత భాగస్వాములనే ఇష్టపడతారు. అలాగే ఇస్లాం ఈ సందర్భంగా ముస్లింలను అప్రమత్తం చేయదలచింది.

వ్యభిచారం పరమ నీచమైన పాపకార్యం. అందువలన వ్యభిచారులతో వైవాహిక సంబంధాలు ఖాయం చేసుకోవటం కూడా నిషిద్ధమే. ఇమామ్ షౌకానీ (రహ్మ) ఈ అభిప్రాయం వైపు మొగ్గుచూపారు. హదీసుల ద్వారా కూడా ఈ అభిప్రాయానికి సమర్థన లభిస్తుంది.

వ్యభిచారిణులైన స్త్రీలను వివాహమాడటానికి కొంతమంది ప్రవక్త సహచరులు (రజి) అనుమతి కోరగా ఈ ఆయతు అవతరించింది. అంటే, అలా

చేయరాదని వారికి తాకీదు ఇవ్వబడింది. దీని ఆధారంగానే పండితులేమన్నారంటే, **ఒక మగాడు ఒక ఆడదానితో అక్రమ సంబంధం పెట్టుకున్నా లేక ఒక ఆడది ఒక మగాడితో వ్యభిచరించినా వారిద్దరూ పరస్పరం నికాహ్ చేసుకోవటం సమ్మతం కాదు. అయితే వారిద్దరూ బాహాటంగా, చిత్తశుద్ధితో పశ్చాత్తాపం చెంది, భవిష్యత్తులో పవిత్ర జీవితం గడపదలిస్తే అట్టి పరిస్థితిలో వారి మధ్య నికాహ్ (వివాహం) ధర్మ సమ్మతం అవుతుంది.**[9]

## సహజీవనం లేక ధర్మేతరులతో వివాహాలు నిషిద్ధం

ఇస్లామీయ విధి విధానాలను గమనిస్తే స్త్రీ, పురుషుల వివాహేతర సంబంధాలకు అసలు తావే లేదు. మనిషి వివాహం చేసుకోవలసినప్పుడు సద్గుణాలు కలవారిని, దైవభీతి కలిగినవారిని చేసుకోవాలి .

అందచందాలతో, సిరిసంపదలతో, చురకుదనంతో, తెలివితేటల (కుట్రలు కుతంత్రాల)తో కనిపించే స్త్రీల పట్ల వ్యామోహానికి గురై ఇహపర సాఫల్యాలను నాశనం చేసుకోకూడదని దైవాజ్ఞల ద్వారా తెలుస్తున్నది.

కాని మన సమాజంలో చాలా మంది యువతీయువకులు మేజర్ కాక ముందే, వారికి మంచీ చెడుల అవగాహన రాకముందే, తమ జీవితాలను నాశనం చేసుకుంటున్నారు.

విధి విధానాలు లేని, ధర్మ పట్టింపులు లేని, హద్దులు తెలియని జీవితాల వెంట పరుగులు తీస్తున్నారు. సినిమాలలో నటించే కళాకారుల జీవితాలకు అనుగుణంగా, అంటే, హీరో, హీరోయిన్ల బాటను, మోడల్స్ వేసుకుని అర్ధనగ్నపు దుస్తులు ధరించి, చెట్టాపట్టాలు వేసుకుని, షికార్లు చేస్తూ గుణహీనులుగా తయారవుతున్నారు. పార్టీల పేరున హోటళ్లకు, క్లబ్బులకు వెళ్ళి పగలనక, రేయనక తిరుగుతూ పవిత్రమైన, గౌరవప్రదమైన తమ జీవితాలను కించపరచుకోవడమే కాకుండా, తమ బంగారు భవిష్యత్తును చేజేతులా నాశనం చేసుకుంటున్నారు.

కొంత మంది ప్రజలు ఇస్లాం ధర్మంకంటే మమతానురాగాలు గొప్పవని తమ ఇష్టానుసారంగా ఎవరిని పడితే వారిని ప్రేమించుకోవడం, వివాహాలు చేసుకోవడం జరుగుతున్నది. దానికోసం నీతి, నిజాయితి, సద్గుణాలు, దుర్గుణాలు, ధర్మం, అధర్మం, కుటుంబ మాన మర్యాదలను లెక్క చెయ్యకుండా, తమ మనో

వాంఛలకు ఆకర్షితులై ఇష్టమైన వారిని ప్రేమించి వివాహమాడడమే తమ జీవితానికి స్వాతంత్ర్యంగా భావిస్తున్నారు.

టీనేజ్ వయస్సులో ఉన్న యువతీయువకులు సినీ కళాకారులకు ప్రభావితులై, వారి జీవితాలను ఉపమానంగా తీసుకుని అధర్మమైన రీతిలో జీవిస్తున్నారు. అధిక శాతం సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు మరియు హాస్టళ్లలో నివసించేవారు తల్లిదండ్రులకు దూరమై ఉద్యోగాలు చేయడం వల్ల సహజీవనా (వ్యభిచారా)నికి అలవాటు పడు తున్నారు. ఇలాంటి అనేకమైన కారణాల వలన చెడు సంస్కృతి మన సమాజంలో పెరిగిపోయింది.

ప్రియమైన ప్రజలారా! ఇస్లాం ధర్మం సహజీవనానికి అనుమతించదు. ఎందుకంటే, మానవ సంబంధాల విషయంలో ఇస్లామీయ ధర్మాన్ని అనుసరించి నడచుకోవడమే ఒక నిజమైన ముస్లిం కర్తవ్యం. ఇస్లామేతర మార్గాలను అనుసరిం చడం పూర్తిగా ధర్మవిరుద్ధమైనది. కనుక ఇస్లాం ధర్మానికి వ్యతిరేకంగా వ్యవహరించే వారు అతను ఎంతటివాడైనా సరే! ఇస్లాం మార్గాన్నుండి పూర్తిగా తప్పిపోయినట్లే.

అల్లాహ్ ఖుర్ఆన్ గ్రంథంలో ఇలా తెలియజేశాడు :

**“అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తా, ఏ వ్యవహారంలోనైనా ఒక తీర్పు ఇచ్చిన తరువాత దాని గురించి విశ్వాసులుగా ఉన్న ఏ స్త్రీ, పురుషునికి ఆ తీర్పులో స్వయంగా వేరే నిర్ణయాలు తీసుకునే అధికారం లేదు. ఎవరైనా అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు అవిధేయతను పాటిస్తే వారు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిపోతారు.”**[10]

అల్లాహ్ ఇలా తెలియజేశాడు: “దైవానికి భాగస్వామ్యం కల్పించే (ముష్రిక్) స్త్రీలు విశ్వసించి ముస్లింలు కానంతవరకూ మీరు వారిని వివాహమాడకండి. దైవా నికి భాగస్వామ్యం కల్పించే స్వతంత్ర స్త్రీ మీకు ఎంతగా నచ్చినప్పటికీ **ఆమెకన్నా అల్లాహ్‌ను విశ్వసించే ఒక బానిస స్త్రీ ఎంతో ఉత్తమురాలు.** (అలాగే) షిర్కుకు ఒడిగట్టే పురుషులు విశ్వసించనంతవరకూ మీ స్త్రీలను వారి వివాహ బంధంలోకి ఇవ్వకండి. ఎందుకంటే, షిర్కుకు పాల్పడే పురుషుడు మీకు నచ్చినప్పటికీ అతనికంటే విశ్వసించిన ఒక బానిస పురుషుడు ఎన్నో రెట్లు నయం. మీరు (మిమ్మల్ని) నరకం వైపునకు పిలుస్తున్నారు. కాని అల్లాహ్ తన అనుజ్ఞతో స్వర్గం వైపునకూ, క్షమాభిక్ష

వైపునకూ పిలుస్తున్నాడు. ప్రజలు గుణపాఠం నేర్చుకునేందుకు గాను ఆయన తన ఆయతుల (ఆదేశాల)ను విడమరచి మరీ చెబుతున్నాడు."[11]

## వివాహం కొరకు నిషేధించబడిన స్త్రీల వివరాలు

1. తల్లులు, 2. కుమార్తెలు, 3. అక్కాచెల్లెళ్ళు, 4. మేనత్తలు, 5. పెద్దమ్మ, పిన్నమ్మలు, 6. సోదర కుమార్తెలు, 7. మేనకోడళ్ళు 8. అఖ్యాఫి అక్కాచెల్లెళ్లు : (తల్లి ఒక్కటే అయి ఉండి తండ్రులు మాత్రం వేర్వేరుగా ఉన్నవారు) 9. అల్లాతి అక్కాచెల్లుళ్ళు : (తండ్రి ఒక్కడే అయి ఉండి తల్లులు మాత్రం వేర్వేరుగా ఉన్నవారు). 10. రెండేళ్ల లోపు వయస్సులో మీరు పాలు త్రాగిన స్త్రీలు, 11. పాలు వరుసగా ఉన్న అక్కా చెల్లెళ్లు, 12. భార్యల తల్లులు (అత్తలు) 13. మీ భార్యల మాజీ భర్తల కూతుళ్ళు 14. ఏకకాలంలో అక్కా చెల్లెళ్ళిద్దరినీ భార్యలుగా చేసుకోవటం.[12]

## అమ్మాయి సంరక్షకుని అంగీకారం

ఇస్లాం ధర్మంలో స్త్రీలు ఎవరి ఆధీనంలో ఉంటారో వారి అంగీకారం కూడా వివాహానికి తప్పనిసరి షరతు. కనుక ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా తెలియజేశారు: "**ఏ స్త్రీ వివాహము వలీ (సంరక్షకుడు అంటే, తండ్రి, కొడుకు, అన్న లేక తమ్ముడు లేక బాబాయి వంటి బంధువుల) అనుమతి లేకుండా జరగదు.** ఎవరికైతే వలీ అనేవాడు లేడో ఆమె కొరకు వలీగా అధికారి (ఆ ఊరుకు చెందిన అధికారి లేక ఖాజీ) అవుతాడు."[13]

హజ్రత్ ఆయిషా (రజి) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా హెచ్చరించారు:

**(أَيُّمَا امْرَأَةٍ نَكَحَتْ بِغَيْرِ إِذْنِ وَلِيِّهَا فَنِكَاحُهَا بَاطِلٌ فَنِكَاحُهَا بَاطِلٌ فَنِكَاحُهَا بَاطِلٌ فَإِنْ دَخَلَ بِهَا فَلَهَا الْمَهْرُ بِمَا اسْتَحَلَّ مِنْ فَرْجِهَا فَإِنْ اشْتَجَرُوا فَالسُّلْطَانُ وَلِيُّ مَنْ لَا وَلِيَّ لَهُ).**

"**ఏ స్త్రీ అయితే తనవలీ (సంరక్షకుని) అనుమతి పొందకుండా వివాహం చేసుకుంటుందో, ఆమె వివాహం అధర్మం. ఆమె వివాహం అధర్మం, ఆమె వివాహం అధర్మం**" అని అన్నారు.

హజ్రత్ ఆయిషా (రజి) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ

సల్లం) ఇలా ప్రవచించారు: **"ఏ ఒక్కరి వివాహమూ ఒక వలీ (సంరక్షకుడు) మరియు ఇద్దరు సాక్షులు లేనిదే జరగదు."**[14]

పైన ఇవ్వబడిన హదీసులలో ఉన్న ఆదేశాల ప్రకారం సహజీవనం లేక స్త్రీల కొరకు 'వలీ' అంగీకారం లేకుండా స్వయాన వివాహం చేసుకోవడం వంటి విధానాలు ఇస్లామీయ ధర్మ ప్రకారం నిషిద్ధం అని స్పష్టమవుతున్నది. కనుక అమ్మాయి ఇంటి నుండి పారిపోయి వివాహం చేసుకుంటే అది **ధర్మపరంగా ఎంత ఘోరమైన పాపం అవుతుందో? ఆలోచించాలి. మీరు ఎదిగివచ్చిన వయస్సులో వేసే తప్పటడుగు తల్లిదండ్రులను ఎంత బాధకు, ఆవేదనకు గురిచేస్తుందో ఒకటికి వందసార్లు ఆలోచించదగిన విషయం.**

## వధూవరుల అంగీకారం

ఎవరికి వివాహం జరుగుతుందో వారు పరస్పరం మనసారా అంగీకరించిన తరువాతే వారి వివాహం ధర్మపరంగా అంగీకరించబడుతుంది. కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు:

(فَلَا تَعْضُلُوهُنَّ أَنْ يَنْكِحْنَ أَزْوَاجَهُنَّ إِذَا تَرَاضَوْا بَيْنَهُمْ بِالْمَعْرُوفِ).

"తమ భర్తలను ధర్మబద్ధంగా పరస్పరం ఇష్టపడి వివాహం ఆడదలిస్తే మీరు వారికి అడ్డు తగలకండి."[15]

వివాహ అంగీకార విషయంలో వధూవరుల తల్లిదండ్రులు మొండిగా మసలుకోకూడదు. వధూవరుల మనోభావాలను తల్లిదండ్రులు అర్థం చేసుకోవాలి. ఒకవేళ అమ్మాయికి చెందిన సంరక్షకుడు అమ్మాయి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా బలవంతంగా ఎవరికో ఒకరికి కట్టబెట్టే ప్రయత్నాలు చేయకూడదు. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**"వివాహిత (వితంతువు లేక విడాకులు తీసుకున్న) స్త్రీ అంగీకారం లేకుండా వివాహం చేయరాదు. మరియు కన్య స్త్రీ అంగీకారం లేకుండా వివాహం చేయరాదు."** అక్కడున్నవారు, "కన్య స్త్రీ (బిడియం కారణంగా) అంగీకారం ఎలా తెలుపుతుంది? అని ప్రవక్త (స) **గారిని అడిగారు. దానికి ఆయన (స) :** "ఆమె మౌనమే అంగీకారానికి చిహ్నం" అని అన్నారు.[16]

అదే విధంగా సంరక్షకుడు మూర్ఖునిగా ప్రవర్తిస్తూ, స్త్రీ బాగోగులకు బదులు తన స్వప్రయోజనాలకే ప్రాధాన్యతనిస్తున్నట్లయితే న్యాయస్థానం అటువంటి సంరక్షకుని హక్కును రద్దు చేస్తుంది. ఆ తర్వాత ఆ సంరక్షకుని తదనంతరం ఆమెకు బాధ్యత వహించే వ్యక్తి పర్యవేక్షణలోగాని లేక స్వయంగా తన పర్యవేక్షణలో గాని ఆమె నికాహ్ జరిపిస్తుంది. **"సంరక్షకులు పరస్పరం తగవు పడితే న్యాయస్థానం సంరక్షణా బాధ్యతలు స్వీకరిస్తుంది."**[17]

అదే విధంగా వధువు తన ఇష్టంగా ఇతర మతస్తుణ్ణి లేక గుణహీనుడిని వివాహం చేసుకోవాలనుకుంటే ఆమె వివాహం అలాంటి వారితో జరగనివ్వకుండా అడ్డుపడే హక్కు సంరక్షకునికి ఉంది. అలాంటి వారితో వివాహం జరపకూడదు. ఒకవేళ ఆమెకు వివాహం లేకుండా జీవితాంతం ఇంట్లో కూర్చున్నాసరే.

## వివాహ విధానం

వివాహం జరపాలంటే దానికి కొన్ని షరతులు ఉన్నాయి:

(1) 1. వరుడు 2. వధువు 3. వలీ (సంరక్షకుడు)

(2) వధూవరుల అంగీకారం ఉండాలి. వారి మధ్యలో ధర్మపరంగా నిషేధింపబడిన చుట్టరికం ఉండకూడదు. (అక్క, చెల్లి కూతురు వంటి చుట్టరికం లేక ధర్మేతరులు)

(3) వధూవరులు నోటితో అంగీకారం తెలపాలి.

(వివాహం చేయించే వారు: నేను ఫలానా అమ్మాయి వివాహం మీతో జరిపాను, అది మీకు ఇష్టమేనా, అని అంటే, అతను: నాకు ఇష్టమే అని అనడం) అలా అంగీకారం తెలిపినప్పుడు వివాహం నెరవేరుతుంది.

(4) వధూవరులు మూగవారయితే సంజ్ఞల ద్వారా అంగీకారం తెలపాలి.

(5) ఏ సమయంలో అయినా, ఎక్కడయినా, బహిష్టు వ్యవస్థలో అయినా, పరిశుద్ధ వ్యవస్థలో అయినా వివాహం జరుపవచ్చును.

(6) ముహ్రిం (హజ్ దీక్షలో) ఉండగా మరియు ఇద్దత్ (విడాకుల వలన లేక భర్త చనిపోవడం వలన ఉండవలసిన గడువు) సమయంలో వివాహం చేయరాదు.

# వివాహం కొరకు చదవబడే ఖుత్బా

దీనిని **"ఖుత్బతుల్ హాజా"** అని కూడా అంటారు. ప్రతి శుభ సందర్భంలో ఇలాంటి పదాలను ప్రవక్త ముహమ్మద్ (స) పఠించేవారు.

**ఇన్నల్‌హమ్ద లిల్లాహ్!** నహ్‌మదుహు, వ నస్‌తయీనుహు వ నస్‌తగ్ ఫిరుహు, వ నవూజుబిల్లాహి మిన్ షురూరి అన్‌ఫుసినా, వ మిన్ సయ్యిఆతి ఆమాలినా మన్ యహ్‌దిహిల్లాహు ఫలా ముదిల్ల లహూ, వ మన్ యుద్లిల్ ఫలా హాదియ లహు, అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహు లా షరీకలహు వ అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహు).

(యా అయ్యుహల్లదీన ఆమనుత్త ఖుల్లాహ హఖ్ఖ తుఖాతిహి వలా తమూ తున్న ఇల్లా వ అన్తుమ్ ముస్లిమూన్)

(యా అయ్యుహన్నా సుత్తఖూ రబ్బకుముల్లదీ ఖలఖకుమ్ మిన్ నఫ్సిన్ వాహిదతిన్ వ ఖలఖ మిన్‌హా జవ్‌జహా వ బస్స మిన్‌హుమా రిజాలన్ కసీరన్ వ నిసాఅన్. వత్తఖుల్లా హల్లదీ తసాఅలూన బిహీ వల్ అర్‌హామ ఇన్నల్లాహ కాన అలైకుమ్ రఖీబా)

(యా అయ్యుహల్లదీన ఆమనుత్త ఖుల్లాహ వ ఖూలూ ఖవ్‌లన్ సదీదా, యుస్‌లిహ్ లకుమ్ ఆమాలకుమ్ వ యగ్ఫిర్ లకుమ్ దునూబకుమ్ వ మన్ యుతి ఇల్లాహ వ రసూలహూ ఫఖద్ ఫాజ ఫవ్‌జన్ అదీమా)

**అమ్మాబాదు :** ఫ ఇన్న ఖైరల్ హదీసి కితాబుల్లాహి, వ ఖైరల్ హుదా హుదా ముహమ్మదిన్, వ షర్రల్ ఉమర్రి ముహ్‌దసాతుహా, వ కుల్లు ముహ్‌దసతిన్ బిద్‌అహ్, వ కుల్లు బిద్‌అతిన్ దలాలాహ్, వ కుల్లు దలాలతిన్ ఫిన్ నార్)[18]

★ వివాహం కొరకు 'ఖుత్బతుల్ హాజా' పఠించకపోయినా వివాహం ధర్మ సమ్మతమే అవుతుంది. 'ఖుత్బతుల్ హాజా' శుభాల కొరకు మాత్రమే పఠించడం జరుగుతుంది. అది వివాహానికి తప్పనిసరి షరతు కాదు.

కనుక ఒకసారి ప్రవక్త ముహమ్మద్ (స) వద్దకు ఒక స్త్రీ వచ్చి :

"ఓ ప్రవక్తా ముహమ్మద్ (స)! నాకై నేనే మీ కొరకు (వివాహానికై) సమర్పించు కుంటున్నాను. దానికి ప్రవక్త (స) జవాబు ఇవ్వలేదు. అంతలో అక్కడున్న ఒక వ్యక్తి: 'ఓ ప్రవక్తా! మీరు ఆమెతో వివాహం చేసుకోకపోతే, ఆమెను నాకిచ్చి వివాహం

జరపండి' అని అన్నాడు. అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (స) అతనితో వివాహం చేశారు. మరియు మహర్‌కు బదులుగా (అతని వద్ద మహర్ ఇవ్వడానికి ఏమియు లేనందువల్ల) ఆమెను ఖుర్‌ఆన్ నేర్పించమని ఆదేశించారు."[19]

## విడాకుల హక్కు

వివాహం ద్వారా స్త్రీ, పురుషుని అధీనంలోకి చేరుతుంది. ఆ వ్యక్తి ఆమె మంచీ చెడుల బాధ్యతలను, పోషణాబాధ్యతను విధిగా తీసుకుంటాడు. విడాకుల వలన అదే స్త్రీ ఆ వ్యక్తి అధీనంలో నుండి వైదొలగుతుంది.

సమాజంలో కొన్ని సందర్భాలలో భార్య, భర్తల మధ్య సంబంధాలు చెడి పోయి శత్రువులుగా తయారవుతారు. అటువంటి స్థితిలో భార్యాభర్తల సంబంధం ఒక భారంగా తయారవుతుంది. ఆ పరిస్థితుల్లో భార్యా భర్తలు పరస్పరం తలాఖ్ (విడాకులు) ద్వారా వేరై శాంతిని పొందడం మినహా మార్గాంతరం లేదు. వివాహం **ఒకసారి జరిగిపోయిందిలే ఇప్పుడు తిట్టినా, కొట్టినా, చంపినా పతి పరమేశ్వరుడు అంటూ బలవంతంగా సంసారం చేయాలనడం ఇస్లామీయ ధర్మ విధానం కాదు.** విడాకులు తీసుకునే హక్కు స్త్రీకైనా మరియు పురుషునికైనా ఇద్దరికీ సమానంగా ఉంది. భర్త గనుక దుర్మార్గుడు, త్రాగుబోతు, దురలవాట్లకు పాల్పడే వాడైతే మరియు అతనిలో మార్పు అనేది కనిపించకపోతే **'ఖులా' ద్వారా భర్త నుంచి విడాకులు తీసు కుని వేరయిపోయే హక్కును ఇస్లాం ధర్మం స్త్రీలకి ప్రసాదించింది.**

అదే విధంగా భార్య జగడాలమారి, చెడ్డ సంభాషణ కలిది, చెడు నడత కలది, ఇంటి సంరక్షణ విషయంలో బాధ్యతరహతంగా ఉంటే, ఆమెలో మంచి మార్పు అనేది రాకపోతే మూడు నెలల పాటు అంటే ప్రతినెల ఒక 'తలాఖ్' ఇవ్వవలెను. అలా విడాకులు తీసుకొని వేరయిపోయే హక్కును ఇస్లాం ధర్మం పురుషునికి ప్రసాదించింది.

తరువాత చట్ట ప్రకారం స్త్రీలయినా, పురుషులయినా ఇతరులతో వివాహం చేసుకోవాలంటే చేసుకోవచ్చును. జీవితంలో ఒకే భర్త లేక ఒకే భార్య అన్న నిబంధన లేదు. **మన సమాజంలో చాలా మంది స్త్రీలు యుక్త వయసులో భర్త చనిపోయినా లేక విడాకుల వలన భర్త దూరమైపోయినా వివాహం చేసుకోకుండా హీనమైన జీవితాన్ని గడుపుటకు సిద్ధపడుతున్నారు. కొంతమంది వ్యభిచారానికి పాల్పడుతు**

**న్నారు. అలా చేయడం సామాజికపరంగా, ధర్మపరంగా మంచిది కాదు. ప్రేమాను రాగాలతో కూడుకున్న వివాహ జీవితం చాలా గౌరవప్రదమైన మరియు సురక్షితమైన జీవితం.**

## వలీమా విందు :

నికాహ్ (ముహూర్తం) అయిన తరువాత భార్యతో సంతోషాన్ని పంచుకున్న తరువాత బంధుమిత్రుల కొరకు తయారు చేసే భోజనాన్ని **"వలీమా కి దావత్"** అంటారు.

వరుడు తన శక్తివంచన లేకుండా పొట్టేళ్ళను కోసి వధూవరుల బంధు మిత్రులను విందు కొరకై ఆహ్వానిస్తాడు. **వలీమా విందు కారణంగా అందరిలో వివాహాన్ని బహిర్గతం చేయడానికి అది ఒక ఉన్నతమైన విధానం.** ఇస్లామీయ ధర్మ ప్రకారం "వలీమా' విందుకు ఆహ్వానించడం **"సున్నతె ముఅక్కద"**గా భావించ బడింది.

ఒకసారి అబ్దుర్ రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి)గారు ప్రవక్త ముహమ్మద్ (స) గారికి, **"నేను వివాహం చేసుకున్నాను."** అని తెలియజేశారు. అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (స) ఆయనతో: **"మీరు కనీసం ఒక మేకను బలి చేసైనా విందు భోజనం పెట్టండి"** అని అన్నారు.[20]

ఒక మేకను కోసి వలీమా చేసే శక్తి లేకపోతే తమ శక్తికి అనుగుణంగా మీ వద్ద ఏమున్నదో దానిలోనే వలీమా విందు ఏర్పాట్లు చేయడం ధర్మమే. అదే పనిగా అప్పులు చేసి, పొట్టేళ్ళు కోసి ఘనంగా వలీమా విందు ఏర్పాట్లు చేయడం ధర్మం కాదు.

వలీమా విందులో ధనికులతో సహా పేదవారిని కూడా ఆహ్వానించాలి. ఏ వలీమా విందులో అయితే పేదవారిని ఆహ్వానించరో అది చాలా నీచమైన వలీమా విందుగా భావించబడింది. కనుక హజ్రత్ అబూహురైరా (రజి) కథనం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రబోధించారు: "పేదవారిని పిలవకుండా కేవలం ధనికులను మాత్రమే ఆహ్వానించబడే వలీమా విందు అత్యంత నీచమైనది."[21]

వలీమా విందుకు పిలిచినప్పుడు ఆహ్వానితులు తప్పక వలీమా విందులో పాల్గనాలి. ఎవరైతే వలీమా విందు ఆహ్వానాన్ని అంగీకరించరో వారు అల్లాహ్‌కు మరియు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం)కు అవిధేయులుగా పరిగణించబడతారు.

వలీమా విందుకై సుదూర ప్రదేశాల నుండి బస్సులకు, ట్రైన్లకు టిక్కెట్లు పెట్టి పిలిపించడం ధర్మం కాదు. దాని వల్ల పెళ్ళి చేసేవారిపై ఆర్థిక భారం పెరుగుతుంది. **అలా ఆహ్వానించడం ఇస్లామీయ చరిత్రలో ఎక్కడా లేదు. వలీమా విందుకు సుదూర ప్రాంతాల నుండి రావాలనుకున్నవారు తమ ఖర్చులతో రావాలి.** అదే పట్టణములో ఉన్నవారు సులభంగా వలీమా విందులో పాల్గొని వధూవరులకు చక్కని సంసారం, సుఖ జీవితం కొరకై దుఆ చెయ్యాలి. ప్రవక్త ముహమ్మద్ (స) వివాహం చేసుకున్న వారికి **"బారకల్లాహు వ బారక అలైక వ జమఅ బైనకుమా ఫీ ఖైర్"** అని దుఆ చేసే వారు.

**ఇస్లామీయ విధానం ప్రకారం భార్యతో సంసారం చేసిన తరువాత వలీమా భోజనం పెట్టాలి.** మన సమాజంలో వలీమా రోజు కంటే నికాహ్ రోజున ఎక్కువగా బంధుమిత్రులను ఆహ్వానిస్తారు. నికాహ్ విందుకు వలీమా విందుకంటే ఎక్కువగా ప్రాముఖ్యతనిస్తారు. ప్రస్తుత కాలంలో ప్రజలు **'షాదిఖానా'** (కళ్యాణ మండపం) ఒక రోజు కొరకు అద్దెకు తీసుకోవాలంటేనే ఒక పెద్ద మొత్తం చెల్లించవలసి ఉంటుంది. అలాంటప్పుడు రెండు రోజుల కొరకు కళ్యాణ మండపం ఎలా అద్దెకు తీసుకుంటారు. అందుకని ఒకే రోజులో నికాహ్ మరియు వలీమా జరుపుకుంటున్నారు.

**నికాహ్ జరిగిన తరువాత భార్యతో సంసారం చెయ్యక మునుపే వలీమా భోజనం పెట్టడం అనివార్యమైతే వలీమా భోజనం పెట్టడం ధర్మమే అని కొంత మంది ధర్మ గురువులు ఏకీభవించారు.**

కాని కొంతమంది ప్రజల ఆలోచన ఏమంటే, కనీసం ఒక రాత్రి భార్యతో గడిపితేనే వలీమా ధర్మం అవుతుంది. లేదంటే వలీమా ధర్మసమ్మతం కాదని అంటారు. అలా వారి వాదనకు నిజమైన హదీసు ఆధారాలు లేవు.

## నికాహ్ విందు

నికాహ్ కొరకు అమ్మాయి వైపు నుండి **'వలీ'** మరియు ఇద్దరు సాక్షులు,

అలాగే అబ్బాయి వైపు నుండి ఇద్దరు సాక్షుల సమక్షంలో నికాహ్ జరుగుతుంది. మొత్తం బంధుమిత్రులు నికాహ్ కొరకై హాజరుకావలసిన పనిలేదు. **ఇస్లాం ధర్మంలో 'నికాహ్' విందు కొరకు ఆహ్వానించాలంటూ ఎలాంటి ఆధారాలు లేవు.** ఇస్లామీయ చరిత్ర పరంగా నికాహ్ కొరకు మొత్తం బంధు మిత్రులను ఆహ్వానించడం కూడా లేదు. అలాగే నికాహ్ విందు మరియు వలీమా విందు రెండూ కలిపి ఒకే విందుగా ఇస్తున్నారు. అంటే, భోజనం కొరకు అయ్యే ఖర్చులో సగం ఖర్చు పెళ్ళికూతురువారు చెల్లిస్తారు. సగం ఖర్చు పెళ్లికొడుకు వారు చెల్లిస్తారు. **వలీమా విందుకై పెళ్ళికూతురు వారు సగం ఖర్చును చెల్లించడం ధర్మం కాదు.**

మన సమాజంలో పెళ్ళి కూతురివారిపై అనేక విధాల విందు భోజనాల భారం మోపుతారు. అంటే, నికాహ్ జరగబోయే ముందురోజు 'షుక్రాన' పేరుతో **'షుక్రానేకి రస్మ్'** అని చేస్తారు. పెళ్ళికూతురు ఇంటివారు ఆ రోజు రాత్రి వచ్చిన వారందరికీ భోజనం తప్పనిసరిగా పెట్టాలి. నికాహ్ రోజు టిఫిన్ (అల్పాహారం) పేరుతో లక్షలు ఖర్చు చేసే అనేక రకాల భోజన పదార్థాలు మరియు తీపి పదార్థాలు తయారు చేసి టిఫిన్ ఏర్పాటు చేయాలి. నికాహ్ విందు పేరుతో వివిధ రకాల మాంసం మరియు పెద్ద ఎత్తున బిరియాని తయారు చేసి భోజనం పెట్టాలి. నికాహ్ కొరకై పెద్ద ఎత్తున పెళ్ళి పందిరిని ముస్తాబు చేసి, పెళ్ళి కొడుకు శరీరం మొత్తం పూల హారాలతో అలంకరించాలి. ఐదు జుమాగీల (శుక్రవారాల) వరకూ పెళ్ళి కూతురు వారు విందు ఏర్పాట్లు చేస్తూనే ఉండాలి. మరియు వివిధ 'సాంగ్యం' చేసి, కానుకలు కూడా ఇవ్వాలి.

ప్రియమైన ముస్లిములారా! పైన పేర్కొనబడిన ఏ ఒక్క విందు మరియు విధానం కూడా ఇస్లామీయ సాంప్రదాయం కానేకాదు. **అలా అన్యాయంగా తినడం, కానుకలు తీసుకోవడం ధర్మం కూడా కాదు.** అలాంటి సాంప్రదాయాలు మన సమాజంపై భరించలేని భారంగా మోపబడ్డాయి. పెళ్ళి కూతురు వారు వివాహం చెయ్యాలంటే ఆర్థికంగా దివాలా తీయక తప్పదు. లేక ఆస్తులు అమ్ముకోక తప్పదు. వివాహాన్ని సులభతరం చెయ్యండి. తమపై భారంగా మార్చుకోకండి.

ప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు. **"ఏ వివాహంలో అయితే ఖర్చు తక్కువ చేస్తారో ఆ వివాహంలో శుభాలు ఉంటాయి."**[22]

## వరకట్నం

నేడు మన సమాజంలో వరకట్న దురాచారం ఒక లాటరి టిక్కెట్టుగా మారింది. ప్రతి వర్గంలో పేదల, మధ్య తరగతుల, ధనికుల మరియు ధర్మాలకు అతీతంగా వరకట్నం వ్యాప్తి చెందింది. అనేక మంది ధర్మం, అధర్మం అనే విషయాన్ని పూర్తిగా ప్రక్కకు పెట్టి బలవంతంగా వరకట్నాలు తీసుకుంటున్నారు.

**కొందరు వివాహానికి ముందే తమ డిమాండ్లను మొహమాటం లేకుండా తెలియజేస్తారు. మరికొందరు పెళ్ళి తరువాత ఒకడుగు ముందుకు వేసి, సమయ సందర్భాలకు అనుగుణంగా కానుకల రూపంలో పీక్కు తింటూనే ఉంటారు.** అవసరమైతే తమ అర్ధాంగిని నానా కష్టాలు పెట్టి, ఆమెపై దౌర్జన్యం చేసి, గూండాలుగా, రౌడీలుగా ప్రవర్తించి కట్నకానుకలంటూ వసూళ్ళు చేస్తూనే ఉంటారు. ఇలాంటి నీచమైన నికృష్టమైన దౌర్జన్యాలు చేసేవారు అధర్ములు, దైవభక్తి లేనివారు దుర్మార్గులు, గుణహీనులు, అజ్ఞానులు అంటే తప్పు కాదు. ఎందుకంటే, వారి నైజమే అంత. **మన సమాజంలో వరకట్నం తీసుకునే వారెవరంటే; పేరు ప్రతిష్టలు పొందినవారు, ధనికులు, పెద్ద చదువులు చదివిన మేధావులు, విదేశాలలో పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తున్నవారు. పెద్ద పెద్ద హోదాలలో ఉన్నవారు కట్నకానుకల కొరకు పీడిస్తున్నట్లు చూస్తున్నాము.**

విచారకరమైన విషయం ఏమంటే? ధార్మికంగా జీవించే వర్గాలలో కూడా వరకట్నం తీసుకుంటున్నారు. వారు కూడా చిన్న చిన్న డిమాండ్లతో ఒక పెద్ద మొత్తాన్నే లాగేసుకుంటున్నారు. వారు పైకిమాత్రం ధార్మికులుగానే కనిపిస్తారు. వరకట్నం అమ్మాయి నుండి తీసుకోవడం తమ హక్కుగా భావిస్తున్నారు.

**కనీసం ధార్మికులు దేవునికి భయపడి, దానిని మహా పాపంగా భావించి, విప్లవాత్మక నిర్ణయం తీసుకుని, చిత్తశుద్ధితో వరకట్నాన్ని నివారించి ఉంటే ఈ సమాజం ఎప్పుడో బాగుపడేది.**

ప్రతీ ధర్మం ప్రకారం మరియు భారతీయ చట్టం ప్రకారం: “వరకట్నం ఇవ్వడం మరియు పుచ్చుకోవడం ఘోరమైన నేరం.” **ఇస్లాం ధర్మం ప్రకారం వరకట్నం అనేది అన్యాయంగా ఇతరుల సొమ్మును దోచుకోవటంతో సమానం, అది మహా పాపమే అవుతుంది.**

ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా తెలియజేశాడు :

يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا لَا تَأْكُلُوا أَمْوَالَكُمْ بَيْنَكُمْ بِالْبَاطِلِ

**ఓ విశ్వాసులారా! ఒకరి సొమ్మునొకరు అధర్మంగా తినకండి.**[23]

హ[జత్ అబూ హురైరా (రజి) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: **"ధనాన్ని పోటీపడి కూడబెట్టేవారి స్థితి ప్రళయ దినాన అందరికంటే అతి అధ్వాన్నంగా ఉంటుంది. తమ ధనంలో అటూ ఇటూ (అల్లాహ్ మార్గంలో) ఖర్చు పెట్టినవారు తప్ప. మరియు వారి సంపాదన కూడా పరిశుభ్రమై (హలాల్) ఉంటే తప్ప."**[24]

హ[జత్ అబూహురైరా (రజి) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ప్రళయ దినాన ప్రతి ఒక్కరు వారి సంబంధీకుల హక్కులను చెల్లించాలి...."[25]

హ[జత్ అబూహురైరా (రజి) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) **"మీలో దరిద్రుడు ఎవరో మీకు తెలుసా?"** అని ప్రశ్నించారు. దానికి వారు: **"మాలో ఎవరి దగ్గరనైతే దిర్హంలు (డబ్బులు), ఎలాంటి సామగ్రి లేవో! అతనే దరిద్రుడు"** అని అన్నారు.

ఆ తరువాత ముహమ్మద్ (స), "నా ఉమ్మత్‌కు చెందిన (అసలైన) దరిద్రుడు ఎవడంటే? అతను ప్రళయదినాన నమాజులను, ఉపవాసాలను, జకాత్ (పుణ్యాల)ను తీసుకొస్తాడు." అప్పుడు అల్లాహ్ వద్దకు (కొందరు) వచ్చి, అతనికి వ్యతిరేకంగా: **(ఓ అల్లాహ్)! "ఇతను నన్ను దుర్భాషలాడాడు, ఇతను నాపై నిందలు మోపాడు, ఇతను నా ధనాన్ని (అన్యాయంగా) తినేశాడు, ఇతను (అన్యాయంగా) నా రక్తాన్ని చిందించాడు, ఇతను నన్ను కొట్టాడు"** అని విన్నవించుకుంటారు.

అప్పుడు (అల్లాహ్): **"ఇదిగో అతని పుణ్యాలను తీసుకో, ఇదిగో అతని పుణ్యాలను తీసుకోమనీ (పరిహారంగా అతని పుణ్యాలను) ఇతరులకు చెల్లిస్తాడు. అలా ఆ వ్యక్తి పుణ్యాలన్నీ తీర్పు పూర్తికాక ముందే అంతమైపోతాయి.** (అప్పటికీ ఇతరుల హక్కులు మిగిలి ఉంటే) వారి పాపాలను తీసి (పరిహారంగా అతని ఖాతాలో) అతనిపై మోపుతారు. అలా అతడు నరకములో విసిరేయబడతాడు."[26]

ఇస్లామీయ ధర్మ ప్రకారం వరుడు వధువుకు **"మహర్"** రూపంలో తమ శక్తికి అనుగుణంగా ఏదో ఒక మొత్తాన్ని విధిగా చెల్లించాలి. అలాంటప్పుడు వధువు నుండి వరకట్నం తీసుకోవడం ఎలా ధర్మం అవుతుంది? తీసుకున్న వరకట్నానికి బదులు పరలోకంలో తమ పుణ్యాలను అత్తవారికి చెల్లించవలసి ఉంటుంది. ఆ తరువాత మీరు నరకానికి పోవలసి ఉంటుంది. **కొంతమంది "మహర్" ఇచ్చినా కూడా దానికంటే ఎక్కువగా వరకట్నం తీసుకుంటారు. అలాంటప్పుడు వీరు "మహర్" చెల్లించినట్లు ఎలా అవుతుంది?** మీ అతి తెలివి ప్రజల వరకే పరిమితం. కాని అల్లాహ్ వద్ద మీరు ఎలా బదులివ్వగలరు?

**మామగారు అల్లుడికి ఇచ్చిన కానుకలంటారా! లేక తండ్రి తన కూతురికి ఇచ్చిన కానుకలు అంటారా! జ్ఞాపకం ఉంచుకోండి! అల్లాహ్‌కు అంతా తెలుసు, ఆయన సర్వజ్ఞాని.** మీరు వరకట్నాలకు ఎన్ని రూపాలు ఇచ్చినా, ఎన్ని పేర్లు పెట్టుకున్నా అది మాత్రం మీ హక్కు కానే కాదు.

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు :

**(فَمَنْ يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا يَرَهُ (7) وَمَنْ يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ شَرًّا يَرَهُ (8)**

**"ఎవరయితే రవ్వంత మంచిని చేసి ఉన్నా దానిని (ప్రళయ దినాన) చూసు కుంటాడు. మరియు ఎవరయితే రవ్వంత చెడును చేసి ఉన్నా దానిని (ప్రళయ దినాన) చూసుకుంటాడు."**[27]

## వరకట్నం చెడు సంపాదన కాదా...!!!

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్ను మస్వూద్ (రజి) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**ప్రళయం నాడు మనిషి పాదాలు ఐదు ప్రశ్నలకు జవాబు ఇవ్వనంత వరకూ అల్లాహ్ ముందు నుంచి కదల లేవు:**

★ నీ జీవితం గురించి, దాన్ని ఎలా గడిపినావనీ,

★ యుక్త వయస్సు గురించి, దాన్ని ఎలా జీవించావనీ,

★ సంపద గురించి దాన్ని ఎలా సంపాదించావు మరియు దాన్ని ఎలా ఖర్చు పెట్టావనీ,

★ చదువుకున్న జ్ఞానం గురించి, దానిపై ఎంతవరకు ఆచరించావనీ."[28]

**యువకుల్లారా!** వరకట్నం తీసుకోమని ప్రతీ ఒక్కరు శపథం చెయ్యండి. చెడు సమాజానికి వ్యతిరేకంగా విప్లవం తీసుకురండి. అల్లాహ్ మనందరికీ ఉత్తమమైన, పుణ్యమైన జీవితాన్ని ప్రసాదించుగాక! ఆమీన్.

---

1. *(సూరతున్ రూమ్ : 21)*
2. *(సహీహ్ బుఖారీ : 1772, సహీహ్ ముస్లిం : 2485)*
3. *(సూరతున్ నూర్ : 32)*
4. *(సహీహ్ ముస్లిం : 1467)*
5. *(సహీహ్ అబూదావూద్ : 1664)*
6. అ*(సహీహ్ బుఖారీ : 4700, సహీహ్ ముస్లిం : 2661)*
7. *(సూరతున్ నూర్ : 26)*
8. *(సూరతున్ నూర్ : 3)*
9. *(తఫ్సీర్ ఇబ్నె కసీర్, అహ్సనుల్ బయాన్ : తెలుగు : 1504 – 1505)*
10. *(అల్ అహ్జాబ్ : 36)*
11. *(సూరతుల్ బఖరా : 221)*
12. *(వివరాలకు ఖుర్ఆన్‌లో సూరతున్ నిసా 23వ ఆయతు నుండి 26వ ఆయతు వరకు చూడండి. మరియు తఫ్సీర్ అహ్సనుల్ బయాన్)*
13. *(ముస్నద్ అహ్మద్, సహీహ్ అల్ జామే : 7556)*
14. *(తబ్రానీ, సహీహ్ అల్ జామీ : 7558)*
15. *(సూరతుల్ బఖరా : 232)*
16. *(సహీహ్ బుఖారీ : 6453, సహీహ్ ముస్లిం : 2543)*
17. *(ఇర్వావుల్ గలీల్, అహ్సనుల్ బయాన్: తెలుగు, పేజి : 162)*
18. *(సహీహ్ అబూదావూద్, నసాయీ, ఇబ్ను మాజా)*
19. *(సహీహ్ బుఖారీ : 2144)*
20. *(సహీహ్ బుఖారీ : 3644)*
21. *(సహీహ్ బుఖారీ : 4779, సహీహ్ ముస్లిం : 2585)*
22. *(ముస్నద్ అహ్మద్ : 23388, బైహఖీ : 6295)*
23. *(సూరతున్ నిసా : 29)*
24. *(సహీహ్ ఇబ్నుమాజ : 3332)*
25. *(సహీహ్ ముస్లిం: ..)*
26. *(సహీహ్ ముస్లిం : 4678)*
27. *(సూరతు జిల్‌జాల్ : 7–8)*
28. *(సహీహ్ తర్‌గీబ్ వత్‌తర్‌హీబ్ : 128)*

# 14. అంత్యక్రియలు

## బాధకు గురికాబడేవారిని పరామర్శించేవారి ఘనత

హజ్రత్ అబూ జర్ర్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**(لَا تَحْقِرَنَّ مِنْ الْمَعْرُوفِ شَيْئًا وَلَوْ أَنْ تَلْقَى أَخَاكَ بِوَجْهٍ طَلْقٍ).**

"మంచి పనిని ఏమాత్రం హీనంగా భావించకు, నీ సోదరుడిని చిరునవ్వుతో కలుసుకోవడం కూడా పుణ్యకార్యమైనది."[1]

హజ్రత్ సౌబాన్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు. **(مَنْ عَادَ مَرِيضًا لَمْ يَزَلْ فِي خُرْفَةِ الْجَنَّةِ حَتَّى يَرْجِعَ).** "ఒక ముస్లింను పరామర్శించటానికి వెళ్ళి తిరిగి వచ్చేవరకూ అతను స్వర్గంలో తాజా పండ్లను ఏరినట్లు."[2]

హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ, అబూహురైరా (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**(مَا يُصِيبُ الْمُسْلِمَ مِنْ نَصَبٍ وَلَا وَصَبٍ وَلَا هَمٍّ وَلَا حُزْنٍ وَلَا أَذًى وَلَا غَمٍّ حَتَّى الشَّوْكَةِ يُشَاكُهَا إِلَّا كَفَّرَ اللَّهُ بِهَا مِنْ خَطَايَاهُ).**

"ముస్లింకు ఏ విధమైన ఆపద వచ్చినా, బాధ కలిగినా, ఆందోళన కలిగినా, దుఃఖం కలిగినా, చివరికి ముల్లు గుచ్చుకున్నా సరే, దాన్ని అల్లాహ్ అతనికై పాప పరిహారంగా చేస్తాడు."[3]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: **(مَنْ يُرِدِ اللَّهُ بِهِ خَيْرًا يُصِبْ مِنْهُ).** "ఎవరికైతే అల్లాహ్ మేలు చెయ్యాలనుకుంటున్నాడో అతనిని బాధలతో పరీక్షిస్తాడు."[4]

ఒకసారి ఒక నల్లటి మహిళ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సన్నిధికి వచ్చి, "నాకు మూర్ఛ వస్తూ ఉంటుంది. అప్పుడు నా ఒంటి మీద

బట్టలు కూడా తొలిగిపోతాయి. అందుచేత నా కోసం అల్లాహ్‌ను ప్రార్థించండి" అని మనవి చేసుకున్నది. దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లం) సమాధానమిస్తూ, "నీవు తలిస్తే (ఈ బాధ పట్ల) సహనం వహించవచ్చు. ఆ సహనానికి బదులుగా నీకు స్వర్గం లభిస్తుంది. ఇక నీవు కోరినట్లయితే నేను నీ కోసం నీ బాధ దూరం కావాలని అల్లాహ్‌ను ప్రార్థిస్తాను" అని అన్నారు. దానికామె, 'సరే, నేను సహనం వహిస్తాను' అని అన్నది. ఆ తరువాత కాస్సేపటికి "కాని నా ఒంటి మీద బట్టలు తొలిగి పోతాయి. ఇవి తొలిగిపోకుండా ఉండేందుకు (అయినా) అల్లాహ్‌ను ప్రార్థించండి." అని అన్నది. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆ ప్రకారం ఆమె కోసం ప్రార్థన చేశారు.[5]

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఎవరైతే వ్యాధిగ్రస్తుణ్ణి పరామర్శించటానికి పోయి, అతని తల దగ్గర కూర్చొని ఏడు సార్లు:

**أَسْأَلُ اللهَ الْعَظِيْمَ رَبَّ العَرْشِ الْعَظِيْمِ أَنْ يَّشْفِيَكَ.**

**'అస్ అలుల్లాహల్ అజీమ, రబ్బల్ అర్షిల్ అజీమి అయ్ యష్ఫియక'** (నేను స్వస్థత చేకూర్చుమనీ మహోన్నత సింహాసనానికి సర్వోన్నతుడైన అల్లాహ్‌ను అర్థిస్తున్నాను) అని చదివినట్లయితే (ఆ వ్యాధి) అతనికి మరణం కాకపోతే, అల్లాహ్ అతనికి ఆ వ్యాధి నుండి స్వస్థత చేకూర్చుతాడు."[6]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

**(وَلَا يَتَمَنَّيَنَّ أَحَدُكُمْ الْمَوْتَ إِمَّا مُحْسِنًا فَلَعَلَّهُ أَنْ يَزْدَادَ خَيْرًا وَإِمَّا مُسِيئًا فَلَعَلَّهُ أَنْ يَسْتَعْتِبَ).**

"మరణం పొందాలని ఆశించకండి. ఒకవేళ మీరు పుణ్యాత్ములుగా ఉంటే మరింత అధికంగా పుణ్యకార్యాలు చేయవచ్చు. ఒకవేళ పాపాత్ములుగా ఉంటే పశ్చాత్తాపం చెంది అల్లాహ్ వద్ద క్షమాపణ కోరి ప్రేమను పొందవచ్చు."[7]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఒక పల్లెవాసిని పరామర్శించి ఇలా పఠించారు:

**'లా బాస తహూరున్ ఇన్షా అల్లాహ్'. لاَ بَأْسَ طَهُورٌ إِنْ شَاءَ اللّٰهُ.**

(మీరేమీ చింతించకండి. అల్లాహ్ అనుగ్రహిస్తే ఈ వ్యాధి (మిమ్మల్ని పాపాల నుండి) ప్రక్షాళనం చేస్తుంది."[8]

హజ్రత్ ఉస్మాన్ బిన్ అబుల్ ఆస్ (రజియల్లాహు అన్హు) ఒకసారి తనకు ఒంట్లో నొప్పిగా ఉందని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారికి చెప్పారు. దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లం) నొప్పిగా ఉన్న చోట చెయ్యిపెట్టి మూడు సార్లు **'బిస్మిల్లాహ్'** అని, ఏడు సార్లు:

**أَعُوْذُ بِعِزَّةِ اللهِ وَ قُدْرَتِهِ مِنْ شَرِّ مَا أَجِدُ وَ أُحَاذِرُ**

**'అవూజు బిఇజ్జ తిల్లాహి వ ఖుద్‌రతిహి మిన్ షర్రి మా అజిదు వ ఉహాజిరు'** అని పఠించమని ఉపదేశించారు.[9]

హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజియల్లాహు అన్హు) కథనం: అల్లాహ్ దూత జిబ్రయీల్ (అలైహిస్సలాం) ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) దగ్గరకు వచ్చి, "ఓ ముహమ్మద్ (సల్లం) మీరు అనారోగ్యంగా ఉన్నారా?" అని పరామర్శించారు. దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లం) అవునన్నారు. అప్పుడు జిబ్రయీల్ (అలైహిస్సలాం) ఆయన కోసం ఈ విధంగా ప్రార్థించారు:

**بِسْمِ اللَّهِ أَرْقِيكَ مِنْ كُلِّ شَيْءٍ يُؤْذِيكَ مِنْ شَرِّ كُلِّ نَفْسٍ أَوْعَيْنٍ حَاسِدٍ اَللَّهُ يَشْفِيكَ بِسْمِ اللَّهِ أَرْقِيكَ.**

**"బిస్మిల్లాహి అర్‌ఖీక మిన్ కుల్లి షైయిన్ యూజీక, మిన్ షర్రి కుల్లి నఫ్‌సిన్ అవ్ ఐనిన్ హాసిదిన్ అల్లాహు యష్‌ఫీక, బిస్మిల్లాహి అర్‌ఖీక"**

(అల్లాహ్ పేరుతో మీపై ఊదుతున్నాను. అన్ని రకాల బాధల నుండి, ప్రతి ప్రాణి కీడు నుండి, అసూయాపరుని దిష్టి నుండి అల్లాహ్ మీకు ఉపశమనాన్ని ప్రసాదించుగాక! అల్లాహ్ పేరుతోనే మీపై ఊదుతున్నాను)[10]

## మరణం సమీపించిన వారికి కలిమా పఠించమని ప్రోత్సహించాలి

హజ్రత్ ముఆజ్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: తన జీవితపు తుది పలుకు **'లా ఇలాహ ఇల్లల్లాహు'** అయిన వ్యక్తి స్వర్గానికి వెళ్తాడు."[11]

ఎవరైనా ఆప్తమిత్రులు చనిపోతే వారి నుదిటి మీద ముద్దుపెట్టవచ్చు. ఎందు కంటే, హజ్రత్ అబూబకర్ (రజి)గారు ముహమ్మద్ (స) మరణించినప్పుడు ఆయన నుదిటిపై ముద్దు పెట్టారు.[12]

## మృతునికి అంత్యక్రియలు జరిపే ఘనత

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఎవరయినా మృతుని అంత్యక్రియల్లో పాల్గొని నమాజ్ ముగిసే వరకు జనాజా వెంట ఉంటే, అతనికి ఒక ఖీరాతు పుణ్యం లభిస్తుంది. ఎవరయినా ఖనన సంస్కారాలు ముగిసేవరకూ జనాజా వెంట ఉంటే, అతనికి రెండు ఖీరాతుల పుణ్యం లభిస్తుంది. 'రెండు ఖీరాతులంటే ఎంత?' అని ఎవరో అడగ్గా, దానికి ప్రవక్త ముహ మ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) 'రెండు పర్వతాల అంత' అని సమాధాన మిచ్చారు."[13]

హజ్రత్ అబూ రాఫే అస్లమ్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఎవరైతే మృతునికి స్నానం చేయించి, అతని లోపాలను బహిర్గతం చెయ్యకుండా ఉంటే, నలభై సార్లు అల్లాహ్ వారిని క్షమిస్తాడు.

ఎవరైతే గోరిని త్రవ్వి దానిలో ఖననం చేస్తాడో, అతనికి ప్రళయం వరకూ ఒక గృహంలో ఆశ్రయమిచ్చినంత పుణ్యం లభ్యమవుతుంది. ఎవరైతే శవ వస్త్రాలను తొడిగిస్తాడో, అతనికి ప్రళయ దినాన అల్లాహ్ సుతిమెత్తని మరియు దళసరి పట్టు వస్త్రాలను తొడిగిస్తాడు."[14]

మృతుని భౌతికాయానికి శారీరక లోపాలేమయినా ఉన్నా స్నానం చేయించే టప్పుడు వారికి కనబడితే, లేదా మరణం వల్ల అతని రూపురేఖల్లో ఏమయినా మార్పులు ఏర్పడితే వాటిని ఇతరుల ముందు బయటపెట్టరాదు.

## శవం కనురెప్పలు మూసేటప్పుడు ప్రార్థన

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం), హజ్రత్ అబూ సల్మా (రజియల్లాహు అన్హు) (మరణవార్త విని ఆయన) ఇంటికి వచ్చారు. అప్పటికి అబూ సల్మా (రజియల్లాహు అన్హు) కళ్ళు బిగుసుకుపోయాయి. ప్రవక్త ముహమ్మద్ (సల్లం)

ఆయన కనురెప్పలు మూసి, "ప్రాణం పోయేటప్పుడు కళ్ళు దాన్ని వెంబడిస్తాయి" అని అన్నారు. ఆ మాట వినగానే అబూ సల్మా (రజియల్లాహు అన్హు) ఇంటి వారు గొల్లుమన్నారు. అప్పుడు ప్రవక్త ముహమ్మద్ (సల్లం) (వారిని సముదాయిస్తూ) "మీరు చెప్పే మాటలకు అల్లాహ్ దూతలు 'ఆమీన్' అని అంటుంటారు. కనుక మీ మృతుల విషయంలో మంచి మాటలే పలకండి" అని అన్నారు. తర్వాత ఆయన అబూ సల్మా (రజియల్లాహు అన్హు) కొరకు ఈ విధంగా ప్రార్థించారు.

**اللَّهُمَّ اغْفِرْ ...وَارْفَعْ دَرَجَتَهُ فِي الْمَهْدِيِّينَ، وَاخْلُفْهُ فِي عَقِبِهِ فِي الْغَابِرِينَ وَاغْفِرْ لَنَا وَلَهُ يَا رَبَّ الْعَالَمِينَ .اللَّهُمَّ افْسَحْ لَهُ فِي قَبْرِهِ ، وَنَوِّرْ لَهُ فِيهِ.**

**అల్లాహుమ్మగ్ ఫిర్... వర్ఫా దరజతహు ఫిల్ మహ్‌దియ్యీన, వఖ్‌లుఫ్‌హు ఫీ అఖిబిహి ఫిల్ గాబిరీన, వగ్‌ఫిర్ లనా వలహూ, యా రబ్బల్ ఆలమీన. అల్లా హుమ్మఫ్ సహ్ లహూ ఫీ ఖబ్‌రిహి, వ నవ్విర్ లహు ఫీహి.**

ఓ అల్లాహ్! (అని మరణించిన వారి పేరు చెప్పి) ఫలానా వారిని క్షమించు. మోక్ష మార్గాల్లో అతని స్థానాన్ని పెంచు. అతనిపై ఆధారపడిన వారికి నీవే సంరక్ష కుడివి. ఓ సకల లోకాలకు ప్రభువా! మమ్మల్ని, అతన్ని క్షమించు. అతని కొరకై అతని సమాధిని విశాలవంతం, ప్రకాశ వంతంగా చేయుము. [15]

## మృతునికి స్నాన సంస్కారం

హజ్రత్ ఉమ్మె అతియా (రజియల్లాహు అన్హా) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఒక కుమార్తె చనిపోయినప్పుడు ఆయన మా దగ్గరికి వచ్చి ఇలా చెప్పారు: "ఆమె (స్నానం కొరకు) నీటిలో రేగాకులు వేసి మూడు లేక అయిదు సార్లు లేదా అవసరమనుకుంటే అంతకంటే ఎక్కువ సార్లు స్నానం చేయించండి. చివరిసారి కర్పూరం కలపాలి" లేక 'కొంచెం కర్పూరం కలపాలి' ఆ తరువాత 'స్నానం చేయించాక నాకు కబురు చేయండి' అని ఆయన అన్నారు.

మేము (శవానికి స్నానం చేయించి) ఆయనకు కబురు చేశాము. ఆయన (వచ్చి) మాకు తన లుంగీ ఇస్తూ, 'ఈ వస్త్రాన్ని ఆమె దేహానికి తాకే విధంగా చుట్టండి' అని చెప్పారు. [16]

హజ్రత్ హఫ్సా (రజియల్లాహు అన్హా) హదీసు ప్రకారం : 'ఆమెను బేసి సంఖ్యలో స్నానం చేయించండి' అని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అన్నారు. ఉమ్మె అతియా (రజియల్లాహు అన్హా) హదీసు ప్రకారం: 'ఆయన మూడు లేక అయిదు లేక ఏడు సార్లు స్నానం చేయించండి అని అన్నారు. అదీగాక 'కుడి వైపు నుండి ప్రారంభించండి. మొదట వుజూ చేయవలసిన అవయువాలను కడగండి' అని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెప్పినట్లు కూడా ఈ హదీసులో ఉంది. పోతే, హజ్రత్ ఉమ్మె అతియా తాము ఆమె శిరోజాలు దువ్వి వాటిని మూడు పాయలుగా చేశామని (జడలుగా అల్లామని) కూడా తెలిపారు.[17]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) హజ్రత్ ఆయిషా (రజి యల్లాహు అన్హా) గారితో : "...... ఒకవేళ నాకంటే ముందు నీకు మరణం సంభవిస్తే నేను నీకు స్నాన సంస్కారం, వస్త్ర సంస్కారం జరుపుతాను. తరువాత జనాజా నమాజు చేస్తాను. మరియు నీ ఖనన సంస్కారం జరుపుతాను" అని అన్నారు.[18]

స్త్రీలకు స్త్రీలు మాత్రమే, పురుషులకు పురుషులు మాత్రమే శవ స్నానం జరపాలి. కాని భర్త భార్యకు, భార్య భర్తకు శవ స్నానం జరపవచ్చును.[19]

అలాగే ఏడు సంవత్సరాలకు లోపు ఉన్న పాపకు లేక బాబుకు స్త్రీలు లేక పురుషులు స్నానం జరపవచ్చును.

హజ్రత్ అలీ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం : ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారికి, 'నేను స్నానం చేయించాను. అప్పుడు ఆయన కడుపులో (మలమూత్రం) 'శవానికి ఉన్నట్లు' ఏమైనా ఉన్నదా అని చూశాను. కాని అలాంటిదేమీ కనపడలేదు. ఎందుకంటే, ఆయన బ్రతికుండినా, మరణించినా ఎంతో పరిశుద్ధులు.[20]

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు. "ఎవరైతే శవాన్ని స్నానం చేయించాడో, అతను కూడా స్నానం చేసుకోవాలి. మరియు ఎవరైతే శవపేటికను ఎత్తుకొని పోయాడో, అతను వుజూ చేసుకోవాలి."[21]

## మృతునికి వస్త్ర సంస్కారం

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) కథనం: ప్రవక్త ముహమ్మద్

(సల్లల్లాహు అలైహి వ సల్లం) (భౌతికకాయం)కు యమన్ దేశంలోని సహూల్ ప్రాంతంలో తయారయిన మూడు తెల్లటి వస్త్రాలలో చుట్టడం జరిగింది. ఆయన (భౌతికకాయం)కు చుట్టిన వస్త్రాలలో చొక్కాగాని, తలపాగా గాని లేవు. [22]

## ఆ తరువాత శవంపై లేక శవపేటికపై ఒక దుప్పటి కప్పాలి

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆయన భౌతికకాయంపై యమన్‌లో తయారయిన ఒక ఆకుపచ్చని దుప్పటి కప్పారు. [23]

శవ వస్త్రాలపై ఖుర్‌ఆన్ ఆయతులు లేక కలిమయే షహాదత్ వంటి పదాలు వ్రాయకూడదు. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) లేక సహాబాల వస్త్రాలపై ఇలా వ్రాసినట్లు ఆధారాలు లేవు. పైగా ఇది ఒక బిద్‌అత్ ఆచారం.

## శ్మశానానికి ఎత్తుకొనిపోయే సంస్కారం

శవాన్ని శవపేటికలో ముందు కాళ్ళభాగాన్ని వంచుతూ తల భాగాన్ని దించి పెట్టాలి. తరువాత శవపేటికను తల వైపు నుండి ఎత్తుకొని నడవాలి. ప్రజలందరు శవపేటిక కాళ్ళ వైపున నడుచుకుంటూ పోవాలి. శవపేటిక తీసుకుని పోయేటప్పుడు కూర్చున్నవారు నిలబడాలి. శవయాత్ర వెళ్ళిపోయిన తరువాత కూర్చోవచ్చును. అలాగే సవారిపై ఉంటే సవారి మీద నుండి దిగి నడిచి పోవాలి. లేదా శవయాత్ర వెనుక చిట్టచివరగా సవారిపై పోవచ్చును. స్త్రీలు శవపేటిక వెంట (శ్మశానానికి) వెళ్ళడం నిషిద్ధం. శవపేటికను తీసుకుపోయేటప్పుడు దాని వెనుక నడవడమే ఉత్తమం. కాని నలువైపుల నుండి కూడా నడిచిపోవచ్చును. కనుక ఒక హదీసులో ఇలా ఉంది, "సవారి చేసే వ్యక్తి శవానికి వెనుక ఉండాలి. నడిచేవారు శవపేటిక దగ్గర నుంచి ముందు లేక వెనుక కుడి వైపు లేక ఎడమవైపు నుండి నడిచిపో వచ్చును. [24]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) శవపేటికతో నడుస్తుండగా ఆయన వద్దకు సవారి చెయ్యమని ఒక జంతువును తీసుకురావడం జరిగింది. దానిపై సవారి చేయుటకు ఆయన నిరాకరించారు. (ఖననం పూర్తి చేసుకున్న తరువాత) తిరిగి వచ్చేటప్పుడు (మరలా) జంతువును తీసుకురావడం జరిగింది. అప్పుడు ఆయన దానిపై సవారి చేశారు. కొంతమంది దీని గురించి అడిగారు.

దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు. "అల్లాహ్ దూతలు (శవపేటికతో) నడుస్తున్నారు. వారు నడుస్తుండగా నేను ఎలా సవారిపై ఎక్కి వచ్చేది! వారు వెళ్ళిపోయిన తరువాత నేను సవారిపై ఎక్కినాను."[25]

అంటే, శవపేటిక వెంట పోయేటప్పుడు నడిచి వెళ్ళడం గొప్ప ఆచారం. తిరిగి వచ్చేటప్పుడు నడిచి రావచ్చును. లేక వాహనముపై కూడా రావచ్చును.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఆదేశించారు: "మీరు శవయాత్ర వస్తుండగా చూస్తే నిలబడండి. అది ముందుకు వెళ్ళిపోయే వరకు అలాగే నిలబడండి.[26]

హజ్రత్ ఉమ్మె అతియా (రజియల్లాహు అన్హా) కథనం: "మమ్మల్ని (స్త్రీలను) జనాజాల (శవపేటికల) వెంట (శ్మశానానికి) వెళ్ళకుండా వారించటం జరిగేది. అయితే ఈ విషయంలో మరీ అంత తీవ్ర వైఖరి అవలంబించే వారు కాదు."[27]

జనాజా మోసుకుని వెళ్ళేటప్పుడు ఖుర్ఆన్ పఠనం లేక కలిమయే షహాదత్ పఠించడం ధర్మ ఆచారం కాదు అని ధర్మ గురువులందరూ ఏకీభవించారు.[28]

## ఇతరులు రోదించడం వలన మృతుడు శిక్షింపబడతాడు

హజ్రత్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "చనిపోయినవాని గురించి రోదించేవారి కారణంగా సమాధిలో యాతనకు గురిచేయటం జరుగుతుంది."[29]

హజ్రత్ ఇబ్ను ఉమర్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "మృతుడు తన సమాధిలో శిక్షకు గురికాబడతాడు. అతని కోసం (బంధువులు) రోదించడం వలన"[30]

**ముఖ్యగమనిక :** బంధువుల్లో ఎవరైనా మరణిస్తే ప్రళయాన్ని సృష్టించేలా గొడవచేయటం, పెడబొబ్బలు పెట్టడం, బట్టలు చించుకోవటం, రొమ్ముపై బాదు కోవటం, జడలు విప్పి తాండవమాడటం నిషిద్ధం. బంధువులు చనిపోయినప్పుడు ఏడుపు రావటం సహజం. కాని–బిగ్గరగా–ఏడవటం మాత్రం ధర్మసమ్మతం కాదు. శోకంతో కళ్లగుండా కన్నీరు రావటం కూడా సహజమే. ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) కుమారుడు హజ్రత్ ఇబ్రాహీం (రజియల్లాహు అన్హు) చనిపోయిన

సందర్భంగా ఆయన (స) కళ్లల్లో నుంచి కన్నీరు ప్రవహించసాగింది. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారితో, తమరు కూడా ఏడుస్తున్నారా?" అని హజ్రత్ అబ్దుర్ రహ్మాన్ బిన్ ఔఫ్ ఆశ్చర్యం వెలిబుచ్చగా, ఇది అసహనంతో కూడిన ఏడుపు కాదు సుమా! అనురాగంతో, వాత్సల్యంతో ఉబికివస్తున్న కన్నీళ్లు మాత్రమే" అని ఆయన సమాధానమిచ్చారు."[31]

## మరణించిన వ్యక్తి ఇంటికి పోయి చేసే దుఆ

**إِنَّ لِلهِ مَا أَخذَ ولَهُ مَا أَعْطَى وكُلُّ شَيءٍ عِنْدَهُ بأَجَلٍ مُسَمًّى فَلْتَصْبِرْ وَلْتَحْتَسِبْ.**

**'ఇన్నాలిల్లాహి మా అఖజ వ లహూ మా ఆ 'తా వ కుల్లు షైయిన్ ఇన్‌దహూ బి అజలిమ్ ముసమ్మ, ఫల్ తస్బిర్, వల్ తహ్‌తసిబ్'**

(నిశ్చయంగా అల్లాహ్ వెనక్కి తీసుకుంది ఆయనదే, తాను ప్రసాదించినది ఆయనదే, ప్రతి వస్తువుకూ ఆయన ఒక గడువు నిర్ణయించి ఉన్నాడు. కనుక మీరు ఓర్పు పుణ్య ఫలాపేక్షతో ఉండండి.)[32]

## ఖనన సంస్కారం

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"మృతదేహాన్ని (శ్మశానానికి) తీసుకెళ్ళడంలో తొందర చేయండి. ఎందుకంటే, మృతుడు పుణ్యాత్ముడై ఉంటే అతడ్ని మీరు సత్పర్యవసానం వైపునకు తీసుకెళ్లున్నారన్న మాట. ఒకవేళ అతను పాపాత్ముడై ఉంటే అతనొక చెడుమయం. దాన్ని మీరు భుజాల నుండి దించివేయడానికి వెళ్తున్నారన్నమాట. (అందువల్ల మృతదేహాన్ని ఎంత త్వరగా శ్మశానానికి చేర్చితే అంత మంచిది.)[33]

హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్ (రజియల్లాహు అన్హు) కథనం ప్రకారం: మేము మూడు సమయాలలో నమాజు చేయడాన్ని, మృతుని అంత్యక్రియలు జరపటాన్ని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అ లైహి వసల్లం) వారించేవారు:

మొదటిది : "సూర్యోదయం అయ్యే వేళ. అది పైకెక్కే వరకూ.

రెండవది : నడినెత్తి మీదకొచ్చిన సూర్యుడు వాలేవరకూ.

మూడవది : సూర్యాస్తమయం అయ్యేవేళ. అది అస్తమించే వరకూ."[34]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:"గోరిని లోతుకు తవ్వండి. మరియు దాన్ని నున్నగా మరియు శుద్ధంగా ఉంచండి."[35]

తరువాత శవాన్ని కాళ్ళ వైపు నుండి సమాధిలోకి దింపాలి.[36]

శవాన్ని గోరిలో దింపేటప్పుడు ఇలా చదవాలి.

**'బిస్మిల్లాహి వ అలా మిల్లతి రసూలిల్లాహి'**[37] ....

సమాధిలో మృతుణ్ణి తన కుడి భుజంపై పండబెట్టి, ముఖం ఖిబ్లా వైపుకు ఉన్నట్లు ఉంచాలి.

హజ్రత్ సఅద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజియల్లాహు అన్హు) ఇలా ఆదేశించారు: (నేను చనిపోయిన తరువాత) 'నా కోసం సమాధిలో చంక (లహద్) మాదిరిగా ప్రక్కనుంచి జాగా తీయండి. మరియు పచ్చి ఇటుకలు సున్నం పరచండి. ఎలాగైతే ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అ లైహి వసల్లం) గారి (సమాధి)కి చేయబడిందో' అని అన్నారు.[38]

## లహద్ సమాధి అంటే ?

**బగ్లీ సమాధి :** సమాధి లోపల కుడి వైపు డొక్క మాదిరిగా చంక తరహాలో గోరిని త్రవ్వటం. తరువాత ఆ చంకలా ఉండే గుంతలో శవాన్ని ఉంచి, ఆ శవంపై మట్టి పడకుండా పచ్చి ఇటుకలు లేక నాపరాళ్ళను వంకరగా పేర్చే పద్ధతిని **'లహద్ సమాధి'** అంటారు. ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారికి ఈ విధానం అతి ఇష్టమైనది. అలాగే ఆయన కొరకు లహద్ గోరి (బగ్లీ సమాధి) త్రవ్వటం జరిగింది.

## షఖ్ సమాధి అంటే ?

**సందోఖి (పెట్టె లాంటి) సమాధి:** సమాధిలో బగ్లీ తీయకుండా సాధారణంగా గుంత త్రవ్వుతారు. ఈ విధానం కూడా అనుమతించబడింది. సమాధి త్రవ్వేటప్పుడు ఒకవేళ ఇతర శవాల ఎముకలు వెలువడితే వాటిని తెంపడంగాని లేక విరగ్గొట్టడం గాని చేయకూడదు. ఎందుకంటే ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"ఒక బ్రతికున్న మనిషి ఎముకను విరగ్గొట్టడం ఎంత పాపమో ఒక మృతుని ఎముకను విరగ్గొట్టడం కూడా అంతే పాపం."[39]

కొంతమంది ప్రజలు శ్మశానం నుండి బయటకు వచ్చి లేక సమాధి దగ్గర నుండి నలభై అడుగుల దూరంగా వచ్చి దుఆ లేక ఫాతెహాలు చేస్తారు. అలా చేయడం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) పద్ధతి కాదు. ఎందు కంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆదేశం మేరకు ఖనన సంస్కారం జరిగిన తరువాత సమాధి దగ్గర నిలబడి దుఆ చేయమనీ ఆదేశించారు.

హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మృతుని ఖనన సంస్కారాలు ముగిసిన తరువాత అతని సమాధి దగ్గర నిలబడి,'మీ సోదరుని మన్నింపు కోసం ప్రార్థించండి. ఇప్పుడతన్ని విచారించటం జరుగుతుంది. కనుక మీరు అతని (విశ్వాస) స్థిరత్వం లభించాలని కోరుకోండి' అని ఆదేశించేవారు.[40]

సమాధి దగ్గర నిలబడి దుఆ చేయడం మాత్రమే ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆదేశం. అంటే, ప్రతి ఒక్కరు మృతుని కొరకు దుఆ చేయడం ధర్మ పద్ధతి.

గురువుగారు దుఆ చేస్తూవుంటే ఇతరులు సామూహికంగా ఆమీన్ చెప్పడం కూడా ధర్మం కాదు. ఎందుకంటే, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అక్కడ ఉన్నవారిని దుఆ చేయమని ఆదేశించారు. కాని కలిసి దుఆ చేద్దామనీ అనలేదు.

సమాధి వద్ద ఫాతిహాలు, ఖుర్ఆన్ లేక సూరయే యాసీన్ చదవడం ధర్మ పద్ధతి కాదు. ఇలాంటి ఆచారాలు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అనుచరులు ఎన్నడూ చేయలేదు. అలాంటి పనులు మనం చేస్తే బిద్అత్ ఆచారా లుగా భావించబడతాయి.[41]

## సమాధుల నిర్మాణం

"ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సమాధి, ఒంటె గోపు రంలా చేయబడింది."[42]

మరియు ఆ సమాధి ఎత్తు నేలకు ఒక జానెడు మాత్రమే ఉంచబడింది.[43]

హజ్రత్ జాబిర్ (రజియల్లాహు అన్హు) ఉల్లేఖనం ప్రకారం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం): "సమాధిని పటిష్ఠవంతం చేయడాన్ని, దానిపై కూర్చో వటాన్ని, దానిపై కట్టడం నిర్మించడాన్ని నిషేధించారు."[44]

హజ్రత్ అలీ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నాతో ఇలా అన్నారు: "ప్రతి విగ్రహాన్ని (ఫోటోను) పగలగొట్టు మరియు ప్రతి ఎత్తుగా ఉన్న సమాధిని (నేలకు) సమానంగా చెయ్యి."[45]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సమాధులపై (పేర్లను లేక ఇతర వాక్యాలను) ముద్రించటాన్ని నిషేధించారు.[46]

సమాధిని పక్కాగా నిర్మించటం ఒక వృధా ప్రయాస మాత్రమే. దానివల్ల మరణించిన వారికి ఎలాంటి ప్రయోజనం దక్కదు. అదీగాక సమాధిని ఆ విధంగా గౌరవించటం, ఆరాధించడం ఒక ముస్లింని షిర్క్ వైపునకు గొనిపోతుంది. సమాధుల మీద గుంబద్‌లు, గోపురాలు నిర్మించటం కూడా అలాంటిదే. పోతే, సమాధుల మీద కూర్చోవటం వాటిలో ఉండే మనుషుల గౌరవానికి విరుద్ధం.

అలాగే కొందరు శవపేటికను పూలతో అలంకరిస్తారు. ఇంకా సమాధిపై కూడా పూలు వేస్తారు. ఇలా పూలు వేయడం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) పద్ధతి కాదు. ఇలాంటి ఆచారాలకు దూరంగా ఉండటమే ఉత్తమమైన ధర్మపద్ధతి.

## సమాధుల సందర్శనం

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) శ్మశానాన్ని సందర్శిస్తే ఇలా చదివేవారు.

**السَّلَامُ عَلَى أَهْلِ الدِّيَارِ مِنَ الْمُؤْمِنِينَ وَالْمُسْلِمِينَ وَ يَرْحَمُ اللَّهُ الْمُسْتَقْدِمِينَ مِنَّا وَالْمُسْتَأْخِرِينَ وَإِنَّاإِنْ شَاءَ اللَّهُ بِكُمْ لَاحِقُونَ.**

**"అస్సలాము అలా అహ్లిద్ దియారి మినల్ మూమినీన, వల్ ముస్లిమీన, వ యర్‌హముల్లా హుల్ ముస్‌తఖ్‌దిమీన మిన్నా వల్ ముస్‌తఅ్‌ఖిరీన, వ ఇన్నా ఇన్‌షా అల్లాహు బికుమ్ లాహిఖూన."**

(ఓ ఈ గృహవాసులైన విశ్వాసులారా! ముస్లిములారా! మీపై శాంతి కలుగు గాక మరియు మాకంటే ముందుగా పోయిన వారిని, మా తరువాత పోయే వారిని అల్లాహ్ కరుణించుగాక. అల్లాహ్ చిత్తమైతే మేము కూడా మీతో (దగ్గరలోనే) కలుస్తాము)[47]

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సమాధులపై కూర్చునేవారి మరియు వాటిమీద నడిచేవారి గురించి హెచ్చరిస్తూ ఇలా అన్నారు: 'మీలో ఎవరైనా సమాధిపై కూర్చోవడం (నడవడం) కంటే, అగ్నిపై కూర్చొని అతని బట్టలు కాలి పోయి చర్మాన్ని అంటుకున్నా మేలేనని అనిపిస్తుంది."[48]

హజ్రత్ బురైద బిన్ హుసైబ్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"నేను మీకు సమాధులను సందర్శించరాదని చెప్పి ఉన్నాను. కాని ఇక నుంచి మీరు వాటిని సందర్శించండి. (ఎందుకంటే) సమాధుల సందర్శనం పరలోకాన్ని జ్ఞప్తికి తెస్తుంది."[49]

ఈ హదీసు ద్వారా 'మనిషిలో పరలోక చింతనను కలిగించి, తనలో భయ భక్తిని పెంపొందించి మరియు చనిపోయినవారి మన్నింపునకై వేడుకోవటానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అనుమతిని ప్రసాదించారనే విషయం తెలుస్తుంది. వారి గురించి దుఆ చేయాలని ఖుర్ఆన్‌లో కూడా అల్లాహ్ ఇలా తెలియజేశాడు. వారి (చనిపోయిన) తరువాత వచ్చినవారు వారిలా వేడుకుంటారు.

"మా ప్రభూ! మమ్మల్ని క్షమించు. మాకన్నా ముందు విశ్వసించిన మా సోదరులను కూడా క్షమించు, విశ్వాసుల యెడల మా హృదయాలలో ఎలాంటి ద్వేష భావాన్నీ కలిగించకు. మా ప్రభూ! నిశ్చయంగా నీవు మృదు స్వభావం కలిగిన వాడవు, కనికరించేవాడవు."[50]

కాని కొంతమంది ప్రజలు సమాధుల సందర్శనం అంటే, సమాధుల వద్ద లేక దర్గాల వద్ద ఉరుసుల పేరుతో బాజా భజంత్రీలు, ఖవ్వాలి, ఇతర ఆటపాటలు చేయటానికి, మొక్కుకోవటానికి, మొరపెట్టుకోవటానికి, అర్పణాలు మరియు ఇతర అధర్మ ఆచారాలు చేయటానికి వెళుతుంటారు. ఇలాంటి ఉద్దేశ్యంతో మరియు ఆచారాలతో సందర్శించటం ఎంత మాత్రం ధర్మపద్ధతి కాదు. అలా చేసేవారు

అల్లాహ్‌తో క్షమాపణ కోరి తమ ఆచారాలను ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సున్నతులకు అనుగుణంగా సరిదిద్దుకోవాలి. లేదంటే పరలోకంలో నష్ట పోతారు, విఫలులవుతారు.

దర్గాల నిర్మాణం మరియు వాటి సందర్శనం అక్కడ చేసే ఏ ఒక్క ఆచారానికీ ఎలాంటి ఆధారాలు లేవు. కస్మూర్ దర్గా, అజ్మీర్ దర్గా మరియు ఇతర దేశ విదేశా లలో ఉన్న దర్గాలకు ప్రయాణించడం అనేది నిషిద్ధం. పైగా వాటిని ప్రత్యే కంగా సందర్శించే అనుమతి కూడా లేదు. ఎందుకంటే?

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

(لَا تُشَدُّ الرِّحَالُ إِلَّا إِلَى ثَلَاثَةِ مَسَاجِدَ الْمَسْجِدِ الْحَرَامِ وَمَسْجِدِ الرَّسُولِ صَلَّى اللَّهُ عَلَيْهِ وَسَلَّمَ وَمَسْجِدِ الْأَقْصَى).

“మీరు మూడు మసీదులకు తప్ప మరే చోటుకు (ఆరాధన భావంతో) ప్రయాణం చేయకండి. ఒకటి, కాబతుల్లాహ్; రెండు, మస్జిదె నబవి; మూడు, మస్జిదె అఖ్సా (బైతుల్ ముఖద్దస్)”[51]

## వితంతువు

అల్లాహ్ ఖుర్ఆన్ గ్రంథంలో ఇలా తెలియజేశాడు: “మీలో ఎవరయినా మరణించి, వారు భార్యలను వదలిపోతే అటువంటి స్త్రీలు నాలుగు మాసాల పది రోజుల వరకూ తమను తాము గడువు (ఇద్దత్)లో ఆపుకోవాలి.”[52]

హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజియల్లాహు అన్హా) గారి సోదరుడు మరణిం చారు. మూడు రోజుల తరువాత ఆమె పరిమళాన్ని తెప్పించి పూసుకున్నారు. తరువాత ఇలా ప్రవచించారు: ‘నాకు పరిమళం అవసరమేమి లేదు.’ కాని నేను ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవచించిగా ఇలా విన్నాను:

“ఏ మహిళ అయితే అల్లాహ్‌ను, పరలోక దినాన్ని విశ్వసిస్తుందో, ఆమె మూడు రోజుల కంటే ఎక్కువగా శోకంలో ఉండటం నిషిద్ధం, కాని తన భర్త శోకం గడువు నాలుగు నెలల పది రోజుల వరకు ఉంది.”[53]

వితంతువులు గర్భవతులై ఉంటే, వారి ఇద్దత్ (గడువు) ప్రసవం వరకు ఉంటుంది. కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు.

"గర్భిణీ స్త్రీల ఇద్దత్ వారి కాన్పు అయ్యే వరకు ఉంటుంది."[54]

గర్భిణీ స్త్రీలు ఎనిమిది నెలలు లేక ఎనిమిది రోజుల తరువాత కాన్పు జరిగినా, వారి ఇద్దత్ (గడువు) ప్రసవించిన వెంటనే పూర్తి అవుతుంది.

ఈ గడువు కాలంలో వితంతువు తన భర్త ఇంట్లోనే ఉండాలి. గడువు పూర్తి అయ్యే వరకు సింగారించుకోవటం, తలలో పూలు పెట్టుకోవటం, పరిమళాన్ని రాసుకోవటం, సుర్మా లేక కాటుక పెట్టుకోవటం వంటివి చేయకూడదు. అలాగే రంగురంగుల గాజులు చేతులలో ఉంటే వాటిని కూడా తొలిగించాలి.

వితంతువు తన ఇద్దత్ పూర్తిగా గడిపిన తరువాత అలంకరించుకోవచ్చు. పెద్దలను సంప్రదించి పునర్వివాహం చేసుకోదలిస్తే లేక పెద్దలు వారి వివాహం చేయాలనుకుంటే వితంతువుల అంగీకారం తరువాత చేయడం గొప్పకార్యం.

కొంతమంది స్త్రీలు వితంతువు మెడలో ఉన్న నల్లపూసలను, చేతి గాజులను, కాళ్ళ మెట్టెలను తెంపటం లేక తీయడం ఆచారంగా భావిస్తారు. పైగా నికాహ్ రోజు నల్లపూసల దండ స్త్రీ మెడలో వేయడం, కాలి వ్రేళ్ళలో మెట్టెలు తొడగడం స్త్రీకి సుమంగళిగా కూడా భావిస్తారు. అందుకనే భర్త చనిపోగానే వాటిని తొలగిస్తారు. భర్త లేనివారు లేక పెళ్ళి కానివారు వాటిని ధరించరు. అటువంటి ఆచారాలకు ఇస్లాం ధర్మంలో ఎలాంటి ఆధారాలు లేవు. పైగా ఇది ముస్లిమేతరుల ఆచారం.

ధర్మం తెలియని కొంతమంది ప్రజలు వారి బంధుమిత్రులలో ఎవరైనా మరణిస్తే ప్రతి ఒక్కరు నలభై రోజుల పాటు శోకాన్ని పాటిస్తారు. వారు సాధారణమైన (శాఖాహారం) భోజనం తింటారు. మాంసం మరియు బిరియాని వంటి భోజనం తమపై నిషేధించుకుంటారు. నలభై రోజుల వరకు తల వెంట్రుకలు మరియు గడ్డాలను పెంచుకుంటారు. క్రొత్త దుస్తులు ధరించరు. వారిలో వివాహం చేయవలసిన తేదీలు దగ్గరలో ఉన్నా నలభై రోజుల తరువాతే చేస్తామని వాయిదాలు వేస్తారు. ఇలా అనేక రకాలుగా ఇస్లాం ధర్మంలో లేని ఆచారాలను జొప్పించి విధిగా పాటిస్తారు. అలా చేయడం ఎంత మాత్రం ధర్మసమ్మతం కాదు.

## మరణించిన తరువాత కూడా మనిషికి లభించే పుణ్యాలు

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "మానవుడు చనిపోగానే అతని

కర్మల పరంపర నిలిచిపోతుంది. కాని మూడు సత్కర్మలు మాత్రం ఎడతెగకుండా అతనికి చేరుతూ ఉంటాయి:

1. మృతుని తరువాత కూడా ప్రజలకు ఉపయోగపడుతూ ఉండే అతని దాన ధర్మాలు.
2. జనులకు లాభం చేకూర్చే అతని విద్య
3. మృతుని కోసం ప్రార్థించే అతని సజ్జన సంతానం.[55]

పైన పేర్కొనబడిన మూడు విధానాల వలన మానవుడు మరణించిన తరువాత కూడా అతనికి పుణ్యం లభిస్తూనే ఉంటుంది. వీటిని 'సదఖయే జారియా' (శాశ్వత పుణ్యకార్యాలు) అని అంటారు. ఉదాహరణకు.

1. మృతుడు గనక తన జీవితంలో మస్జిద్‌లు, సత్రాలు, వైద్యశాలలు, పాఠశాలలు (వగైరా) నిర్మించి ఉంటే అవి నడుస్తున్నంతకాలం, ప్రజలు వాటి ద్వారా ప్రయోజనం పొందుతూ ఉన్నంతకాలం, మృతునికి దాని వల్ల పుణ్యం లభిస్తూనే ఉంటుంది. కనుక మనిషికి మరణానంతరం పుణ్యప్రాప్తి జరగటానికి ఇదొక మార్గం.
2. ప్రజలకు ఉపయోగకరమైన విద్యను బోధించి చనిపోవటం, ఉదాహరణకు, ఖుర్‌ఆన్ హదీసుల గ్రంథాలను క్రోడీకరించటం, మంచి పుస్తకాలు రచించటం, కూడా మనిషికి మరణానంతరం పుణ్యం లభిస్తుంది.
3. కన్నవారి శ్రేయస్సు కోసం ప్రార్థించే పుణ్య సంతానం మరణానంతరం మృతునికి లభించే పుణ్యానికి మూడో మార్గం.[56]

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "విశ్వాసి మరణించిన తరువాత అతను చేసిన కర్మలకు పుణ్యాలు ప్రాప్తమవుతానే ఉంటాయి. అవి: అతను విద్యను బోధించి మరియు దాన్ని విస్తృతం చేసింది. అతను వదలి పెట్టిపోయిన సజ్జన సంతానం. లేక వారసత్వంగా వదలిన ఖుర్‌ఆన్. లేక మస్జిద్ నిర్మాణం. లేక (బాటసారుల కొరకై) సత్రం నిర్మాణం. లేక అతను తన జీవితంలో ఆరోగ్యంగా ఉంటు తన ధనంలో నుండి చేసిన దానం.

దాని పుణ్యం అతను చనిపోయిన తరువాత కూడా పొందుతూ ఉంటాడు.”[57]

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: “ఏ ముస్లిమయితే మొక్కలను నాటితే, లేక వ్యవసాయం చేస్తే, దాని (ఆ పండిన పంటలో) నుండి పక్షులు లేక మనుషులు, లేక జంతువులు తినడం వలన అతనికి దానం చేసినట్లు పుణ్యం లభిస్తుంది.”[58]

4. మృతునిపై ఇతరుల ఋణం చెల్లించవలసి ఉంటే, అతని తరఫున దాన్ని చెల్లిస్తే మృతునికి ప్రయోజనం కలుగుతుంది.

హజ్రత్ అబూ హురైరా (రజియల్లాహు అన్హు) కథనం: ప్రకారం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

“విశ్వాసి ఆత్మ అతను చేసిన అప్పును తీర్చే వరకు (ఆకాశానికి భూమికి మధ్య) ఊగిసలాడుతూ ఉంటుంది.” (సుఖాన్ని పొందదు)[59]

హజ్రత్ అబూ ఖతాదా(రజియల్లాహు అన్హు) ఒక వ్యక్తి ఋణాన్ని తీర్చేశానని చెప్పగా, ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ‘అతని చర్మము (సమాధిలో అగ్ని వేడినుండి) ఇప్పుడు చల్లారిపోయిందని తెలియజేశారు.”[60]

5. మృతునిపై మొక్కుబడి చెల్లించవలసి ఉంటే, అతనికి సంబంధించినవారు ఆ మొక్కుబడిని చెల్లించడం వలన ప్రయోజనం కలుగుతుంది.

హజ్రత్ సఅద్ బిన్ ఉబాదా (రజియల్లాహు అన్హు) ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) గారితో ఇలా విచారించారు: “మా అమ్మ బ్రతికుండగా ఒక మొక్కుబడి చేసింది. కాని ఆ మొక్కుబడిని తీర్చక ముందే చనిపోయింది. ఇప్పుడు నేను ఆమె తరఫున ఆ మొక్కుబడిని తీర్చవచ్చునా?” దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం), “నీవు ఆమె తరఫున మొక్కుబడిని తీర్చు” అని అన్నారు. [61]

6. మరణించిన వ్యక్తి ఉపవాసాలు పాటిస్తానని మొక్కుకొని ఉంటే, అతనికి సంబంధించినవారు ఆ ఉపవాసాలను పాటించడం వలన ప్రయోజనం కలుగుతుంది.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా సెలవిచ్చారు: “ఏ వ్యక్తిపై (మొక్కుబడి వలన) అయితే ఉపవాసాలను పాటించవలసి ఉండగా చనిపోతే, ఆ ఉపవాసాలను అతని వలీ (బంధువులు) పాటించాలి.”[62]

ఇమామ్ ఇబ్ను ఖయ్యిమ్ ..... గారు ఇలా తెలియజేశారు: “విధి గావించ బడిన ఉపవాసాలు విధి గావించబడిన నమాజుతో సమానమైనవి. మృతుని తరఫున ఎలాగైతే విధిగా ఉన్న నమాజును ఇతరులు పాటించకూడదో, అలాగే విధిగా ఉన్న ఉపవాసాలను కూడా ఇతరులు పాటించకూడదు. మరణించిన వ్యక్తి తరఫున ఋణ భారాన్ని ఇతరులు చెల్లిండం ఆమోదకరమైన ఆచారం. అలాగే మొక్కుబడి వలన పాటించవలసిన ఉప వాసాలను ఇతరులు పాటించడం కూడా ఆమోదకరమైన ఆచారమే.[63]

7. మృతుడు తనపై విధిగావించబడిన హజ్ విధిని నెరవేర్చని పక్షంలో, లేక హజ్ నెరవేర్చమనీ వసీఅత్ (హితవచనం) చేసి ఉంటే, లేక మృతుడు తన జీవితంలో మొక్కుకున్న హజ్ నెరవేర్చని పక్షంలో, ఇతరులు ఆ హజ్‌ను నెర వేర్చితే అతనికి ప్రయోజనం కలుగుతుంది.

హజ్రత్ బురైదా (రజియల్లాహు అన్హు) కథనం: ఒక మహిళ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్దకు వచ్చి ఇలా విన్నవించు కున్నది. “మా అమ్మ చనిపోయింది. ఆమె హజ్ విధిని నెరవేర్చలేదు. నేనామె తరఫున హజ్ చేయగలనా?” దానికి ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం) ‘అవును’ అని అన్నారు.[64]

ఒక మహిళ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్దకు వచ్చి, “మా అమ్మ హజ్ చేస్తానని మొక్కుకుంది.[65] కాని ఆమె హజ్ చేయకుండానే చనిపోయింది. నేనామె తరఫున హజ్ చేయగలనా?” అని విన్నవించు కున్నది. దానికి ఆయన (సల్లల్లాహు అలైహి వ సల్లం (ఇలా బదులిచ్చారు): ‘అవును, ఆమె తరఫున హజ్ చేయి. నీ తల్లిపై ఋణభారం ఉంటే నువ్వు దాన్ని తీర్చేదానివి కదా? అలాగే అల్లాహ్ హక్కును కూడా తీర్చాలి. దాన్ని (మొక్కుబడి) తీర్చగలిగేందుకు అల్లాహ్‌యే ఎక్కువ అర్హుడు.’[66]

8. మృతుని చుట్టాలు అతని శ్రేయస్సు కొరకై అల్లాహ్ మార్గంలో దానధర్మాలు చేస్తే అతనికి ప్రయోజనం కలుగుతుంది.

హజ్రత్ ఆయిషా (రజియల్లాహు అన్హా) ఉల్లేఖనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) వద్దకు ఒక వ్యక్తి వచ్చి, "మా అమ్మ హఠాత్తుగా మరణించింది. ఆమె తన వసీయత్ (హితవచనం) కూడా చేయలేదు. నిశ్చయంగా ఆమెకు సమయం ప్రాప్తమయి ఉంటే దానధర్మం చెయ్యమని తప్పక నాతో అనేది. ఆమె కొరకు దానం చేస్తే నాకు మరియు మా అమ్మకు దాని పుణ్యం లభిస్తుందా? అని అడిగాడు. దానికి ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) 'అవును' అని అన్నారు. తరువాత ఆ వ్యక్తి తమ అమ్మ తరఫున దానం చేసాడు."[67]

9. **మరణించిన వ్యక్తికి మొక్కల పెంపకం వలన పుణ్యం లభిస్తుంటుంది**

హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజియల్లాహు అన్హు) కథనం: ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: "ఏ ముస్లిమయితే చెట్ల మొక్కలను నాటితే, లేక వ్యవసాయం చేస్తే, దాని (ఆ పండిన పంటలో) నుండి పక్షులు లేక మనుషులు లేక జంతువులు తినడం వలన అతనికి దానం చేసినట్లు పుణ్యం లభిస్తుంది."[68]

**ముఖ్యగమనిక :** మరణించిన బంధుమిత్రులకు పుణ్యాలు లభించుటకై కొంతమంది ముస్లిం ప్రజలు ఇతరులను పిలిపించి, లేక ఇతరులకు డబ్బులు ఇచ్చి లేక అన్నం పెట్టి ఖుర్ఆన్ పారాయణ సభలు నిర్వహిస్తారు. కాని ఇలాంటి ఆచారానికి ఖుర్ఆన్, హదీసుల ద్వారా ఎలాంటి ఆధారం లేదు. ఇది ధర్మపద్ధతి కూడా కాదు. ఇది ఒక బిద్అత్ ఆచారంగా ప్రజల్లోకి చేరినట్లు అనేక ధర్మ గురువుల అభిప్రాయం.

ఒకవేళ పుణ్యకార్యాల కారణంగా మరణించిన బంధుమిత్రులకు పుణ్యం చేరాలనుకుంటే మద్రసాలలో ఖుర్ఆన్ మరియు హదీసు చదివే విద్యార్థుల కొరకు దానంగా ఇస్తే, పుణ్యం చేరుతుంది. లేక వాటి కట్టడాల కొరకు దానం చేస్తే పుణ్యం చేరుతుంది.

## శ్రాద్ధకర్మ (దివసం)

శ్రాద్ధకర్మ అంటే హైందవులు చనిపోయినప్పుడు 10వ రోజు మరియు 20వ రోజు లేక 40వ రోజు మరియు సంవత్సరానికి ఒకసారి మరణించిన వారి

శ్రేయస్సు కొరకు పూజారులను ఆహ్వానించి చదివింపులు జరుపుతారు.

రాత్రంతా భక్తి కథల సభలను ఏర్పాటు చేస్తాడు. భోజనాల ఏర్పాటు చేస్తారు. తరువాత పూజారులకు కొంత ధనాన్ని విరాళంగా కూడా ప్రసాదిస్తారు. ఇలా నిర్వహించే కార్యాలను శ్రాద్ధకర్మ లేక దివసం అంటారు.

అదే విధంగా కొంతమంది అమాయకమైన ముస్లిం ప్రజలు దస్మా, బీస్మా, చాలిస్మా మరియు బర్సీ అంటూ ఖుర్ఆన్ పారాయణం చేసేవారిని పిలిపించి ఖుర్ఆన్ చదివింపులు జరుపుతారు. కొందరు రాత్రంతా సియర్ పేరున కొన్ని భక్తి పుస్తకాలను, భక్తి పాటలను పాడుతారు. భోజనాల ఏర్పాటు చేస్తారు. తరువాత పారాయణం చేసేవారికి కొంత ధనాన్ని విరాళంగా కూడా ప్రసాదిస్తారు. మృతునికై ప్రార్థనలు, ఫాతిహాలు చేస్తారు. గురువులు మరియు గ్రంథాలు వేరయినప్పటికీ ఆచార విధానాలు ఒక్కటే కదా.

కొంతమంది ప్రజలు పెద్దల పండుగ (బడోంకి ఈద్ లేక ముర్దోంకి ఈద్) పేరున షాబాన్ 16వ తేదీన మరియు బక్రీద్ పండుగ రోజు అనేక రకాల పండ్లు, ఫలాలు, అన్నపానీయాలు మరియు ఇతర వస్తువులు ఒక గదిలో పెట్టి సాంబ్రాణి పొగలు రేకెత్తించి ఫాతిహాలు చేస్తారు. ఖుర్ఆన్ నుండి ప్రత్యేకమైన సూరాలను వందల సార్లుగా పఠించి వారి కొరకు ఆ పుణ్యాన్ని సమర్పించినట్లు భావిస్తారు. ఆ రోజులను పెద్దల శ్రేయస్సు కొరకై చేసే పండుగలుగా భావిస్తారు.

కొంతమంది ప్రజలు ఆ దినాలలో పెద్దల శ్రేయస్సు కొరకు తమ బంధు మిత్రుల సమాధులను ప్రత్యేకంగా సందర్శిస్తారు. వారి పేరున ఫాతిహాలు చేస్తారు. ఆ సమాధులపై దీపాలు, అగరబత్తీలు వెలిగిస్తారు. తీపి వస్తువులు కూడా పంచి పెడతారు. అలా ఇస్లాం ధర్మంలో లేనటువంటి అనేక విధాల ఆచారాలు పాటించి మరణించిన బంధుమిత్రులకు మేలు చేస్తున్నామని విశ్వసిస్తారు.

ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అలాంటి ఆచారాల గురించి మనకేమైనా ఆదేశాలు జారీ చేసారా? లేక ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అనుచరులు అలాంటి కార్యాలు పాటించారా? మీరే ఆలోచించండి! ముమ్మాటికి వారు ఎన్నటికీ అలా చేయనేలేదు. అలా చేసివుంటే హదీసు గ్రంథాలలో వాటి ప్రస్తావన తపపక వచ్చి ఉండేది. అలా హదీసు గ్రంథాలలో వాటి

గురించి ఎలాంటి ప్రస్తావన లేదంటే, ఆ కార్యాలను, పాటించడం ముస్లిం సమాజానికి ధర్మమేనా?

అటువంటి కార్యాలు పాటించడం, ధర్మవిరుద్ధం అనుకుంటే, ఈ రోజు నుండే దస్మా, బీస్మా, చాలిస్మా మరియ బర్సీ, పెద్దల పండుగలు అనే ఆచారాలను విడిచి ధర్మపరంగా ధర్మవిధానంలో ఉన్న కార్యాలను మాత్రమే పాటించండి. దాని వల్ల మీరు అల్లాహ్ ప్రేమను పొందుతారు.

కనుక అల్లాహ్ ఇలా తెలియజేశాడు: "(ఓ ప్రవక్తా!) వారికి ఇలా చెప్పు: మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే మీరు నన్ను అనుసరించండి. (తత్ఫలితంగా) అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడు, అపారంగా కనికరించేవాడు."–ఇంకా వారికి ఇలా చెప్పు: "మీరు అల్లాహ్‌కు ఆయన ప్రవక్తకు విధేయులై ఉండండి. ఒకవేళ వారు విముఖత చూపితే అల్లాహ్ తిరస్కారులను ఏ మాత్రం ఇష్టపడడు."[69]

మరో చోట అల్లాహ్ ఇలా హెచ్చరించాడు: "ప్రవక్త (ముహమ్మద్) మీకు ఇచ్చిన దానిని తీసుకోండి. ఆయన మిమ్మల్ని నిషేధించిన దాని జోలికి పోకండి."[70]

అల్లాహ్ లేక ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ద్వారా ప్రచురించని కార్యాలను ఇతరుల ద్వారా ప్రచురించబడిన లేక ఆచరించబడిన కార్యాలను పుణ్యంగా భావించి ఆచరించే కార్యాలనే 'బిద్అత్' అంటారు.

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజియల్లాహు అన్హు) కథనం: ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు:

"వాక్యాలలో అన్నిటికంటే సత్యమైన వాక్యం అల్లాహ్ గ్రంథం (ఖుర్ఆన్) మరియు మార్గాలన్నిటిలోకి అతి ఉత్తమమైన మార్గం ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మార్గం మరియు ఆచారాలలో అతి చెడు ఆచారం క్రొత్త ఆచారాలు మరియు ప్రతి క్రొత్త ఆచారం బిద్అత్, ప్రతి బిద్అత్ మార్గ విహీనమైనది మరియు ప్రతి మార్గ విహీనం నరకానికి తీసుకువెళ్ళుతుంది...[71]

---

1. *(సహీహ్ ముస్లిం : 4760)*
2. *(సహీహ్ ముస్లిం : 4658)*

3. *(సహీహ్ బుఖారీ : 5210)*
4. *(సహీహ్ బుఖారీ : 5213)*
5. *(సహీహ్ బుఖారీ : 5220, సహీహ్ ముస్లిం : 4673)*
6. *(సహీహ్ అబూదావూద్ : 3106, సహీహ్ తిర్మిజీ : 2083)*
7. *(సహీహ్ బుఖారీ : 5241)*
8. *(సహీహ్ బుఖారీ : 3347)*
9. *(సహీహ్ ముస్లిం : 4082)*
10. *(సహీహ్ ముస్లిం : 4056)*
11. *(సహీహ్ అబూదావూద్ : 3116, హాకీమ్)*
12. *(సహీహ్ బుఖారీ : 3394)*
13. *(సహీహ్ బుఖారీ : 1240, సహీహ్ ముస్లిం : 1570)*
14. *(హాకిమ్, బైహఖీ, అహ్కాముల్ జనాయిజ్ లిల్ అల్బాని : 30)*
15. *(సహీహ్ ముస్లిం : 1528)*
16. *(సహీహ్ బుఖారీ : 1175, సహీహ్ ముస్లిం : 1557)*
17. *(సహీహ్ బుఖారీ : 1180, సహీహ్ ముస్లిం : 1557)*
18. *(సహీహ్ ఇబ్నుమాజా : 1465)*
19. *(సహీహ్ అబూదావూద్ : 3143)*
20. *(హాకిమ్, బైహఖీ, కితాబుల్ జనాయిజ్ లిల్ అల్బానీ : 100)*
21. *(సహీహ్ అబూదావూద్ : 3163)*
22. *(సహీహ్ బుఖారీ : 1185)*

    *చాలా మంది ధర్మగురువుల అభిప్రాయం ప్రకారం; స్త్రీల, భౌతిక కాయానికి మూడు వస్త్రాలతో పాటు, ఇంకా రెండు వస్త్రాలు తలపై మరియు రొమ్ముపై కప్పుటకు వాడుతారు.*

    *స్త్రీల భౌతిక కాయానికి ఐదు లేక పురుషుల భౌతిక కాయానికి మూడు వస్త్రాలు లభించకపోతే, ఒక్క వస్త్రంలోనే చుట్టి ఖననం చేయవచ్చును. అవి కూడా లభ్యం కాకపోతే, అతను ధరించే శుభ్రమైన వస్త్రాలలో చుట్టి ఖననం చేయవచ్చును.*

23. *(సహీహ్ బుఖారీ : 5367)*
24. *(సహీహ్ అబూదావూద్ : 3180, అహ్కాముల్ జనాయిజ్ లిల్ అల్బానీ : 50)*
25. *(సహీహ్ అబూదావూద్ : 3179, అహ్కాముల్ జనాయిజ్ లిల్ అల్బానీ : 52)*
26. *(సహీహ్ బుఖారీ : 1224, సహీహ్ ముస్లిం : 1590)*
27. *(సహీహ్ బుఖారీ : 1199, సహీహ్ ముస్లిం : 1556)*
28. *(మజ్మూ అల్ ఫతావా : 24/293) శవాన్ని శ్మశానానికి తీసుకుపోయేటప్పుడు ఫాతిహాలు పఠిస్తారు. గోధుమలు, ఉప్పు శ్మశానానికి తీసుకుపోతారు. లేక ఇంటి వద్ద దాన్ని సదఖాగా పంచిపెట్టే ఆచారాలు నిర్వహిస్తారు. అలాంటి కార్యాలకు ఖుర్ఆన్, హదీసుల ద్వారా ఆధారాలు లేవు. ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) మరియు ఆయన సహాబాలు కూడా ఇలా చేసేవారు కారు. ఇలాంటి అధర్మమైన కార్యాలను మానుకోవడంలో అల్లాహ్ మరియు ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రేమ పొందగలిగే అవకాశముంది.*
29. *(సహీహ్ బుఖారీ : 1208, సహీహ్ ముస్లిం : 1539)*
30. *(సహీహ్ బుఖారీ : 1206, సహీహ్ ముస్లిం : 1544)*
31. *(సహీహ్ బుఖారీ : 1220)*
32. *(సహీహ్ బుఖారీ : 6829, సహీహ్ ముస్లిం : 1531)*
33. *(సహీహ్ బుఖారీ : 1231, సహీహ్ ముస్లిం : 1568)*
34. *(సహీహ్ ముస్లిం : 1373)*
35. *(సహీహ్ తిర్మిజీ : 1713)*
36. *(సహీహ్ అబూదావూద్ : 3211)*
37. *(సహీహ్ ఇబ్నుమాజా : 1550, హాకిమ్ : 1302)*
38. *(సహీహ్ ముస్లిం : 1606, సహీహ్ ఇబ్నుమాజా : 1556)*
39. *(సహీహ్ అబూదావూద్ : 3207, సహీహ్ ఇబ్నుమాజా : 1616)*
40. *(సహీహ్ అబూదావూద్ : 3221)*
41. *(జాదుల్ మఆద్ : 1/522-527, కితాబుల్ జనాయిజ్ లిల్ అల్బానీ : 325)*
42. *(సహీహ్ బుఖారీ : 1302)*

43. (సహీహ్ బైహఖీ :..)
44. (సహీహ్ ముస్లిం : 1610)
45. (సహీహ్ ముస్లిం : 1609)
46. (సహీహ్ అబూదావూద్ : 3225, హాకిమ్ : 1/370)
47. (సహీహ్ ముస్లిం : 1619)
48. (సహీహ్ ముస్లిం : 1612, సహీహ్ అబూదావూద్ : 3228)
49. (సహీహ్ ముస్లిం : 1623, సహీహ్ ఇబ్నుమాజా : 1571)
50. (సూరతుల్ హష్ర్ : 10)
51. (సహీహ్ బుఖారీ : 1115, సహీహ్ ముస్లిం : 2475)
52. (సూరతుల్ బఖరా : 234)
53. (సహీహ్ బుఖారీ : 1202, సహీహ్ ముస్లిం : 2731)
54. (సూరతు తలాఖ్ : 4)
55. (సహీహ్ ముస్లిం : 3084)
56. (హదీసు కిరణాలు : 949)
57. (సహీహ్ ఇబ్నుమాజా : 242, అహ్కాముల్ జనాయిజ్ : 1/176)
58. (సహీహ్ బుఖారీ : 2152, సహీహ్ ముస్లిం : 2904)
59. (సహీహ్ తిర్మిజీ : 1078, సహీహ్ ఇబ్నుమాజ : 2413, హాకిమ్, మజ్మఅల్ ఫతావా : 24/311)
60. (ముస్నద్ అహ్మద్ : 14004, సహీహ్ అల్ జామీ : 2753)
61. (సహీహ్ బుఖారీ : 2555, సహీహ్ ముస్లిం : 3092)
62. (సహీహ్ బుఖారీ : 1816, సహీహ్ ముస్లిం : 1935)
63. (తహ్జీబుస్ సునన్ : 3/276)
64. (సహీహ్ ముస్లిం : 1939)
65. (మొక్కుబడిని అరబీ భీషలో 'నజ్ర్' అంటారు. ఎవరైనా అనుకున్న ఫలానా పని గనక అయిపోతే లేక నేను ఎదుర్కొంటున్న ఫలానా కఠిన పరీక్ష నుండి నాకు ముక్తి లభిస్తే అల్లాహ్ మార్గంలో ఇంత మొత్తం దానం చేస్తాను అని అనుకుంటే

అది 'నజ్ర్' అవుతుంది. దాన్నే తెలుగులో మొక్కుకోవటం అని అంటారు.

ఈ మొక్కుబడి ధర్మసమ్మతంగా ఉంటే దాన్ని చెల్లించటం తప్పనిసరి. ఒకవేళ అధర్మమైన, దైవధిక్కారంతో కూడుకున్న మొక్కుబడి చేసుకుంటే దాన్ని తీర్చటం సరికాదు. మొక్కుబడి కూడా నమాజ్, ఉపవాసాల మాదిరిగా ఆరాధనే. కాబట్టి అల్లాహ్ పేరున మినహా ఇంకొకరి ఎవరి పేరున మొక్కుకున్నా అది "ఆరాధనలో షిర్క్‌కు తావు కల్పించటంతో సమానమే."

66. *(సహీహ్ బుఖారీ : 1720)*

67. *(సహీహ్ బుఖారీ : 1299, సహీహ్ ముస్లిం : 3082)*

68. *(సహీహ్ బుఖారీ : 2152, సహీహ్ ముస్లిం : 2904)*

69. *(సూరతు ఆలి ఇమ్రాన్ : 31-32)*

70. *(సూరతుల్ హష్ర్ : 7)*

71. *(సహీహ్ ఇబ్ను ఖుజైమా: 1686, సహీహ్ నసాయీ : 1578)*

